# విషయసూచిక.

ఓం.

# ద్వితీయావృత్తి ప్రస్తావన.

ఈ అష్టావక్రగీత (సంహిత) సకలవేదాంతగ్రంథముల కు శిరోమణి యని చెప్పనొప్పును. శ్రీ భగవద్గీత కంటెను మిన్న యని చెప్పినను జెప్పవచ్చును. ఏలయన నిందలి ప్రతి శ్లోకమును అమనస్క రాజయోగమునే ప్రతిపాదించుచున్నది. సాధనచతుష్టయసంపన్నులై, వైరాగ్యబోధోపరతులు గల ముముక్షువులకు నీగ్రంథపఠనము వలన మోక్షము కరస్థము. అట్టి వారలకు

చెలువుగఁ బువ్వులు జీరుట కంటెన్
బొలుపుగఁ గన్నవ మూయుట కంటెన్,
నలువగు నీ యమనస్కపదం బే
సులభము సౌఖ్యము సూక్ష్మము వత్సా!

అని సీతారామాంజనేయసంవాదములోఁ జెప్పఁబడి న యట్లు అతిసూక్ష్మము. (తదితరులకు దుర్లభము.) అట్టి జిజ్ఞాసువులు ఆత్మానుభవము గల సద్గురువు నాశ్రయించి తత్త్వరహస్యములఁ దెలిసికొని, శ్రవణమననిదిధ్యాసనములచేఁ బ్రత్యగభిన్నపరమాత్మను దెలిసికొను మార్గమునఁ బడు రేని యపు డీగ్రంథము మోక్షసామ్రాజ్యమునకు రాజమార్గ మగును.

ఈగ్రంథ మెంత సంగ్రహ ముగ నున్నను జీవః
పేటిక యననొప్పి, ఉత్తరదేశమున శ్రీభగవద్గీతవలె నిత్య
యగ్రంథరాజమై యలరారుచు నిప్పటి కనేకావృత్తుల
ద్రణమై వేలకొలదిప్రతులు చెల్లుబడియైనవి. మనదేశః
1920 సంవత్సరమునకుఁ బూర్వము అష్టావక్రగీతయన
యనేకులకుఁ దెలియకుండె ననియే చెప్పవచ్చును.
సంవత్సరమున 500 ప్రతులు ముద్రింపించినాడను.
కీప్రతులన్నియుఁ జెల్లుబడి యగుటం జేసియు నీగ్రం
ము యొక్క యుత్కర్షత వెల్లడి యైనట్లు తోఁచియు,
పునర్ముద్రణ మత్యావశ్యక మని యెంచి, యీ ద్వితీయ
త్తి ముద్రణమున కుత్సహించితిని.

ఇదివఱకు ప్రచురణమైన గ్రంథమందు కొన్ని
ము లుండుటచే, బ్రహ్మశ్రీ పేరి సుబ్రహ్మణ్యశాస్త్రి
సహాయమున వాని నెల్ల సవరించి, యనేకవిశేషాంశమ
జేర్చినాడను.

పేరూరుపేట
5-5-1937

సుజనవిధేయుఁడు,
కామర్షి వేంకటసుబ్బయ



# పీఠిక.

ఓం శివాయ గురవే నమః.



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య పరమశివేంద్ర (నామక జ్ఞానానంద) స్వామివారు నాకు చిరపరిచితులగుటచే నాయం దత్యంతవాత్సల్యము గలిగి, శ్రీ అక్షయనామసంవత్సరమున కాకినాడలో వేంచేసియున్నపుడు, తఱుచు నాకు దర్శన మిచ్చుచు, తత్త్వార్థరహస్యముల నుపదేశించుచుండిరి. ఒకానొక సమయమున శ్రీ అష్టావక్రగీతను గూర్చి ప్రస్తావించుటయే కాక, ఏతద్గ్రంథరాజమును దెచ్చి యందలి విశేషముల నాకు బోధించిరి. ఈగ్రంథముఁ జదివి యందలి సారము నాత్మావగాహము జేసికొను కొలది మూఢున కయినను తత్త్వజ్ఞానము కలుగక పోదని నానిశ్చయము.

ఈ అష్టావక్రగీత తొలుత కాకినాడ జిల్లా వేరావల నివాసియుఁ, బరమవిజ్ఞానసంపన్నుఁడును, మహాప్మ్రదీయుఁడ ...ము...సు వేదాంతవిద్యాభిలాషియు, శ్రీపంచదశి, విచారసాగరము, విచారచంద్రోదయము, అష్టావక్రగీత, సర్వాత్మభావ ప్రదీపము, దశోపనిషత్తులు, శ్రీమద్భగవద్గీత, వేదాంతపదా

ర్థమంజూషము, మొదలగు ననేక వేదాంతగ్రంథముల నా
మూలాగ్రముగ విమర్శించుటయే కాక, ఏత దనేక వేదాంత
గ్రంథముల ముద్రింపించి ప్రకటించి ముముక్షుజనుల కత్యం
తోపకార మొనరించిన మహనీయుఁడగు హా॥ శరీఫ్ వలె మ
హమ్మదుగారి వలన ముంబాపురమున ముద్రింపఁబడినది. దీ
ని తృతీయావృత్తి ముద్రితప్రతియందు "జనకరాజా ఔర్ శ్రీ
అష్టావక్రమునీకే గాథా" అని హిందీ భాషయందు పీఠిక
వ్రాయఁబడినది. హిందీభాషయందు నాకుఁ బ్రవేశము లేకు
న్నను భాష సంస్కృతపదసమ్మిళితమగుటచే నీగాథను కొంత
వఱకవగాహము చేసికొని, హిందీభాషజ్ఞుల వలన సంశయ
ములఁ దెలిసికొని హిందీ పీఠికను యథాశక్తిఁ దెలుగున వ్రా
సినాఁడను.

ఈసందర్భమున నములాపుర నివాసియగు బ్ర॥ గోడ
వర్తి శేషయ్యశాస్త్రిగారీగ్రంథమును జూచి యానందించి,
దీని నచ్చొత్తింప నన్నుఁ బ్రేరేపించుచు, నీగ్రంథమున కాం
ధ్రవ్యాఖ్యానము రచింప బ్ర॥ పేరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారినిఁ
బ్రోత్సహించిరి. ఈసుబ్రహ్మణ్యశాస్త్రిగారును విజ్ఞానసంప
న్నులగుటచే నీ గ్రంథోత్కర్షత కానందించి, యత్యంతో
త్సాహముతో దీని కాంధ్రవ్యాఖ్యానమును రచించిరి.

ఈ అష్టావక్రగీతయందలి ప్రతిశ్లోకమును సర్వవేదాం
తసారమగు ఆత్మజ్ఞానమునే ప్రతిపాదించుచున్నది. ఇందు

కెంత శ్లోకములు గలవు. ఈశ్లోకము లన్నియు నన్ని కోహి-
నూరు మణులని చెప్పఁదగును.

ఈయుద్గ్రంథ మిదివఱ కుత్తరదేశమందు మాత్రమే మిగుల విఖ్యాతిఁ గాంచి ౧౯౦౯ సంవత్సరము వఱకు సంస్కృతభాషయందు మున్నూరు ముద్రితములు వేలకొలది ప్రతులు ఉత్తరదేశమందే చెల్లుబడియైనవి. కష్టసాధ్యముగ నొక ప్రతిమాత్రము నాకు లభించినది. మన దేశమం దీగ్రంథ రాజము వాడుకలో లేకుండుట మిగుల శోచనీయము. అట్టి లోపముం దీర్ప నీపొత్తము నాంధ్రమున ముద్రింపించి ప్రకటింపఁ బ్రోత్సహించిన బ్ర॥ గొడవర్తి శేషయ్యగారును, నీని కాంధ్రవ్యాఖ్యను రచించిన బ్ర॥ పేరి సుబ్రహ్మణ్యశాస్త్రి గారును మిగుల సంస్తవనీయులు. వారలకు నా వందన సహస్రములు.

ప్రప్రథమమున నీగ్రంథమును నాకుబోధించి, ఆంధ్రవ్యాఖ్యానమును పరిశీలించి దాని సవరించిన శ్రీమత్పరమహంస పరమశివేంద్రస్వామి వారికి శతకోటికోటివందనములు.

శ్లో॥ తావద్గర్జంతి శాస్త్రాణి జంబుకా విపినే యథా,
న గర్జతి మహాశక్తి ర్యావ ద్వేదాంతకేసరీ॥

సుజనవిధేయుడు,

కాకినాడ, 19. 2. 1928

కామర్షి వేంకటసుబ్బయ్య,
పెన్షనర్ అండ్ ఈనాందార్.



ఓం.

శ్రీ గురుపరమాత్మనే నమః.

## శ్రీ అష్టావక్రమునికిని జనకమహారాజునకును సంబంధించిన కథాసంగ్రహము.



# "రికాబ్ మై చరణ ఔ బ్రహ్మకా ఉపదేశ్"



జననమరణరూపప్రవాహముతోఁ గూడిన సంసారరూపదుస్తరసాగరమును దరించుటకు "బ్రహ్మజ్ఞానము" అనగా "వేదాంతవిద్య" గాక యేయితరవిద్యయు సాధనము కాదు. ఈసిద్ధాంతనిరూపణమునకై శ్రీమచ్ఛంకరాచార్యులవారు శ్రీ వివేకచూడామణియందు "నయోగేన న సాంఖ్యేన కర్మణా నో న విద్యయా । బ్రహ్మాత్మైకత్వబోధేన మోక్షః సిద్ధ్యతి నాన్యథా॥" యని చెప్పియున్నారు. కావుననే సర్వవిద్యలకు జ్ఞానవిద్యయే శిరోమణి యని మహాత్ములు నిశ్చయించిరి. శ్రీకృష్ణభగవానులు శ్రీమద్భగవద్గీతయందు "రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమం । ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయం" అని యానతిచ్చెను.

ఈబ్రహ్మజ్ఞానవిద్య సర్వవిద్యలలో పవిత్రమైనది, సర్వోత్తమమై

నది, కాని మిక్కిలి దుర్లభమైనది. కనుక సామాన్యముగ మనుష్యున కనేకజన్మాచరితసుకృతపరిపాకమున గాని యిది ప్రాప్తించదు; అని శాస్త్రకారులు చెప్పునది వాస్తవము కాకపోదు. ఈబ్రహ్మవిద్య కధికారులు ఉత్తమ, మధ్యమ, కనిష్ఠులని మూడు వర్గములుగ నున్నారు. వీరిలో నుత్తమాధికారుల సంఖ్య అత్యల్పము. కనిష్ఠాధికారుల సంఖ్య అతి విస్తృతము. ఈ యర్థమును లెస్సగ నిరూపించుటకు శ్రీకృష్ణభగవానులు శ్రీ గీతయందు క్రింది శ్లోకములో నిట్లు విస్పష్టపరచినారు.

"మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే,
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః ॥"

అట్టి బ్రహ్మజ్ఞానప్రాప్తి సామాన్యముగ ననేకజన్మార్జితసుకృతమున గాని లభించదని శాస్త్రకారులు వ్రాసియున్నారు. కనిష్ఠవర్గము లోని వారలకు విక్షేపావరణరూపమలనివృత్తి దుస్సాధ్యము. మఱియు నీయధికారివర్గములో నెవరికి విక్షేపావరణరూపమలము నష్టమగునో యట్టి వారల కీజన్మమందు సర్వోత్తమసాధన మగు సద్భావము కలిగి బ్రహ్మజ్ఞానము కలుగును. తదితరులకుఁ గడు దుర్లభము. మఱియు బ్రహ్మనిష్ఠా గరిష్ఠుఁడగు సద్గురువు నాశ్రయించి "తత్త్వ మసీ" త్యాది మహావాక్యరూప మహామంత్రములను విశ్వాసముతో విని మననము సేయుట వలన నతి శీఘ్రముగ బ్రహ్మజ్ఞానము కలుగును.

అట్టి బ్రహ్మజ్ఞానమునకు జనకమహారాజు ఉత్తమోత్తమాధికారి. ఆయనకు గుఱ్ఱము నెక్కుచు నొక రికాబులో కాలు పెట్టి రెండవరికాబులో కాలుఁబెట్టునంతస్వల్పకాలములో బ్రహ్మసాక్షాత్కారము కలిగినట్లు క్రింది కథాసంగ్రహము వలనఁ దెలియఁ గలదు.

## —॥కథాసంగ్రహము॥—

ప్రాచీనకాలమందత్యంతబుద్ధిమంతుఁడును, రాజ్యకార్యకుశలుఁడును, ననేకసద్గుణాలంకృతుఁడును, రాజశ్రేష్ఠుఁడు, నగు జనకమహారాజు రాజ్యపరిపాలన జేయుచు తన సభయందు కులగురువును బరమాస్తికుఁడు నగు నొక బ్రాహ్మణపుత్రుఁడు నిత్యము శాస్త్రపఠనముఁ జేయుచు నొకానొక సమయమున, బ్రసంగవశమున "రికాబులో కాలు పెట్టునంతలో బ్రహ్మోపదేశ మగును" అని శాస్త్రములోని కథాపఠనమున వక్కాణింప విని రాజత్యంతాశ్చర్యనిమగ్నుఁడై బ్రాహ్మణపుత్రు నిట్లు ప్రశ్నించెను. "స్వామీ! రికాబులో కాలుపెట్టునంతలో బ్రహ్మోపదేశ మగు" నను శాస్త్రవాక్యము సత్యమా? లేక కల్పితమా?" బ్రాహ్మణపుత్రుఁ డిట్లని ప్రత్యుత్తర మొసఁగెను.

"ఓ మహారాజా! మహాపవిత్రమైన యీశాస్త్రవాక్యము యథార్థము కాకపోవునా?" అందుకు నీ వేమియుఁ శంకింపవలదు.

జనకరాజు— బ్రాహ్మణోత్తమా! నాబుద్ధి కీశాస్త్రవాక్యము కేవల మసంభవ మని తోఁచుచున్నది. ఆవాక్యము యథార్థమే యైనచో నిప్పుడే నాగుఱ్ఱమును రప్పించెదను. అయశ్వమును నేనెక్కు నపు డొక రికాబులో కాలుపెట్టి రెండవరికాబులో కాలుఁ బెట్టునంతలో నాకు బ్రహ్మోపదేశ మొనరించి యీశాస్త్రవాక్యము యొక్క సత్యత్వమును ప్రతిపాదనఁ జేయుము.

బ్రాహ్మణపుత్రుఁడు— ఓయి రాజా! ఈశాస్త్రవాక్య మెంతమాత్రము నసత్యము కాఁజాలదు. అయినను దాని సత్యత్వమును ప్రతిపాదనసేయు సామర్థ్యము నాకు లేదు.

జనకరాజు— ఓబ్రాహ్మణోత్తమా! విద్వాంసుఁడ వయ్యు నీకట్టి

సామర్థ్యము లేనిదే యీశాస్త్రవాక్యము సత్యమని యెట్లు చెప్పుచున్నావు? అశక్యమగు నీశాస్త్రోక్తి సిద్ధింపనిచో నిది కేవలము గల్పనారచితమై యుండును. ఈవాక్యము యొక్క సత్యత్వమును బ్రదర్శింప నీవసమర్థుడవైతివేని యీవాక్యమును ఖండింపుము. (గ్రంథములో తుడుపు పెట్టుమని భావము).

రాజు కుపితుఁడైనట్లు కనిపెట్టి బ్రాహ్మణపుత్రుఁడు నమ్రతతో నిట్లనియె.

ఓ రాజా! ఈశాస్త్రోక్తవచనము యొక్క సత్యత్వమును గూర్చి నాకెట్టి సంశయమును లేదు. కనుక దీనిని నేను ఖండింపఁజాలను.

ఇది విని రాజత్యంతక్రోధపరవశుఁడై యా బ్రాహ్మణపుత్రునిఁ గారాగృహమందుఁ బ్రవేశపెట్టి, నగరమందుండు సర్వబ్రాహ్మణులను దన సభకు రప్పించి, వారల సముఖమున శాస్త్రప్రసంగము జేయుచు నిట్లనియె.

ఓ విద్వజ్జనులారా! ఈశాస్త్రమందు రికాబులో కాలుపెట్టునంతలో బ్రహ్మోపదేశ మగునని వ్రాయఁబడి యున్నది. ఈవాక్యము సత్యమైనదా? అని యడిగెను. సర్వజను లేకధ్వనితో “సత్యం సత్యమ్మ?”ని యుత్తర మిచ్చిరి.

జనకరాజు— అయితే యిదిగో! అశ్వము సిద్ధముగానున్నది. ఈ శాస్త్రవాక్యము యొక్క సత్యత్వము బ్రత్యక్ష ప్రమాణముగ ఋజువు సేయ మీలో సమర్థులగువారలు సిద్ధపడుఁడు. లేదా యీవాక్యమును ఖండింపుడు. అనెను.

అది విని సర్వవిద్వాంసులును దమ యశక్తతం దెలుపుచు, రాజు విధించెడు శిక్షనైనను సహింపఁదలఁచినవారలై యీ శాస్త్రవచనమును దామెంతమాత్రము ఖండింపజాలమని దృఢముగ జెప్పిరి.

ఆప్రత్యుత్తరమును విని జనకరాజువిద్వజ్జనుల నందరను కారాగృహమందుంచి యటుపిమ్మట నాయా నగరమందుఁ బ్రవేశించు బ్రాహ్మణుల నెల్లరను దనయొద్దకుఁ గొనితెచ్చుటకై ద్వారపాలకుల కాజ్ఞాపించెను. అంతనుండి నగర మెవరైనఁ గ్రొత్తవిద్వాంసులు బ్రవేశింప వారినిఁ దనయొద్దకు రప్పించి యిదివఱకుఁ జెప్పిన రీతిని వారలఁ బ్రశ్నించి వారలఁ గారాగృహబద్ధులఁ జేయుచుండెను. జనకరాజుయొక్క యీ దుర్భరభయంకరపరివర్తనము దేశదేశముల వ్యాపించెను. అందువలన విద్వాంసు లెవరు నానగరమును బ్రవేశింపకుండిరి. ఇట్లు కొంతకాలము జరిగినపిమ్మట భాగ్యవశమున శ్రీఅష్టావక్రముని యను మహాశయుఁడానగరసమీపమునకు వచ్చి నగరపు వెలుపల నొక వృక్షము క్రింద విశ్రమించెను. అప్పు డచ్చట నిద్దరు పాంథులగు బ్రాహ్మణులు గూర్చుని యుండిరి. అష్టావక్రముని వారల జూచి యీనగరము నేలు రాజెవ్వఁడని యడిగెను. అందు కాబ్రాహ్మణులు "అయ్యా! మునివరా! మీప్రయోజన మేమి? ఈనగరమునకు మీరు పోయెదరా?" యనిన "అహా! పోయెద" నని యష్టావక్రముని చెప్పగా నాబ్రాహ్మణులు మునీశ్వరు నిటుల ప్రార్థించిరి. "ఓమునివరా! మాయందుఁ గరుణించి మీరెప్పుడు నీనగరమును బ్రవేశింపవలదు. కారణ మేమన? ఈనగరపాలకు డగు జనకరాజత్యంతక్రూరవర్తనుఁడును, దురాగ్రహుఁడునై యనేకబ్రాహ్మణుల గారాగృహమున బంధించెను. దౌర్భాగ్యవశమునఁ గ్రొత్తగ నేబ్రాహ్మణుఁడైన నీనగరముం బ్రవేశించు నెడల "రికాబులో కాలుపెట్టినంతలో బ్రహ్మోపదేశ మగు" నని శాస్త్రోక్తవచన మున్నది. కావున నాశాస్త్రవచనము యొక్క సత్యత్వమును ప్రత్యక్షముగ ఋజువుసేయుమని యాజ్ఞాపించి, యట్లు ఋజువుసేయని యెడల వానిని వెంటనే కారాగృహమున బంధించుచున్నాడు. అని విన్నవించిరి.

అష్టావక్రముని యీవార్తనువిని యాపథికబ్రాహ్మణుల కిట్లనియెను. "నేను నడువనసమర్థుఁడ, నన్నొక డోలికయందుఁ గూర్చుండఁబెట్టి యాజనకరాజు సముఖమునకుఁ గొనిపొండు. ఆశాస్త్రోక్తవచనము యొక్క సత్యతం బ్రతిపాదించి, కారాగృహబద్ధులైయున్న విద్వాంసుల నందరను విడిపించెద".

అష్టావక్రముని యానతిచ్చిన యీగంభీరవాక్యముల నాబ్రాహ్మణులు విని, ఈమునీశ్వరుఁడు విద్వాంసుల దుఃఖమును దప్పక నివారింపఁగల డని నిశ్చయించుకొని, త్వరితగతిఁ బోయి యొక డోలికం దెచ్చి, దానిపై అష్టావక్రమునీంద్రునిఁ గూర్చుండఁబెట్టి, తాము స్వయముగ మోసికొనిపోయి జనకరాజు సమక్షమున సభాస్థలి నామునీంద్రునిఁ గూర్చుండఁబెట్టిరి.

అప్పు డష్టావక్రమునియొక్క భవ్యమగు తేజస్సుతోఁ గూడిన ముఖముదర్శింజూచినంతనె జనకరాజున కీమహానుభావునిఁ బూజింపఁ బుద్ధిపొడమి, మునికి సాష్టాంగనమస్కార మొనరించి లేచి రెండుచేతులు జోడించి వినయముతో "ఓ మునీశ్వరా! మీరిట కేతెంచిన ప్రయోజనమేమియో కృపయుంచి యానతిం" డని ప్రార్థించెను.

అష్టా— ఓరాజా! ఎట్టి యపరాధమునకై నీవనేకమంది విద్వాంసులఁ గారాగృహబద్ధులఁ జేసితివి? అని యడిగెను.

జనకరాజు— మునీశ్వరా! "రికాబులో కాలుపెట్టునంతలో బ్రహ్మోపదేశ మగు" నను శాస్త్రవాక్యమును బ్రతిపాదింప వీర లసమర్థులగుటం జేసి యీశాస్త్రవచనము యొక్క యాథార్థ్యగ్రహణముం గూర్చి దురాగ్రహుఁడనై యిట్లొనర్చితినని విన్నవించెను.

అష్టా— ఓరాజా! నీతర్కము న్యాయముగ లేదు. శాస్త్రవాక్యము ప్రతిపాదితముకానిమాత్రమున నది కల్పిత మని నీవు సిద్ధాంతము సేయఁ

గూడదు. "రికాబులో కాలుపెట్టునంతలో బ్రహ్మోపదేశమగు" నను శాస్త్రవచనము మిథ్యకాదనియు, నందలి ప్రతియక్షరమును సత్యమేయనియు నేను ప్రతిజ్ఞ సేయుచున్నాఁడను. అనెను.

జనకుఁడు— "ఓమునీంద్రా! మీయాజ్ఞయగు నెడల నశ్వమును రప్పించెద. నాయందుఁ బరిపూర్ణకృపయుంచి యీ శాస్త్రవచనప్రకారము బ్రహ్మోపదేశముఁ జేయుఁడు; శాస్త్రవాక్యము యొక్క సత్యతం బ్రతిపాదించుఁడని నమస్కారపూర్వకముగ మిమ్ముఁ బ్రార్థించుచున్నాఁడను." అని విన్నవించెను.

అష్టావక్రుఁడు— ఓరాజా! నీయొక్క శుభభావమునకు నీయెడఁ బ్రసన్నుఁడ నైతి. "బ్రహ్మజ్ఞానరూపపవిత్రోపదేశము నపాత్రుల కొసఁగఁగూడ" దని నీవెప్పుడును దెలిసికొనలేదా? అట్టిపాత్రుల కొసఁగిన యెడలఁ గించిత్తయినను లాభము లేదు. కుమారా! రాజపుత్రా! బ్రహ్మోపదేశము నొంద నీకభిలాష కలదేని నాయెడలఁ బూర్ణమగు శ్రద్ధ వహింపుము. ముందుగఁ గారాగృహబద్ధులైయున్న విద్వాంసుల నందరను విడుదలఁ జేసి పిమ్మట నీవశ్వారూఢుఁడవై నాతో వనమునకు రమ్ము. అప్పుడేకాంతనిర్జనస్థలమందు నీపాత్రతం బరీక్షించి శాస్త్రోక్తవచనము సత్యముగు నటుల నీకు బ్రహ్మోపదేశ మొనరించెద ననెను.

దృఢనిశ్చయముతోఁ గూడిన అష్టావక్రుని మాటలు వినినంతనే జనకరాజున కావిషయమై యత్యంతాసక్తి పొడమెను. కారాగృహబద్ధులై యున్న విద్వాంసుల నందఱిని దక్షిణ మంచి విడిచిపెట్టుటకు జనకరాజాజ్ఞాపించెను. పిమ్మట తానశ్వారూఢుఁడై (శ్రీ) అష్టావక్రమునిని శ్రేష్ఠమగు పల్లకిలోఁ గూర్చుండఁబెట్టి అమాత్యాదులతోడను, పౌరులతోడను వనమునకు స్వారివెడలెను. ఇట్లు వెడలి వనమునందొక విశాలవటవృక్ష

మునీశను విశ్రమించి యున్నంతటఁ దమతో వచ్చిన అమాత్యాదులను, ప్రజలను నగరమునకుఁ బంపివేయు మని మునీశ్వరుఁడు జనకరాజున కాజ్ఞాపింప రాజు వారల నందఱ శీఘ్రముగ నంపివేసెను.

అంత, మునీశ్వరుఁడును, రాజును మాత్ర మటనుండిరి. జనకరాజు అష్టావక్రమునియొక్క యాజ్ఞం గాని యొక రికాబులోఁ కాలు బెట్టి గుఱ్ఱము నెక్క సమ్ముఖుఁడాయెను. ఆసమయమునందష్టావక్రముని "ఆగుము. ధైర్యముతో నుండు" మని రాజునకుఁ జేసన్నఁజేసి "ఓ,రాజపుత్ర! నీరెండవచరణము నెత్తకమునుపు నాప్రశ్నముల కుత్తర మిమ్ము" అనెను.

జనకరాజు— "ఆజ్ఞాపింపుము మహాత్మా!" యనెను.

అష్టా— రాజా! శాస్త్రములో "రికాబులో కాలుపెట్టు నంతలో బ్రహ్మోపదేశ మగును" అను వాక్య మొక్కటియే వ్రాయఁబడినదా ఇంకనేమైన నితరవార్తలు లిఖింపఁబడినవా?

జనకుఁడు— అన్యవిషయములు కూడ ననేకములు వ్రాయఁబడియున్నవి. స్వామీ!

అష్టా— బ్రహ్మజ్ఞానోపదేశము నొందుటకు గురువు నొకని నేర్పరచు కొనవలె నను విధాన మేమైన నాశాస్త్రమందు వ్రాయబడి యున్నదా? లేదా?

జనకుఁడు— హా! మహాత్మా! గురు వవశ్యముగ నుండవలె నని శాస్త్రములో విధింపఁబడియున్నది.

అష్టా— రాజా! ఇప్పుడు నన్నుం గురువుగ స్వీకరింపకయే నావలన బ్రహ్మోపదేశము నొందఁగోరుచున్నావా దేమి?

జనకుఁడు— అటులఁగాదు మహాత్మా! శాస్త్రవిధిపూర్వకముగ నుపదేశ మొందనుత్సుకుఁడనై యున్నాఁడను. తండ్రీ! మిమ్మునే నాగురువుగ

నిపుడు స్థాపించుచున్నాను.

అష్టా— రాజా! ఉపదేశ మొందునపుడు గురుదక్షిణ సమర్పింప వలె నను విధానము శాస్త్రములో వ్రాయబడి యున్నదా?

జనకుఁడు— మహాత్మా! శాస్త్రవచనానుసారముగ నీక్షణమందె నాయొక్క తను మనో ధనములు మూడింటిని మీచరణకమలముల యందర్పించినాడను. మహాత్మా! నాయందనుగ్రహించి యిపుడు నాకు బ్రహ్మోపదేశ మొనరింపుము. ఇట్లు జనకుడు చేసిన ప్రార్థన వినినంతనె అష్టావక్రముని అదృశ్యుఁడై దూరముగఁ బోయి యొక గుహయందు డాఁగి యుండెను. జనక రాజా తన గుఱ్ఱము యొక్క రికాబులోఁ బెట్టిన కాలు వట్లనేయుంచి కదలక మెదలక నిలువఁబడి నిశ్చేష్టితుఁడై యుండెను.

సూర్యాస్తమయసమయమైనను జనకరాజా నగరమునకుఁదిరిగి రాకుండెను. అప్పుడమాత్యాదు లందఱు నత్యంతచింతాక్రాంతులై యాక్షణమందె వడివడి వనమునకుం బోయిరి. అటుల పోయి చూడ నొకవిశాలవృక్షసమీపమునం దష్టావక్రమునినిం గొనిపోయిన బల్లకిమాత్ర ముండెను. మునీంద్రు డెచ్చటను కనబడకుండెను. జనకమహారాజొక కాలును గుఱ్ఱపు రికాబులో నుంచి చైతన్యరహిత మగుప్రతిమ వలె నిశ్చేష్టితుఁడై యుండెను. అది చూచి అమాత్యాదిక సర్వపరివారము నత్యంతభయాక్రాంత మయ్యెను. ప్రధాని త్వరితగతి రాజునొద్దకుం బోయెను. కాని రాజు వానినిఁ జూడనే లేదు. ప్రధాని తన రెండు చేతులు జోడించి "మహారాజా! ఈస్థితికిం గారణమేమి?" అని యడిగెను. జనకరాజించుకయు నుత్తర మియ్యకుండెను. అప్పుడు మునీశ్వరుడు రాజున కెద్దియో మంత్రప్రయోగముఁ జేసియుండునని ప్రధానిప్రభృతు లనుకొనిరి. మునికై కొంతసేపు వెదకిరి. కాని ముని యెచ్చటను గనఁబడలేదు. అమాత్యాదులందరు నిరాశులై రాజును బల్లకిలోఁ గూర్చుండఁ

బెట్టి నగరమునకుఁ గొనిపోయి రాజమందిరమున నొక యుత్తమశయ్యపైఁ బరుండఁబెట్టి యనేకుల నాశ్వికుల రప్పించి తక్షణము వనమునకుం బోయి మునీశ్వరుని వెదకి తోడితెండనియు, మునీశ్వరుండు వచ్చునంతకు నెవరును దిక్కి రాఁగూడ దనియుఁ గఠినముగ నాజ్ఞాపించి యాశ్వికులవనమున కంపిరి. జనకరాజు శయ్యపైఁ బరుండఁబెట్టి నప్పుడే స్థితినుండెనో యట్లే చేతులు, కాళ్లు కదల్పకుండెను. నోట నొక్కమాటయైన రాకుండెను. భోజనమిడిన గొంచెమైన గ్రహింపకుండెను. జలపాత్రము నోటికందించిన నించుకయైన పానము సేయలేదు. రాజు యొక్క యీస్థితిఁ జూచి రాణియు, రాజమంత్రియు నత్యంతశోకనిమగ్నులైరి. ఈవార్త సర్వత్ర వ్యాపింప నగరమందంతటఁ బ్రజలలో హాహాకారము పుట్టెను. ఆరాత్రియంతయు నతిదుఃఖముతోఁ గడచినంత సూర్యోదయ మయ్యెను. మునీశ్వరుఁడు రాఁడాయెను. సూర్యాస్తమయసమయమున నొక సిపాయి అష్టావక్రమునిం దోడ్కొని వచ్చెను.

మునీశ్వరునిఁ జూడఁగనే ప్రధాని కత్యంతక్రోధము ప్రజ్వలించెను. కాని మునీశ్వరునకుఁ గ్రోధ మగపరచిన యెడలఁ గార్యసిద్ధి కానేరదనియు, నింక నేదేని విపరీతము జరుగునేమో యనియును యోచించి నమ్రతతో నిట్లనియెను. "ఓమునివరా! మారాజున కెద్దియేని మంత్రప్రయోగము జేసితిరా?"

అష్టావక్రుడు:— "మీరాజుపై మంత్రప్రయోగము సేయు నెడల నాకేమిప్రయోజనము కలదు? మీరాజునకు నే నెద్దియుఁ జేయలేదు. "రాజును నీవేమియు నడుగలేదా!"

ప్రధాని—స్వామీ! రాజు నేను ప్రశ్నించిన నుత్తర మీయడు. రెండుదినముల నుండి యుపవాసియై యున్నాఁడు." అని రాజుయొక్క స్థితిగతియు మునివరునకు విన్నవించి "ఓమునివర! మారాజు భుజియించునట్లనుగ్రహింపుము." అని వేడెను.

అప్పుడష్టావక్రముని రాజును సమీపించి "ఏమిజనకా!?" అనెను.

జనకుఁడు— మహాత్మా! ఏమి యాజ్ఞ?

ముని— నేను నీకేమి చేసితిని?

జనకుఁడు—మీరేమియుఁ జేయలేదు;మహాత్మా!అట్లనియెవరు చెప్పిరి!

ముని—జనకా! ఏమి యట్లు పడియుంటివి? లెమ్ము ఆనందముగాఁ గూర్చుండి భోజనము సేయుము.

జనకరాజప్పుడు లేచి నిత్యకృత్యములు దీర్చుకొని భోజనము చేసెను. అది చూచి యెల్లరు నానందాశ్చర్యనిమగ్నులయిరి. జనకుఁడు భుజించి నిశ్చలుఁడై యుండెను. అంత ప్రధాని "మునివరా! కృపయుంచి మారాజు నెప్పటిస్థితికి రప్పింపుము" అని ప్రార్థించెను.

అది విని మునివరుఁడు ప్రధానాద్యధికసర్వపరివారమును దమ తమ గృహములకుఁ బొండని యాజ్ఞాపించి తానేకాకిగా లోపలిద్వారమునుఁ బంధించి జనకరాజును సమీపించి యాతని కిట్లనియె.

ముని—ఓయిరాజా! నీవిట్లు చేష్టలుడిగి యుండుటకుఁ గారణమేమి?

జనకుఁడు— గురువరా! ఈదేహమందు నాకెట్టి స్వాతంత్ర్యమును లేదు. ఈకాళ్లు నావి కావు. చేతులు నావి కావు. ఈజిహ్వ నాది కాదు. ఈనేత్రకర్ణాదికసర్వేంద్రియములును నావి కావు. ఈరాజ్యము నాది కాదు. ఇంత యేల! వీనిలో నాకేమియుఁ హక్కు లేదు. నా తనుమనో ధనములు సత్యముగ మీచరణకమలముల కర్పించియున్నాఁడను. మీ యాజ్ఞ లేక నేనెట్టి చేష్టలు సేయ నర్హుఁడఁ గాను. అనెను.

అత్యంతశ్రద్ధాయుక్తము లగు నీజనకరాజు వచనముల వినిన యష్టావక్రముని యత్యంతప్రసన్నహృదయుఁడై జనకరాజు మస్తకముపైఁ దనహస్తము నుంచి యిట్లనియె.---

కుమారా! జనకా! నీవు ముముక్షు వగుటకుఁ దగిన జ్ఞానాధికారి వవుదువో లేదో తెలియుటకై నేనీప్రథమపరీక్షఁ జేయుట యావశ్యకమాయెను. నిన్నుఁ బరీక్షించి మెచ్చితి. నీవిప్పుడు బ్రహ్మోపదేశ మొందుట కుత్తమోత్తమాధికారివి. రికాబులో కాలుపెట్టునంతలో బ్రహ్మోపదేశము నొందుటకు నీవ తగిన యధికారివి నాకు లభించితివి. ఓయి పుత్రా! నిశ్చయముగ నీవిప్పుడు బ్రహ్మస్వరూపుఁడవు. నీవు సర్వదా నిశ్చయముగ ము

తృప్తుఁడవే. నీవు కృతకృత్యుఁడవు. ప్రాప్తప్రాప్యుఁడవు. అఖండసుఖస్వరూపుఁడవు.

అని ముని చెప్పఁగా విని జనకరాజు తనలో "నేను పరిచ్ఛిన్నుఁడను, వికారిని, అజ్ఞానిని కదా నాకు బ్రహ్మస్వరూప మెట్లు సంభవించెను?" అని విచారించినవాఁడై,

"కథం జ్ఞాన మవాప్నోతి కథం ముక్తి ర్భవిష్యతి,
వైరాగ్యం చ కథం ప్రాప్త మేత ద్బ్రూహి మమ ప్రభో! ॥"

అని మునివరునిఁ బ్రశ్నించెను. తదనంతర మీ అష్టావక్రగీత ప్రారంభింపఁబడెను. ఇటుల ప్రశ్నోత్తరరూపముగ నీ యష్టావక్రగీత సంభూతమై జనకరాజునకుఁ బూర్ణముగ తత్త్వోపదేశము చేసెను. ఈ బ్రహ్మోపదేశము వలనఁ బొడమిన పూర్ణానందముతో జనకున కారాత్రి యంతయు గడిచెను. సూర్యోదయమైనంతట లోపలిద్వారము తెరువఁబడెను. అంతఁ బ్రధాన్యాదిక పరివారము మునీశ్వరు నాజ్ఞ నొంది నమస్కారపూర్వకముగ రాజమందిరముం బ్రవేశించి పరమానందయుతుఁడైన జనకమహారాజుం గాంచి హర్ష మొందిరి.

ఆసమయమున అష్టావక్రముని జనకరాజున కిట్లనియె—

"ఓ రాజా! రికాబులో కాలు పెట్టునంతలో బ్రహ్మోపదేశ" మనుసను శాస్త్రవచనముం గూర్చి నీకు సంశయము కలదేని నీయశ్వమును వెంటనె రప్పింపుము."

జనకరాజు— "మహాత్మా! నాచిత్తమం దిపు డెట్టి సంశయమును లేదు. శాస్త్రవచనము కేవలము సత్యము. మీయపరిమితకరుణ నాయందుఁ బ్రసరింప నేఁ గృతార్థుండ నైతిని" అనెను.

శ్రీ అష్టావక్రమునికిని జనకరాజునకును సంబంధించిన
కథాసంగ్రహము సమాప్తము.



ఓమ్.

శ్రీ గురుపరమాత్మనే నమః.

# అష్టావక్రగీత.



## ౧ వ ప్రకరణము. ఆత్మానుభవోపదేశవర్ణనము.



### ఆంధ్రటీకాకారకృతమంగళాచరణము.

ఓం సచ్చిదానందసంధాన శుద్ధబోధోపదేశినం,
గురుం శ్రీ అమృతానందం మోహాధ్వాంతనుదం నమః



అవతరణిక— జనకమహారాజు తన సంపూర్ణశ్రద్ధాభక్తుల వలనఁ బ్రసిద్ధుఁడైన (శ్రీ)అష్టావక్రమునీంద్రుని యడుగుచున్నాఁడు.

శ్లో॥ కథం జ్ఞాన మవాప్నోతి కథం ముక్తి ర్భవిష్యతి,
వైరాగ్యంచ కథం ప్రాప్త మేతద్బ్రూహి మమ ప్రభో॥౧॥

తాత్పర్యము— స్వామీ! గురువర్యా! జ్ఞానవైరాగ్యము లెట్లు కలుగును. ముక్తి కలుగు టెట్లు. వీనిని నాకు బోధింపుము.



అవతరణిక— జ్ఞానవిజ్ఞానసంపన్నుఁడును, కరుణానిధియు నగు శ్రీ అష్టావక్రముని ముక్తికాముఁడై తన చరణములను శరణముగ నాశ్రయించిన శిష్యుఁడగు జనకమహారాజునకు శమదమాది ముఖ్యసాధనముల విధించుచు ముక్తిసాధనమగు ఆత్మతత్త్వము నుపదేశించుచున్నాఁడు.

## అష్టావక్రముని.

శ్లో॥ ముక్తి మిచ్ఛసి చేత్తాత విషయా న్విషవ త్త్యజ,
క్షమార్జవదయాతోష సత్యం పీయూషవ ద్భజ ॥ ౧ ॥

తాత్పర్యము— ఓశిష్యా! సర్వానర్థములఁ దొలఁగించి నిత్యపరమానందసుఖముం గూర్చునట్టి ముక్తియం దిచ్ఛ కలదేని, అనర్థదాయక మగు విషము నెట్లు పరిహరింతువో యట్లే సర్వానర్థములకు మూల మగు దేహాదివిషయముల యం దాసక్తిని విడచి, అంతర్ముఖుఁడ వగుము. అనఁగా, అహంమమ (నేను నాది) యను నధ్యాసను విడువు మని యభిప్రాయము. మఱియు క్షమ, ఆర్జవము, దయ, సంతోషము, సత్యము, నను వీని నమృతము వలె స్వీకరింపుము.

దేహము మొదలు కొని అహంకారము వఱకుఁ గల దృశ్యము లన్నియు విషయములే; కనుక విషప్రాయములగు నీవిషయములం దాశను విడువుము. బాహ్యపదార్థములం దాశ లేకుండుటయే దమ మనఁబడును. ఇట్లు బాహ్యేంద్రియనిగ్రహము నలవరచుకొని పిమ్మట క్షమార్జవా ద్యంతరింద్రియనిగ్రహ మనెడి శమము నభ్యసించుము. క్షమార్జవదయాతోషసత్యము లాత్మజ్ఞధర్మములు. అందు,

1. క్షమ యన సర్వసహనము. సకలవికారములకు సాక్షియగు ఆత్మను సదా భావించుటచేత సర్వమును సహింపవచ్చును. సర్వాధిష్ఠానత్వ మాత్మధర్మము.

2. ఆర్జవ మనఁగా అభిప్రాయరూపమగు వంచన లేమియే. అనఁగా మాయా సంబంధమైన యేవికారమును గలుగకుండుట.

3. దయ యన నిర్హేతుకముగ పరహితమును గోరుట. ఇదియును ఆత్మ ధర్మము.

4. తోష మన సదా ఆత్మసుఖము. సర్వదా ఆనందమయుఁడై యుండుట. ఇదియు నాత్మస్వరూపము.

5. సత్య మనఁగాలత్రయమందును బాధలేని (మార్పుగలుగని) ఆత్మయే.

సర్వసిద్ధిహేతువగు యమృతము నెంతప్రీతితో స్వీకరింతువో అంతప్రీతితో నీక్షమార్జవాదుల స్వీకరింపు మని శమదమాదిసాధనచతుష్టయ సంపన్నుఁడగు శిష్యునకు భగవానుఁడగు అష్టావక్రముని యిట్లు ముక్తిసాధనము నుపదేశించుచున్నాఁడు.

వి— ఈశ్లోకము గ్రంథస్థవిషయమునకుఁ గీలకము. సర్వవేదాంతసారమై నాయకమణి వలె నలరారుచున్నది.

---

అవ॥— పృథివ్యాదిపంచభూతాత్మక మగు దేహమే ఆత్మ. శబ్దస్పర్శరూపరసగంధము లీ గగనమారుతాదిపంచభూతముల సహజగుణము లగుటచే సదా వాని నాశ్రయించి యుండునుకదా, ఈపంచభూతాత్మకదేహమును, అభూతముల సహజగుణములును కాలత్రయమందును విడుచుట కవకాశ మెటులఁ గలుగునను శంకకు, అపృథివ్యాది పంచభూతముల స్వరూపము నీవుకావు. అని అపరోక్షజ్ఞానము నుపదేశించుచున్నాఁడు.

**శ్లో॥ నపృథ్వీ నజలం నాగ్ని ర్నవాయు ర్ద్యౌర్నవా భవాన్,**
**ఏషాం సాక్షిణ మాత్మానం చిద్రూపం విద్ధిముక్తయే॥ ౩॥**

తా॥—— శిష్యా! పృథివ్యాదిపంచభూతములలో నేదియు నీవు కావు. ఆపంచభూతములును, వాని గుణములును, దేహధర్మములంగాని ఆత్మధర్మములు కావు. కనుక వానిని ఆదరింపకుము. తెలుపు, నలుపు, పొట్టి, పొడవు, లావు, సన్నము మొదలగు రూపములు, దేహధర్మములుగాని ఆత్మధర్మములు గావు. అట్టి దేహాదుల రాకపోకలకు సాక్షిమాత్రుఁడగు ఆత్మయే నీవని దృఢముగ నమ్మి ఆత్మసాక్షాత్కార మొందుము. ఘటమును జూచువాఁడు ఘటము కంటె వేఱుగ నున్నట్లు దేహమును జూచు నీవు దేహముకంటె వేరుగనుండు చిద్రూపుఁడవు.

---

అవ॥—— దుఃఖధ్వంసము ముక్తియని తార్కికులును, దుఃఖముకలుగమిరే ముక్తియనిపూర్వమీమాంసకులును, దేహనాశమే ముక్తియని బౌద్ధులును జెప్పుదురు. ఈతార్కికాదిమతముల ఖండించుచు ఆత్మజ్ఞానముచేతనే జీవన్ముక్తిదశ ప్రాప్తించునని నిరూపించుచున్నాఁడు.

శ్లో॥ యది దేహం పృథక్కృత్య చితి విశ్రామ్య తిష్ఠసి,
అధునైవ సుఖీ శాంతో బంధముక్తో భవిష్యసి ॥3॥

తా॥ శిష్యా! నీవు దేహాభిమానమునువిడిచి దేహాదిసర్వేంద్రియముల కు విలక్షణుఁడవుగ నుండుటఁ దెలిసి చిదేకాగ్రత నుంటివేని ఈజీవనదశయందే పరమానందప్రాప్తి నొంది సుఖింతువు. అనఁగా, కర్తృత్వభోక్తృత్వాద్యనర్థరహితుడవ వగుదువు. ॥3॥

వి॥—— పిపీలికాదిబ్రహ్మపర్యంతమును గల సకలోపాధులు జడములగు పంచమహాభూతములయొక్క పరిణామములుగాన నవియు జడములే. పరమాత్మయొక్క సూక్ష్మాంశములీజడోపాధులయందు జీవరూపమునఁ బ్రవేశించుట చేత నీయుపాధులకుఁ జైతన్యము గలిగి తత్తత్క్రియాసమర్థము

లగుచున్న వి. జీవుఁడు(కూటస్థుఁడనఁబడు) ప్రత్యగాత్మ యొక్క ప్రతిబింబుఁడు. ఆప్రత్యగాత్మ పరమాత్మయే. అవిద్యా (అజ్ఞాన) వశమున నీప్రత్యగాత్మ తన నిజరూపమును మఱచి, జీవభ్రాంతినొంది, కర్తృత్వ భోక్తృత్వాదులు తనవి గా నెంచుటచేత దేహమందభిమానమును బొందుచున్నాఁడు. ఇదియే అజ్ఞానము. ఇదియే బంధహేతువు. బంధమనఁగా దేహాభిమానవశమున బుణ్యపాపమిశ్రకర్మముల జేయుచు నాయాకర్మఫలానుసారముగ నానావిధయోనులందుఁ బుట్టుచుఁ గిట్టుచు జన్మమరణరూపమహాప్రవాహమునఁ బడి పరితపించుచుండుట. ఈమహాప్రవాహము నుండి తప్పించుకొని తన నిజరూపమును బొందుటయే (బ్రహ్మమం దైక్య మగుటయే) మోక్షము. సాధనచతుష్టయసంపన్నుఁడై వైరాగ్యబోధోపరతులు గలిగి సద్గురువు వలన తత్త్వమసీత్యాదిమహావాక్యార్థరహస్యములను దెలిసికొని శ్రవణమనననిదిధ్యాసనములచే నేకాగ్రచిత్తముతో నిరంతరము నిరంతరాయముగ పరమాత్మను (స్వస్వరూపమును) ధ్యానించుచుండుటయే ముక్తికి సాధనము. అట్టి సాధనమునే ఉత్తమాధికారియగు జనకునకు శ్రీఅష్టావక్రమునీశ్వరుఁ డుపదేశించుచున్నాఁడు.

---

అవ||—— వర్ణాశ్రమోచితము లగు కర్మములఁ జేయకుండ చిద్రూపధ్యాతుఁడై యుండిన ముక్తి కలుగునా యని శంకించునో యని, ఆత్మ వర్ణాశ్రమాదులకు విలక్షణమయినదని చెప్పుచున్నాఁడు.

శ్లో|| న, త్వం విప్రాదికో వర్ణో నాశ్రమీ నాక్షగోచరః ।
అసంగోసి నిరాకారో విశ్వసాక్షీ సుఖీభవ ||౫||

తా || నీవు వర్ణాశ్రమవిలక్షణుఁడవు. నేను బ్రాహ్మణుఁడను, సన్న్యాసిని ఖ్యా మొదలగు వర్ణాశ్రమభేదములు ప్రత్యక్షముగఁ గనుపడు

చుండ నాకీవర్ణాశ్రమభేదములు లేవని చెప్పు టెట్లు? అనెదవేని, నీవు అక్షగోచరుఁడవు కావు. ప్రత్యగాత్మవగు నీవు సాక్షిమాత్రుఁడవు. నేను బ్రాహ్మణుఁడను, ఈమొదలగు ప్రత్యయములు ఇంద్రియగోచరము లగు టచేత దేహధర్మములే కాని ఆత్మధర్మములు గావు. అయితే యిఁక నేనె ట్టివాఁడ నను శంక రాఁగా, ఆత్మస్వరూపమును నిరూపించుటకై ఆత్మవి శ్రాంతిఫలమును జెప్పుచున్నాఁడు. ఆత్మవగు నీవు సర్వోపాధిసంగరహి తుఁడవు, నిరాకారుఁడవు, విశ్వమునకు సాక్షిమాత్రుఁడవు. ఈదేహము తోఁ గాని, ప్రపంచముతోఁ గాని నీకెట్టి సంబంధమును లేదు. కనుక కర్మాసక్తిని విడిచి చిదేకాగ్రత వలనఁ గలుగు పరమానందప్రాప్తిచే సు ఖింపుము. ॥౪॥

---

అవ॥---చిన్మాత్రుఁడనైయున్నను వేదవిహితకర్మల మానుటచేతఁ బ్రత్యవాయము కలుగదా అనెడిశంకకు సమాధానము జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ధర్మాధర్మౌ సుఖం దుఃఖం మానసాని న తే విభో!,
న కర్తాసి న భోక్తాసి ముక్త ఏవాసి సర్వదా ॥౫॥

తా॥ ధర్మాధర్మములును, వాని వలనఁ గలుగు సుఖదుఃఖములును, మనోధర్మములు గాని (చిన్మాత్రుఁడవగు) నీవి కావు. విహితనిషిద్ధకర్మ ములు చేయుటవలనఁ గలుగు ధర్మాధర్మములకును, తజ్జన్యము లగు సుఖ దుఃఖములకును నీవు కర్తవు కావు. భోక్తవును కావు. శుద్ధబుద్ధస్వరూపుఁ డవగు నీవు సర్వదా ముక్తుఁడవే. అజ్ఞానము వలన నీసుఖదుఃఖములు సంభ వించును. చిదానందమున నీయజ్ఞానము దొలఁగఁగనే అజ్ఞానకార్యములగు సుఖదుఃఖములును దొలంగును. ॥౫॥

---

అవ॥--- లోకములో వివేకవంతులు బంధనివృత్తికై ప్రియత్నింతు రుకదా! శుద్ధబుద్ధస్వరూపుఁడును, నిత్యముక్తుఁడును నగు ఆత్మకు బంధ మెట్లు కలిగె నను శంక రాఁగా, నిత్యముక్తుఁడయ్యును బాహ్యదృష్టి గల వానికి ప్రాతీతికము సైతము బంధమే యని బోధించుచున్నాఁడు. (ప్రాతీతికమనఁగా, స్వప్నవృత్తాంతమువలె నప్పటి కున్నటులఁ గనుపించి విమర్శించునపు డేమియు లేనిది.)

శ్లో॥ ఏకో ద్రష్టాసి సర్వస్య ముక్తప్రాయోఽసి సర్వదా,
అయమేవ హి తే బన్ధో! ద్రష్టారం పశ్యతీతరమ్ ॥౭॥

తా॥ ఓయిశిష్యా! సర్వశరీరములందును నుండి ద్రష్టవై చిదాత్మవగు నీవే సర్వవ్యాపకుఁడవై సర్వమును జూచుచున్నావు. కాబట్టి నీవు సర్వదా ముక్తప్రాయుఁడవే. దేహాధ్యాసవలనను బంధ మున్నటులఁ గనుపడినప్పటికి నీకు బంధము లేదు. సర్వదా ముక్తుఁడవే. దేహాదిసర్వప్రపంచమును బరిచ్ఛిన్నముగఁ (నీకంటె నితరముగ) జూచితి వేని యదియె నీకునిశ్చయము *K* బంధము.

వి — అనేకజలాశయములందుఁ బ్రతిఫలించుచున్న సూర్యుఁడు భిన్నభిన్నములుగాఁ గాన్పించుచున్నను ఒక్కఁడేయైనటుల నానావిధోపాధులయందును ప్రత్యగాత్మరూపమునఁ బ్రతిబింబించు పరమాత్మ యొక్కఁడే యను, అనఁగా తానే పరమాత్మయను నిశ్చయజ్ఞానముతో నుండు వానికి దేహాదిబాహ్యప్రపంచకృత్యములతో లేప ముండదు. (శ్రీభగవద్గీతఅ- 5- శ్లో- 8-9 చూడుడు!) ॥౭॥

---

అవ॥— ఇట్లు బంధహేతు వగు దేహాభిమానమే యనర్థహేతువని నిరూపించి తన్నివృత్తిపూర్వకపరమానందప్రాప్త్యుపాయమును జెప్పు

చున్నాఁడు.

శ్లో॥ అహం కర్తే త్యహంమానో మహాకృష్ణాహి దంశితః,
నాహం కర్తేతి విశ్వాసామృతం పీత్వా సుఖీభవ ॥

తా॥ శిష్యా! కర్తృత్వాభిమానము, అనఁగా "నేను కర్తను" యను అహంభావమనునది గొప్పకృష్ణసర్పము. ఆయహంభావమువలనఁ గలుగు సుఖదుఃఖములకు లోఁబడుటయే యాసర్పము వలనఁ గబళింపఁబడుట. కావున నట్టి యహంభావమును వదలి "నేను కర్తనుగానట్టి ఆత్మను" యనెడి దృఢవిశ్వాసామృతముఁ గ్రోలి పరమానందప్రాప్తి నొంది సుఖింపుము. ॥౮॥

అవ॥— ఆత్మజ్ఞానామృతపాన మేరీతి సుఖసాధన మగునను శంక కలుగఁగా జ్ఞానాగ్ని వలన అజ్ఞాన మను కాననమును దహించుట వలన నది సుఖసాధనమగునని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఏకో విశుద్ధబోధోఽహమితి నిశ్చయవహ్నినా,
ప్రజ్వాల్యాజ్ఞానగహనం వీతశోక స్సుఖీభవ ॥౯॥

తా॥ "నేను సజాతీయవిజాతీయస్వగతభేదములు లేని స్వప్రకాశచిదాత్మను, సర్వప్రపంచమును నేనయి వెలుగుచున్నాను." అనెడి నిశ్చయజ్ఞాన మనెడి యగ్ని చేత అజ్ఞానకాననమును బూనికతోఁ దగులఁబెట్టి జననమరణముల వలనఁ గలుగు శోకమోహరాగద్వేషాదిక్లేశముల నుండి తప్పించుకొని తద్ద్వారా దుఃఖరహితుఁడవై ఆత్మానుభవసుఖము నొందుము.

—సజాతీయవిజాతీయస్వగతభేదములు—

(1) సజాతీయభేదము- తన జాతివస్తువు కంటె తాను భేదముగ స్ఫుర

డుట. (ఉ- ఒక చెట్టునకు వేఱొక చెట్టుతోఁ గలభేదము)

(2) విజాతీయభేదము- ఇతరజాతివస్తువుకంటె తాను భేదముగ నుండు ట. (ఉ- ఒక చెట్టునకు ఱాతితోఁ గలభేదము)

(3) స్వగతభేదము- తనయందే యుండు అవయవములకు, నింద్రియములకుఁ గల పరస్పరభేదము. (ఉ- ఒక చెట్టునందే దానికొమ్మలు పత్రపుష్పఫలాదులతో గల భేదము)

ఒక్కటే యై నిరవయవమగు ఆత్మకు నీభేదత్రయము లేదని "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" యనెడిశ్రుతి బోధించుచున్నది. (నేను నాది నా దేహము) ఇత్యాదిదేహాభిమానమే అజ్ఞానము. దానివలనఁ గలిగెడు శోకము, మోహము, రాగము, ద్వేషము మొదలగు వృత్తులనెడి లతాగుల్మాదులతోఁ జేరినదే 'అజ్ఞానకాననము'. ఈదేహాదివిషయములతో నాకెట్టిసంబంధమును లేదు, నేను శుద్ధపరిపూర్ణచిదేకాత్మను, అనెడి జ్ఞానమే 'వహ్ని'. ఈవహ్నినిఁ బ్రజ్వలింపఁజేసినయెడల అజ్ఞానకాననము దగ్ధమగును. అప్పుడు మిగిలి యుండునది శుద్ధబోధరూపబ్రహ్మానందము. స్వప్నవృత్తాంతము వలె నసత్యమగు సర్వప్రపంచమును మఱచి బ్రహ్మానందమయుఁడై యుండుటే యనిభావము. ॥౧॥

---

అవ॥— ఆత్మజ్ఞానాగ్నివలన నజ్ఞానకాననమును దహించి నప్పటికిని అందువలన సత్యముగఁ గనుపించు ప్రపంచజ్ఞానము తొలఁగదు కదా! యిఁక శోకాదులు కలుగకుండు టెట్లు? యను శంక రాఁగా త్రాటియందు సర్పభ్రాంతి కలిగినటులనే చిదాత్మయందుఁ గల్పిత మగు ప్రపంచము విమర్శకాలమున స్ఫురింపక సర్పభ్రాంతి తొలఁగఁగనే దాని కధిష్ఠానమగు త్రాడుమాత్రమె మిగిలియున్నట్లు ప్రపంచభ్రాంతి తొలఁగఁగనే

యీభ్రాంతికి నధిష్ఠాన మగు చైతన్యము మాత్రమే మిగిలియుండును. కనుక దుఃఖబీజమగు దేహాభిమానము తొలఁగఁగనే తత్సంబంధమగు శోకమోహాదులు కలుగనేరవని నిరూపించుచున్నాఁడు.

శ్లో॥ యత్ర విశ్వ మిదం భాతి కల్పితం రజ్జుసర్పవత్,
అనందపరమానందః స బోధ స్త్వం సుఖంచర ॥౧౦॥

తా॥ ఏసద్గురుబోధవలన దృశ్యప్రపంచ మంతయు, రజ్జువునందు సర్పభ్రాంతి కలుగునట్లు భ్రాంతిచే మాయాకల్పితముగఁ దోఁచునో, యట్టి బోధయె చిదాత్మనగు నేను, యని తెలిసికొని సుఖింపుము. స్వప్నమందజ్ఞానవశమున వ్యాఘ్రాదులను జూచి భయపడినవాఁడు జాగ్రదవస్థ రాగనే, అవ్యాఘ్రాదికములు మిథ్యాకల్పితములని తెలిసికొని స్వప్నమందుఁ గలిగిన భయముపోయి యెటులఁ జిత్తశాంతినొందునో యట్లనె అజ్ఞానకల్పిత మగు విశ్వభ్రాంతి గురుబోధవలనఁ దొలఁగినంతట సాంసారికదుఃఖములను దొలఁగి సుఖించును. అయితె దుఃఖకారణమగు ప్రపంచభ్రాంతి తొలఁగి దుఃఖాభావమైనంతమాత్రమున సుఖ మెట్లగునందువేని నిత్యానంతానందస్వరూపమును జెప్పెద వినుము.

అనంతపరమానంద మనఁగా మనుష్యలోకానంద దేవలోకానందములకంటె అత్యుత్కృష్టమగు పరమానందమవె నీవు. ఇచట, "ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవంతి" యనెడి శ్రుతిప్రమాణము. ఆత్మానుభవానందమే బ్రహ్మానందము. తదితరానందములు బ్రహ్మానందములోని పరమాణువులు.

---

అవ॥—సత్యమగు రజ్జువందు సర్పభ్రాంతివలెఁ గల్పితము. స్వాభావికసంగ్రహ ... అట్టి నిత్యానందాత్మకు బంధమోక్షము లె

ట్లు కలిగెను? అను శంక కుత్తరము.

శ్లో॥ ముక్తాభిమానీ ముక్తోహి బద్ధో బద్ధాభిమాన్యపి,
కిం వదంతీహ సత్యేయం యా మతి స్సా గతిర్భవేత్॥

తా॥ నేను ముక్తుఁడను, అనెడి యభిమానము గలవాఁడు నిశ్చయముగ ముక్తుఁడు. నేను బద్ధుఁడను, అనెడి యభిమానము గలవాఁడు బద్ధుఁడే యగును. కారణమేమనఁ? బంధమోక్షములు రెండును అభిమానకల్పితములే కాని వాస్తవములు కావు జ్ఞానికి బంధమోక్షములు లేవు. పరమార్థదశయందు ఆత్మమాత్రమె సత్యము. మాయా (అజ్ఞాన)కల్పితమంతేయు నసత్యము. "యా మతి స్సా గతిర్భవేత్" యనెడి విద్వజ్జనశ్రుతియు నిట్లే బోధించుచున్నది. మఱియు, "తం విద్యా కర్మణీ సమారభేతే పూర్వప్రజ్ఞాచ" * అనెడి శ్రుతియు, "యం యం వాపి స్మరణ్ భావం" ఈ మొదలగు స్మృతులును, ఈయర్థమునే దృఢపరచుచున్నవి. నరులు పూర్వజన్మమందలి విద్యకుఁ గర్మమునకుఁ బ్రజ్ఞకుం దగిన దేహముం దాల్చి వ్యవహరింతు రని శ్రుత్యర్థము. ఏవిషయమును దలంచుచుఁ బూర్వదేహమును విడుచునో యాస్మరణమునకుఁ దగిన దేహముం దాల్చి వ్యవహరింతు రని స్మృత్యర్థము. కావుననే జడభరతునకుఁ అంత్యస్మరణానుగుణముగ హరిణ మహిషజన్మములు కలిగె నని పురాణప్రసిద్ధి.

(ఈవిషయమును బూర్వశ్లోకములందుఁ జెప్పినప్పటికి శిష్యునకు వి

---

* ఒక శరీరమును విడిచి మఱియొక శరీరమును ధరించునపుడు పూర్వప్రజ్ఞచేత అష్టవసువులతో శరీరారంభమగును. పూర్వప్రజ్ఞచేతనే ముక్తుఁడ ననెడి జ్ఞానము కలుగును. (అష్టవసువులనఁగా పృథివ్యాదిపంచభూతములు, అవిద్య, కామము, కర్మము.)

పరీతభావనలు కలుగకుండ, దృఢజ్ఞానము గలుగుటకై యిట్లు మఱలమఱలఁ జెప్పెనని యూహించఁదగినది.)

---

అవ॥—జీవాత్మకుఁ బారమార్థికముగ బంధమోక్షములు కలవనెడి తార్కికమతమును నిరాకరించుచున్నాఁడు.

శ్లో॥ ఆత్మా సాక్షీ విభుః పూర్ణ ఏకో ముక్త శ్చిదక్రియః,
అసంగో నిస్పృహ శ్శాంతో భ్రమా త్సంసారవానివ॥

తా॥ దేహాదిసకలేంద్రియములు సేయు వ్యాపార మంతయుఁ దానే చేయుచున్నాననెడి యపభ్రమము (లేనిదియున్నటులఁ దలంచుట) చేత ఆత్మసంసారివలెఁ దోఁచును. కాని విమర్శింపగా తాను సంసారియే కాఁడు. ఏమనఁగా, 1 సాక్షి, 2 విభువు, 3 పూర్ణము, 4 ఏకము, 5 ముక్తము, 6 చైతన్యము, 7 అక్రియము, 8 అసంగము, 9నిస్పృహము, 10శాంతము, అను నీ పదియు ఆత్మధర్మములు. ఇందు 1 సాక్షి యనఁగా దేహాదులు చేయు క్రియలకును, అహంకారమునకును సాక్షిమాత్రుఁడే కాని ఆత్మ వానికిఁ గర్త కాఁడు. 2 విభువు అనగా సర్వప్రపంచమునకు నధిష్ఠాత. 3 సర్వవ్యాపకుఁడు కనుక పూర్ణుఁడు. 4 సజాతీయవిజాతీయస్వగతభేదము లేనందున ఏకము. 5 మాయకుఁ దత్సంబంధిసకలకార్యములకు నతీతుఁడగుటవలన వస్తుగతిచేతఁ సదా ముక్తుఁడు. 6 స్వప్రకాశుఁడై సర్వప్రపంచమును బ్రకాశింపఁజేయుటచేత * చైతన్యమాత్రుఁడు. 7 చేష్టారహితుఁడు గాన అక్రియుఁడు 8 తన కెట్టి సంబంధమును లేదు కనుక అసంగుఁడు. ("అసంగోహ్యయం పురుషః" అనెడి శ్రుతి యిచటఁ బ్రమాణము) 9 ఎట్టి విషయాభిలాషయు లేనివాఁడు గనుక నిస్పృహుఁడు. 10 ప్రవృ

---

* ఇచ్చట "తస్య భాసా సర్వమిదం విభాతి" అనెడి శ్రుతిప్రమాణము*

త్తి (పనిచేయుట) నివృత్తి (మానుట) యు, శరీరత్రియమును చిత్తవృత్తులు ను లేనందున శాంతుఁడు. (ఏదేని జేయునపుడు గాని మానునపుడుగాని మనస్సు సంకల్పించును, వాక్కు పలుకును, కరచరణాద్యవయవములు సేయును. ఆత్మ మనోవాక్కాయకర్మలకు సాక్షిమాత్రుఁడును వానితోసంబంధము లేనివాఁడును. ప్రవృత్తినివృత్తు లిందిృయధర్మములే కాని ఆత్మ ధర్మములు కావు. కనుక ఆత్మ సంసారి కాఁడు.)

---

అవ॥— నేను పరిచ్ఛిన్నుఁడను. ఈదేహము నాది, ఈగృహదారక్షేత్రాదులు నావి. నేను సుఖిని. నేను దుఃఖితుఁడను. ఈ మొదలగు భ్రమములు ప్రతిజన్మమందును, అనాదిపరంపరగఁ గలిగియుండగా నొక్కసారి తత్త్వబోధ వినినమాత్రమున నివర్తింపశక్యము కావు కనుక, "ఆవృత్తిరసకృదుపదేశాత్" యను వ్యాసనూత్రము ననుసరించి యనేక సారులీ యద్వైతాత్మభావనఁ జేయంజేయ విజాతీయసంకల్పములు తమంతట నణఁగు నని యుపదేశించుచున్నాఁడు.

శ్లో॥ కూటస్థం బోధ మద్వైత మాత్మానం పరిభావయ,
ఆభాసోహం భ్రమంముక్త్వా భావం బాహ్యమథాన్తరమ్॥

తా॥ ఓయి శిష్యా! "అహంకారరూపేనేను" అనెడిభ్రాంతిని విడువుము. పిమ్మట ఇది నాది, ఈదేహము నేను, ఈగృహాదికము నాది, ఇత్యాదిబాహ్యపదార్థసంబంధమగు మమకారమును, నేను సుఖిని, దుఃఖితుఁడను, మానవుఁడను, మొదలగు అంతరపదార్థసంబంధమగు నభిమానమును వదలి నేను అకర్తను, అసంగుఁడను, బోధస్వరూపుఁడను, సర్వవ్యాపకుఁడనగు అద్వితీయపరమాత్మను, అని సర్వదా భావింపుము.

---

అవ॥— ఈదేహాభిమాన మనాదిగ నుండుటచేత సక్పద్భావనవలన దొలఁగదు గనుక ఆయభిమానపాశమును జ్ఞానఖడ్గముచేత మఱల మఱల తె గనఱికి ఆత్మసుఖము నొందుమని బోధించుచున్నాఁడు.

శ్లో॥ దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక!,
బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీభవ ॥౧౩॥

తా॥ వత్సా! దేహమే నేనను దృఢాభిమానపాశముచేత చిరకాలమునుండి నీవు బంధింపఁబడి యున్నావు. 'నేను కేవలము చిద్రూపుఁడ' నను జ్ఞానఖడ్గముచేత, (నిరంతరాభ్యాసమున) ఆపాశమునుఁ బూర్తిగ తెగనఱికి ఆత్మసుఖము నొందుము. సకలప్రాణులు జన్మారంభము నుండియు నజ్ఞానవశతను అభిమానబద్ధులై యుండుట సహజము. దేహాభిమానము లేని ప్రాపంచికవ్యాపారమే లేదు. ధీమంతుఁడగు నరునకు జ్ఞానసాధనము కలదు. గనుక భ్రమమాత్రమును, మిథ్యాకల్పితము నగు దేహాదిప్రపంచము నపేక్షించి బాహ్యాభ్యంతరవాసనల నెల్ల విడచి నిత్యమును సర్వవ్యాపకమునై, అంతర్జ్యోతిస్స్వరూపమున పరమేశ్వరాభిన్నమగు ఆత్మస్వరూపమును సద్గురుబోధవలనఁ దెలిసికొని సదా చిదానందమున నుండుటయే ముక్తియని శ్రీఅష్టావక్రముని శిష్యునకు మఱల మఱల బోధించెను. ॥౧౩॥

---

అవ॥— "చిత్తవృత్తినిరోధరూపమగు సమాధియే బంధనివృత్తిహేతువు" అని చెప్పిన పాతంజలమతమును గూడ నిరాకరించుచు ఆత్మానుభవమును నిరూపించుచున్నాఁడు.

శ్లో॥ నిస్సంగో నిష్క్రియోఽసిత్వం స్వప్రకాశో నిరంజనః,
అయమేవహి తే బంధః సమాధి మనుతిష్ఠసి ॥౧౪॥

తా ॥ శిష్యా! నీవు నిశ్చయముగ నిస్సంగుఁడవు. దేహాదులలో దేనితోడను నీకు సంబంధమే లేదు. మఱియు, నీవు క్రియారహితుఁడవు. ఏమన నీవు స్వయంప్రకాశస్వరూపుఁడవు. (ఉపాధికృతావరణము లేని) నిరంజనుఁడవు నగు పరిశుద్ధాత్మవు. అట్టి నీవు సమాధ్యనుష్ఠానమునకై యత్నించుచితివేని నిష్క్రియుఁడ వగు నీవు సక్రియుఁడ వగుదువు. కావున సమాధియు బంధమే యగును. జ్ఞానాభివృద్ధికొరకుఁ జేయు నేయనుష్ఠానము యినను గర్మ మగుటచేత ముక్తికి ప్రతిబంధమే యగును. (అప్రయత్నముగ సర్వమనోవృత్తులు నశింపఁ దనంతటఁ దాను చిదేకాగ్రత నుండుటయె జ్ఞానము. అదియె ముక్తి.)

వి— ఆర్యసమ్మతము గు సమాధిని నిషేధించుట యుచితమా? యని న సమాధియు, దేవతోపాసనయు, ఆరురుక్షువులకు, చిదాత్మావరక మగు నవిద్యను విక్షేపసహితముగఁ దొలఁగించుటకు సాధనములు కనుక వారలకవసరమే. కాని విక్షేపావరణము తొలఁగిన ఆరూఢులకు స్వరూపజ్ఞానోపయోగములు కావు గనుక వారల కనవసరము. కావుననే "ఆవరణాభిభవార్థావృత్తిః" అని చెప్పఁబడెను. మఱియు "అవిద్యాకల్పితనామరూపవ్యపోహ ఏవ ప్రయత్నేన విద్యాః । న బ్రహ్మబోధే తదపోహమాత్రాద్బ్రహ్మైవభాతి స్వయమేవ సాక్షాత్" అని మహావాక్యదర్పణము లోఁ జెప్పబడినది. కావున ఆరూఢులు, కల్పితనామరూపవ్యపోహమునకే యత్నింపవలెనని యభిప్రాయము. ॥౧౪॥

---

అవ॥— ఇట్లాత్మాతిరిక్త మగు సమాధియును గూడదని చెప్పి క్రింది రెండుశ్లోకములలో సర్వకల్పనలకు మూలమైన అంతఃకరణమును విడచి చైతన్యమాత్రుఁడవగుమని బోధించుచున్నాఁడు.

శ్లో ॥ త్వయా వ్యాప్త మిదం విశ్వంత్వయి ప్రోతం యథార్థతః
శుద్ధబుద్ధస్వరూప స్త్వం మాగమః క్షుద్రచిత్తతాం ॥౧౫॥

తా ॥ ఓయి శిష్యా! కార్యము లగు కటకకుండలాదులు కారణ మగు కనకముచే వ్యాపింపఁ బడియుండునట్లు, కార్యమగు నీవిశ్వమంత యు సర్వకారణపరిపూర్ణాత్మ వగు నీచే వ్యాపింపఁ బడియున్నది. మృత్తునుండి కడవలు, ముంతలు మొదలగునవి యెట్లగుచున్నవో యట్లే యీ ప్రపంచమంతయు చిద్రూపాత్మవగు నీనుండియె కలుగును. యథార్థముగ నీవు పరిశుద్ధుఁడవు. అవిద్యకును, అవిద్యవలనఁ గల్పింపఁబడుచున్న ప్రపంచమునకును నీవతీతుఁడవు. స్వయంప్రకాశమాన మగు చిద్రూపుఁడవు. మఱియు, "సర్వగంధ స్సర్వరసః ॥ నేతి నేతి" అను శ్రుతివ్యాఖ్యానుసారముగను, అధ్యారోపాపవాద న్యాయముగను, ఆత్మతత్త్వము ప్రపంచాతీతమయినది. కాబట్టి శిష్యా! సర్వదా స్వయంప్రకాశమానపరిపూర్ణశుద్ధబుద్ధస్వరూపునిగా నిన్ను నీవు తెలిసికొని దీనికి విపరీతము లగు క్షుద్రభావనలు కలుగకుండ సదా చిదాత్మానుభవమున సుఖింపుము. ॥౧౫॥

---

అవ॥— దేహధారులకు ప్రతీయమానములగు, (లేనివి యున్నటులుఁ దోఁచు) షడూర్ములు, షడ్భావవికారములును నీవి కావనియు, నీవువానికి విలక్షణుఁడవనియుఁ జెప్పుచున్నాఁడు.—

శ్లో ॥ నిరపేక్షో నిర్వికారో నిర్భర శ్శీతలాశయః,
అగాధబుద్ధి రక్షుబ్ధో భవ చిన్మాత్రవాసనః ॥౧౬॥

తా ॥ శిష్యా! (ప్రాణధర్మము లగు) క్షుత్పిపాసలు, (మనోధర్మములగు) శోకమోహములు, (దేహధర్మములగు) జరామరణములు, అస్తిత్వ

షడూర్మ్యలును; (దేహధర్మము లగు) జాయతే (పుట్టుట), అస్తి (పుట్టియుం డుట), వర్ధతే (పెఱుఁగుట), విపరిణమతే (పండుట), అపక్షీయతే (తఱుఁగుట), వినశ్యతి (నశించుట) అను షడ్భావవికారములును నీకు లేవు. కాబట్టి నీవు నిరపేక్షుఁడవు, (ఆత్మేతరమందుఁ గోరిక లేనివాఁడవు) నిర్వికారుఁడవు; నిర్భరుఁడవు, (చిద్ఘనస్వరూపుఁడవు) శీతలాశయుఁడవు, (ముక్తిపర్యంతము సుఖస్వరూపుఁడవు) అగాధబుద్ధివి, (అపరిచ్ఛిన్నమగు స్వరూపచైతన్యరూపుఁడవు) అక్షుబ్ధుఁడవు, (అవిద్యవలనఁ గలుగు క్షోభ లేనివాఁడవు) నీస్వరూప మిట్టిది. కనుక దేహము వలెనే దేహసంబంధమగు సర్వక్రియలును అవిద్యాకల్పితము లని రూఢిగ నమ్మి వానిని స్మరింపక నిరంతరము చిన్మాత్రుఁడవై ఆత్మానందము నొందుము. ౧౬.

---

అవ॥— "విషయాన్ విషవత్త్యజ। సత్యం పీయూషవద్భజ" అని మోక్షోపాయముఁ బ్రథమశ్లోకమునం దుపదేశింపఁబడినది. కాని విషయముల విషతుల్యముగను, సత్యాత్మను అమృతతుల్యముగను యెంచుటకు హేతువునుఁ జెప్పియుండలేదు, కనుక, యాహేతువును బోధించుచు పై పదియారుశ్లోకములలో నిట్లు మోక్షహేతువును బోధించి, యిఁక నద్దమందారోపింపఁబడిన శరీరాదికమును, అద్దము బాహ్యాంభ్యంతరములందువ్యాపించియుండునట్లె చిదాత్మయందారోపింపఁబడిన విశ్వమును చిదాత్మ బాహ్యాభ్యంతరములందు వ్యాపించి యుండుననియు, ఆచిద్రూపాప్తియె పరమపురుషార్థ మనియు యుక్తియుక్తముగ నీప్రకరణార్థమంతయు శ్లోకత్రయముచే సంగ్రహముగఁ జెప్పుచున్నాఁడు.—

**శ్లో॥ సాకార మనృతం విద్ధి నిరాకారంతు నిశ్చలమ్,**
**ఏతత్తత్త్వోపదేశేన న పునర్భవసంభవః ॥౧౭॥**

తా॥ ఓయి శిష్యా! కంటికగపడు దేహాదిసర్వప్రపంచమును మిథ్యయని తెలిసికొని దానిని విషతుల్యముగ నెంచి, దానియందభిమానము మొదలంట విడువుము. ఏ యాకారమును లేని ఆత్మతత్త్వము, కాలత్రయమందును సర్వమునకు సాక్షియై స్థిరస్థాయిగ నుండునని యెరుంగుము. దీనికి "నిత్యం విజ్ఞాన మానందం బ్రహ్మ" యను శ్రుతిప్రమాణము. అనఁగా విజ్ఞానము (అనుభవము) వలన గలుగు ఆనందమె బ్రహ్మము. అదియె చిన్మాత్రరూపము. ఆచిన్మాత్రతత్త్వము నందు సదా విశ్రమించియుండుటయె ముక్తి. అట్టి ముక్తిం గనినంతట పునర్జన్మము గలుగదు. ౧౭

---

అవ॥— వర్ణాశ్రమభేదము గల స్థూలశరీరముకంటెను, పుణ్యాపాపధర్మాధర్మములు గల సూక్ష్మశరీరము కంటెను, పరిపూర్ణచైతన్యము విలక్షణమయినదని దృష్టాంతముతో నిరూపించుచున్నాఁడు.—

**శ్లో॥ యథైవాదర్శమధ్యస్థే రూపేఽన్తః పరితస్తు సః,**
**తథైవాస్మిన్ శరీరేఽన్తః పరితః పరమేశ్వరః ॥౧౮॥**

తా॥ అద్దమునందుఁ బ్రతిబింబించు శరీరాదికము యొక్క లోపల, వెలుపలను, చుట్టును నద్దము వ్యాపించియున్నటులె యీ స్థూలశరీరమందు లోపలను, వెలుపలను, నలుతట్టులను చిదాత్మయగు పరమేశ్వరుఁడు వ్యాపించియున్నాఁడు. ఈ యుదాహరణము వలన "యత్ర విశ్వమిదం భాతి కల్పితం రజ్జుసర్పవత్" శ్లో॥౯ ఇత్యాదిశ్లోకములచేతఁ జెప్పఁబడిన ప్రకరణార్థమంతయు నిట్లు సంక్షేపముగ సూచింపఁబడినది.

వి— సముద్రములో ముంపబడిన ఘటములు బాహ్యాంతరములయందు జలముచే నావరింపఁబడియుండునట్లు, సకలోపాధులును బాహ్యాభ్యం

తరములందు పరమాత్మ (The Universal Light) చే నావరింపబడి యున్నవి. ఆపరమాత్మ చైతన్యము వలననే యీజడోపాధులకు చైతన్యము కలుగుచున్నది. ఈయుపాధు లన్నియు స్వప్నప్రపంచము వలె ఆభాసమాత్రములే కాని వాస్తవములు గావు. సముద్రమందలి తరంగముల వంటివి. ఈయుపాధుల నుపేక్షింపఁగా నిత్యసత్యవస్తువగు పరమాత్మ మాత్రమే శేషించి యుండును గాన నా "పరమాత్మయే నేను" (బ్రహ్మాస్మి) అను నిశ్చయజ్ఞానము కలుగుటయే మోక్షసాధన మని యభిప్రాయము. ॥౧౭॥

---

అవ॥—దర్పణదృష్టాంతము వలన పరిచ్ఛిన్నత్వాదిభ్రమాపత్తి కలుగుచున్నందున ఆత్మయందధ్యస్తమై శరీరమందున్న ఆత్మస్థితి విస్పష్టము కాలేదు. కనుక ఘటాకాశదృష్టాంతముచేత బాహ్యాభ్యంతరవ్యాపకమైన ఆత్మస్థితిని నిరూపించుచున్నాఁడు.—

శ్లో॥ ఏకం సర్వగతం వ్యోమ బహిరంత ర్యథా ఘటే,
నిత్యం నిరంతరం బ్రహ్మ సర్వభూతగణే తథా ॥౧౮॥

తా॥ ఘటాదుల లోపలను, వెలుపలను, వ్యాపించియున్న ఆకాశము సర్వగతమై, నిత్యమై, ఏకమై యెట్లున్నదో యటులనె యాపరబ్రహ్మము సర్వభూతగణముల యొక్క బహిరంతరముల యందు సర్వదా నిత్యమై వ్యాపించియున్నది. కావున "బోధోఽహం" అను దృఢవిశ్వాసజ్ఞానఖడ్గముచేత దేహమే నేననెడి పాశమును నిర్మూలించి, ఆత్మసుఖము నొందుము. (నానారూపములఁ గనుపడు ఘటాదులు భిన్నమై నశించినను, ఆఘటాదుల బహిరంతరముల నుండు ఆకాశము నిత్యమై, ఏకమై యున్న

టులే, నానారూపములతో కనబడు భూతగణసంకీర్ణమయిన దృశ్యప్రపం
చము నశించినప్పటికి పరిపూర్ణైకపరబ్రహ్మమగు ఆత్మ సర్వవ్యాపియై
నిత్యమై స్థిరస్థాయిగ నున్నదని భావము) ॥ ౧౯ ॥

---

## ౧వ ప్రకరణము

## ఆత్మానుభవోపదేశము

## సమాప్తము.



౨ వ ప్ర క ర ణ ము

# ఆత్మానుభవోల్లాసము.

శిష్యప్రోక్తము.



అవ॥— శ్రీ అష్టావక్రముని యుపదేశించిన తత్త్వబోధామృతమును గ్రోలినవాఁడై, జనకరాజు తనకు ఆత్మానుభవానంద ముప్పొంగ, గురుకృతోపకారమును బ్రకటించుటకై, ప్రాచీనసంస్కారవశమున బాధితానుగతమగు మోహవిడంబనను స్మరించుచున్నాఁడు—

**శ్లో॥ అహో! నిరంజనశ్శాంతో బోధోహం ప్రకృతేఃపరః,**
**ఏతావంత మహం కాలం మోహేనైవ విడంబితః ॥**

తా॥ ఆహా! ఏమియాశ్చర్యము! నా యదృష్టవశమున గురూపదేశమునఁ గలిగిన అద్భుతానుభవమువలన నిపుడు నేను సర్వోపాధివినిర్ముక్తుఁడను, సర్వవికారశూన్యుఁడను, మాయాంధకారనిర్గతుఁడను, స్వప్రకాశచిన్మాత్రుఁడను నైతిని. అయ్యో! గురూపదేశమునకుఁ బూర్వము దేహమిట్టిది, ఆత్మయిట్టిది యను వివేకము లేనివాఁడనై మోహవశుఁడనై యుంటిని. ఇపుడు గురుప్రసాదాతిశయమున ఆత్మానందానుభవముఁ గలిగి యుంటిని. ౧

---

అవ॥— ఇట్లిదివఱకుఁ దాను చెందిన మోహవిడంబనను జెప్పి, గురుప్రసాదమునఁ దనకిపుడు దేహాత్మవివేకము కలిగినదని సహేతుకముగఁ జెప్పుచున్నాఁడు.—

శ్లో॥ యథా ప్రకాశయామ్యేకో దేహమేనం తథా జగత్,
అతో మమ జగత్సర్వమథవా న చ కించన ॥ ౨ ॥

తా ॥ ఏకాత్ముఁడనైన నేనీస్థూలదేహము నెటులఁ బ్రకాశింపజేయుచున్నానో యటులనే యీవిశ్వముంగూడఁ బ్రకాశింపజేయుచున్నాను. (జడమగు దేహము వలెనే యీవిశ్వమునయితము జడమేకాని ఆత్మకాదని భావము.)

అయితే జగత్తు మొదలు దేహమువఱకుఁగల జడవస్తువులతోఁ జిదాత్మకు సంబంధమెట్టిదని విమర్శింపఁగా, అది కల్పితమేకాని వాస్తవము కాదని దృఢపరచుచున్నాఁడు—

దృశ్యమగు జగత్తంతయు దృగ్రూపుఁడనగు నాయందారోపింపఁబడినదగుటచేత, ఆరోపితజగత్తు ప్రబోధకాలమందు స్వప్నమందుఁ దోఁచు జగత్తువలెనే మిథ్యయగును. సత్యాసత్యవస్తువులకు సత్యసంబంధమెప్పటికినిఁ గలుగనేరదు. ఆరోపణమును గల్పితమే ఇట్లు అధ్యారోపాపవాదమువలన విమర్శింపఁగ నేను ప్రకృతికి విలక్షణుఁడనైన శుద్ధబోధస్వరూపుఁడను, అని భావము.

అధ్యారోపమనఁగా— స్వస్వకారములగు గగనమారుతాదిభూతములవలన భౌతికము (జగత్తు) కలుగుట.

అపవాదమనఁగా— భూజలాదిభూతములు తమతమ కార్యములతోఁగూడ స్వస్వకారణములందు లయించుట.

అధ్యాసమనఁగా— భ్రాంతిచే అదికానిదానిని అదియని తలఁచుట.

అధ్యాసికమనఁగా— అధ్యాసముచేతఁ గలిగిన సంబంధము తత్త్వజ్ఞానమువలన నశించునదేకాని సత్యముకాదు. ॥ ౨ ॥

అవ||--- స్థూలశరీరము మిథ్యయైనను స్వప్నావస్థయందుండు సూక్ష్మశరీరమును, సుషుప్త్యవస్థయందుండు కారణశరీరమును గలవు. ఈసూక్ష్మకారణశరీరములకంటె ఆత్మ విలక్షణమైనదని విమర్శింపనియెడల, ఆత్మ, ప్రకృతివిలక్షణమైనదని తెలియబడదు కనుక నట్లు తెలియుటకైయాశరీరముల విమర్శనము వలనఁ గలిగిన ఆత్మానుభవమును జెప్పుచున్నాఁడు--

శ్లో || సశరీర మహో విశ్వం పరిత్యజ్య మయాఽధునా,
కుతశ్చిత్కౌశలాదేవ పరమాత్మా విలోక్యతే || 3 ||

తా|| ఆహా! ఏమియాశ్చర్యము! ఇపుడు లింగశరీరకారణశరీరసహితముగ నీస్థూలశరీరమును (విశ్వమును) పరిత్యజించి విమర్శింపఁగా, శాస్త్రాచార్యోపదేశమువలనఁ బ్రాప్తించిన చాతుర్యముచేతకదా పరమాత్మప్రాప్తమైన ఆత్మానందము ననుభవించుచున్నాను. మిథ్యయగు శరీరత్రయమును విమర్శింపఁగా సత్యమగు ఆత్మమాత్రమే మిగులుచున్నది. పరమాత్మానుభవమునకు గురుప్రసాదముదక్క నితరోపాయము లేదనిభావము. || 3 ||

---

అవ||--- శరీరసహితప్రపంచమునకు ఆత్మసత్తకంటె పృథక్సత్త లేదనుటకు దృష్టాంతము.---

శ్లో || యథా న తోయతో భిన్నా స్తరంగాః ఫేనబుద్బుదాః,
ఆత్మనో న తథా భిన్నం విశ్వమాత్మవినిర్గతమ్ || ౪ ||

తా|| జలమందుఁబుట్టిన ఫేనతరంగబుద్బుదములకు జలసత్తకంటె నన్యసత్త లేనిచందమున, ఆత్మయందారోపింపఁబడిన విశ్వమునకు ఆత్మసత్తకంటె నన్యసత్త లేదు. తరంగబుద్బుదాదులకు జలమధిష్ఠానమయినందున నవి జలముకంటె నెట్లు వేఱుగావో, యట్లనె సర్వప్రపంచమున కధిష్ఠానమగు

యిన చిదాత్మాత్మకంబై జగత్తు వేఱుకాదు.

వి— సముద్రమందు బొడము తరంగాదికము సముద్రమాత్రమే యని భావించినటుల సర్వాధిష్ఠానాత్మయొక్క వివర్తరూపమగు ప్రపంచమంతయు పరమాత్మగానే భావింపవలెనని యభిప్రాయము. దృశ్యమును బ్రహ్మముగా భావించుచుండుటచేత దృశ్యవస్తుస్ఫురణము క్రమముగ నశించి సర్వత్ర బ్రహ్మమే స్ఫురించుచుండును. ॥ ౪ ॥

---

అవ॥--- ఆత్మయె సర్వము నని నిరూపించుట కింకొక దృష్టాంతము.---

శ్లో॥ తంతుమాత్రో భవే దేవ పటో యద్వద్విచారితః,
ఆత్మతన్మాత్ర మేవేదం తద్వ ద్విశ్వం విచారితమ్ ॥౫॥

తా॥ నూలదృష్టిని విమర్శింపఁగా వస్త్రము నూలుపోఁగులతో నేయఁబడిన వస్త్రరూపముగ నుండియు నూలుకంటె విలక్షణముగఁ గనుపడుచున్నను అది నూలుపోఁగేయైనట్లు, బాహ్యదృష్టిని నీవిశ్వమంతయు బ్రహ్మముకంటె విలక్షణముగఁ గనిపించుచున్నను, విమర్శింపఁగా నది ఆత్మసత్తామాత్రాత్మకమై యగుచున్నది. నూలు లేనిది వస్త్రములేనట్లు ఆత్మకాని ది విశ్వమును లేదు. బట్టకు నూలధిష్ఠానమయినట్లు విశ్వమునకాత్మయె అధిష్ఠాన మని భావము. ॥ ౫ ॥

---

అవ॥— ఆత్మయే యంతటను వ్యాపించి యున్నదని నిరూపించుట్టు కింకొక దృష్టాంతము.—

శ్లో॥ యథా వేక్షురసే క్షిప్తా తేన వ్యాప్తైవ శర్కరా,
తథా విశ్వం మయి క్షిప్తం మయా వ్యాప్తం నిరంతరం॥

తా॥ చెఱకురసమునఁ గల్పింపఁ బడిన చక్కెరయొక్క మాధుర్యము చక్కెర కధిష్ఠానమయిన చెఱకునదే యైనట్లు, నిత్యానందస్వరూపాత్మ నగు నాయందుఁ గల్పితమయిన విశ్వము బాహ్యాభ్యంతరములందంతట నిత్యానందస్వరూపుఁడ నగు నాచేతనే వ్యాపింపఁబడియున్నది. కావున విశ్వ మానందాత్మస్వరూపమే యని భావము.

జీవున కానందము సహజము. ఏప్రాణియు సహజమగు ఆనందము పోవలెననియు, దుఃఖము కావలెననియుఁ గోరదు. కాని దుఃఖము పోవలెననియు, ఆనందము కావలెననియే కోరును. కావున ఆనందము నిత్యము, సహజము. అదియె బ్రహ్మస్వరూపము. దుఃఖము ఉపాధికృతము. ఇచట, "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే" "ఆనందో బ్రహ్మ" ఇత్యాదిశ్రుతులు ప్రమాణము. మఱియు శ్లో॥ అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశపంచకం। ఆద్యత్రియం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయం ॥ ఇతి శ్లోకరీత్యా ఆత్మస్వధర్మము లగు అస్తి భాతి ప్రియం అను రూపములచేత నేనంతటను నిండి యున్నాఁడనని పై (౪-౫-౬) శ్లోకత్రియముచేత నిరూపింపఁబడినది. ॥ ౬ ॥



అవ॥— విశ్వము చిదాత్మ...టె లేకు కాదు కదా, ... యొక ప్పుడు భాసించుటయు, నొకప్పుడు భాసింపకుండుటయుఁ గారణ... మన నుత్తరము.—

శ్లో॥ ఆత్మాజ్ఞానా జ్జగద్భాతి ఆత్మజ్ఞానా న్నభాసతే,
రజ్జ్వజ్ఞానా దహి ర్భాతి తజ్జ్ఞానా ద్భాసతే నహి ॥౭॥

తా ॥ రజ్జువునందు సర్పభ్రాంతి కలిగినపుడు భ్రాంతి కధిష్ఠాన మగు రజ్జువు కేవలము సర్పము వలెనే కనుపడును. కాని యది రజ్జువుగాఁ దెలిసినంత దానియందు సర్పభ్రాంతి కలుగదు. అప్రకారమే, అధిష్ఠానమగు ఆత్మవస్తువును దెలియనపుడు, ఈవిశ్వము విశ్వముగనె కనఁబడును. కాని ప్రబోధవలన ఆత్మతత్త్వముం దెలిసినంతట స్వప్నప్రపంచమువలె విశ్వము మిథ్యయగును. కాకాక్షిన్యాయమున నేకదృష్టి యిచట భావింపవలయును.

---

అవ॥— ఆత్మజ్ఞానము లేనపుడు ఆత్మప్రకాశము లేదు కదా, అట్లాత్మప్రకాశము లేకయె విశ్వ మెటులఁ బ్రకాశించును? అను సంశయమును దొలఁగించుటకై విశ్వము స్వరూపచైతన్యబలముచేతనే ప్రకాశించుచున్నదని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ ప్రకాశో మే నిజం రూపం నాతిరిక్తోఽస్మ్యహం తతః,
యదా ప్రకాశతే విశ్వం తదాహం భాస ఏవ హి॥౮॥

తా ॥ ప్రకాశము, అనఁగా నిత్యబోధయె నాస్వాభావికరూపము. అట్టి స్వయంప్రకాశుఁడ నగు నేను అప్రకాశముకంటె వేఱు కాను. ఇచట "యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకం" అను గీతావచనము ప్రమాణము. విశ్వము ప్రకాశించునపు డెల్ల ఆత్మప్రకాశము వనె ప్రకాశించుచున్నది. స్వరూపచైతన్యము సర్వజడభాసకము. జడవస్తు వెద్దియు నాత్మప్రకాశము లేక స్ఫురింపదు. మఱియు, ఆత్మస్వరూపప్రకాశమే లేనియెడల జగత్తు భాసింపదు. ఆత్మప్రకాశసహితమగు ధీవృత్తి

వస్తువు నావరించిన అజ్ఞానమును దొలఁగింప వస్తుసత్త స్ఫురించును. విశ్వ మెపుడు స్ఫురించినను ఆత్మప్రకాశముననె స్ఫురించునని "తస్య భాసా స ర్వ మిదం విభాతి" అనెడి శ్రుతి బోధించుచున్నది. ॥ ౮ ॥

---

అవ॥— స్వప్రకాశాత్మయందు జడమగు విశ్వము స్ఫురించుటకు అజ్ఞానమే కారణ మనుటకు దృష్టాంతము.—

శ్లో॥ అహో! వికల్పితం విశ్వ మజ్ఞానా న్మయి భాసతే,
రూప్యం శుక్తౌ ఫణీ రజ్జౌ వారి సూర్యకరే యథా ॥

తా ॥ ఆహా! ఏమి యాశ్చర్యము! శుక్తియందు రజతభ్రమయు, రజ్జువునందు సర్పభ్రాంతియు, ఎండమావులందు జలభ్రాంతియుఁ గలుగునటులె స్వప్రకాశుఁడ నగు నాయందు అజ్ఞానము వలన మిథ్యాకల్పిత మగు విశ్వము స్ఫురించుచున్నది. ॥ ౯ ॥

---

అవ॥— మాయావికారమగు విశ్వము మాయవలననె పుట్టి మాయ యందే లయమగును గాని, ఆవిశ్వముయొక్క యుత్పత్తిప్రళయములు చైతన్యాత్మయందు కావు, అని వాదించు సాంఖ్యమతమును నిరాకరించు చున్నాఁడు.—

శ్లో॥ మత్తో వినిర్గతం విశ్వం మయ్యేవ లయ మేష్యతి,
మృది కుంభో జలే వీచిః కనకే కటకం యథా ॥ ౧౦ ॥

తా ॥ మట్టినుండి కుండలు, ముంతలు మొదలగునవియు, జలమునం దలలును, కనకమునుండి కటకకుండలాదులును గలిగి, అవి యామృత్తికా

మలందే లయించునటుల, విశ్వమంతయు నావలననె కల్పితమై నాయందే లయమగుచున్నది. (అనగా, అజ్ఞానదశయందు విశ్వము స్ఫురించును. ప్రజ్ఞానమందు లయమగును). ఇచట, "యతోవా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ప్రయం త్యభిసంవిశంతి" అనెడు శ్రుతి ప్రమాణము.

వి— పరమాత్మయందంతర్భూతమై యున్న మాయాశక్తియే అధ్యాసచేత ప్రపంచరూపముగ భాసించుచున్నది. అనగా ప్రపంచము పరమాత్మయొక్క వివర్తరూపము. శుక్తియందు రజతము, రజ్జువందు సర్పమును తోచిన విధమున మాయచే కల్పితము. ఆమాయ పరమాత్మకంటె భిన్నము కాదు. కావున మాయాకల్పితప్రపంచము, అనగా సర్వదృశ్యమును పరబ్రహ్మమే యని భావము. ||౧౦||

---

అవ|| — మృత్తిక కుండయైనట్లు బ్రహ్మము విశ్వముగ మారినచో బ్రహ్మమున్ను వికారియై మృత్తిక వలెనె నశింపవలసి వచ్చును. అనుశంక కుత్తరము.

శ్లో || అహో! అహం నమో మహ్యం వినాశో యస్య నాస్తి మే
బ్రహ్మాదిస్తంబపర్యంతం జగన్నాశే౽పి తిష్ఠతః ||౧౧||

తా || సకలమునకు నుపాదానమయ్యును నాకు వికారస్వంసములు లేవు. ఏలయన, కటకాదులకు గనకము వలె విశ్వమునకు నేను పరిణామోపాదానకారణము కాను. పటమునకు దంతువు వలె ఆరంభోపాదానకారణమును గాను. మఱియేమన, సర్పారోపమునకు రజ్జువువలె వివర్తోపాదానకారణ మగుదును.—

(అధిష్ఠానవస్తువుకు మార్పు లేకయె ఆరోపస్ఫూర్తి) వివర్తోపాదాన

ము. ఇందారోపదృష్టి గలవానికి అధిష్ఠానము స్ఫురింపదు. అధిష్ఠానదృష్టి గలవానికి ఆరోపము స్ఫురింపదు. "దంతిని దారువికారే దారు తిరోభవతి సోపి తత్రైవ। జగతి తథా పరమాత్మా పరమాత్మన్యపి జగత్తిరోధత్తే" యని యాచార్యవచనము. (ఉత్సవాదులలో కఱ్ఱలు, గడ్డి, రంగులు మొదలగు వానితో నేనుఁగును గట్టి యలంకరింతురు కదా. అది యేనుఁగుయే. యను భ్రమ గల బాలురకు దార్వాదికము స్ఫురింపదు. అది దార్వాదికరూపమె కాని యేనుఁగు కాదనెడి తత్త్వబుద్ధిగలవారలకు గజము స్ఫురింపదు. ఇదియె వివర్తోపాదానము.) సకలకార్యములకు నట్టి వివర్తోపాదానకారణమై కాలత్రయమందును నాశము లేకఁ బ్రకాశించు నాకు నేనే నమస్కరింతును. బ్రహ్మాదిస్తంబపర్యంతమును గల చరాచర ప్రపంచము నశించినను, దానికి సాక్షిమాత్రుఁడ నగు నాకు నాశము లేదు. ప్రళయమందు సైతము సర్వసాక్షినగు నాకు (ఆత్మకు) నాశము లేదని భావము. ఇచట, "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "అజో నిత్యశ్శాశ్వతోయం పురాణః" ఇత్యాదిశ్రుతులు ప్రమాణములు. ॥ ౧౧ ॥

---

అవ॥--- ఆత్మ సుఖదుఃఖములతోఁ గూడిన నానావిధదేహములు గలది. అట్టి యాత్మ అహంకారరూపముతో నాయాదేశములకు రాకపోకలు సేయుచుండదా? యను శంకకు సమాధానము---

శ్లో॥ అహాహా! అహం నమో మహ్యం మేకోహం దేహవానపి,
క్వచి న్నగంతా నాగంతా వ్యాప్య విశ్వ మవస్థితః॥౧౨॥

తా॥ ఆశ్చర్యరూపుఁడనగు నాకు నేను నమస్కరించుచున్నాను. నానాసుఖదుఃఖములతోఁ గూడిన వివిధశరీరములందు నున్నప్పటికి సర్వా

త్మను నే నొకఁడనే. ఎట్లన, సూర్యుఁడు చంచలోపాధులయందు కంపము వలన వివిధరూపములఁ గనుపడుచున్నను ఒక్కఁడేయైనట్లు, విశ్వవ్యాపకుఁడనై యున్నందున పరిచ్ఛిన్నాహంకారమునకు విలక్షణుఁడ నగు నే నెట నుండియు రాను. ఎటకును బోను. నానావిధోపాధుల యందున్నను సర్వపరిపూర్ణుఁడనై, నిత్యుఁడనై యున్నాఁడను. గాన ఉపాధులకు రాకపోకలున్నను నాకు (ఆత్మకు) రాకపోకలు లేవు. ‖ ౧౨ ‖

---

అవ‖— శరీరసంసర్గము గలిగి జగత్తును ధరించిన ఆత్మకు నిస్సంగత్వ మెటుల? అను శంకకు సమాధానము.—

**శ్లో‖ అహో! అహంనమో మహ్యం దక్షో నాస్తీహ మత్సమః,**
**అసంస్పృశ్య శరీరేణ యేన విశ్వం చిరం ధృతం ‖౧౩‖**

తా‖ చమురు లేని కొగడా యెట్లు వెలుగదో, యటుల ఆత్మ ప్రకాశము లేని శరీరాదికవిశ్వము ప్రకాశింపదు. శరీరములందుండియు శరీరములను స్పృశింపకయే చిరకాలమునుండి యీ స్థావరజంగమరూపమగు సర్వజగత్తును ధరించియున్నాఁడను. అట్టి యసంభావ్యకార్యవిధానచతురుఁడు నాకంటె నితరుఁడు లేడు. కావున నట్టియాశ్చర్యరూపుఁడ నగు నాకే నమస్కారము. ‖౧౩‖

---

అవ‖— గృహముతో సంబంధించిన కుడ్యాదికమే గృహమునుధరించును కాని, సంబంధములేని వెవ్వియును గృహమును ధరింపవు. అటులనె జగత్తుతో సంబంధము లేని పరమాత్మ జగత్తు నెట్లు సంబంధము లేకుండ ధరించును? అను శంకకు సమాధానము.—

శ్లో॥ అహో! అహం నమో మహ్యం యస్య మే నాస్తి కించన,
అథవా యస్య మే సర్వం యద్వాఙ్మానసగోచరం॥౧౪॥

తా॥ సత్యము వ్యావహారికము, ప్రాతిభాసికము, పారమార్థికము నని త్రివిధము. జగద్వ్యాపారసమర్థమగునది వ్యావహారికసత్యము. స్వప్నమందప్పటికి మాత్రము తోఁచుచు మెలఁకువ రాఁగా లేకపోవునది ప్రాతిభాసికసత్యము. కాలత్రయాబాధితమగు ఆత్మ యొక్కఁడె పారమార్థికసత్యము. ఆత్మ యగు నావలె పరమార్థసత్యమగునది మఱియొకటి లేదు; కనుక నాకు దేనితోడను వాస్తవసంబంధము లేదు. నాకు శరీరాదికముతో సంబంధము మిథ్యాతాదాత్మ్యము వలనఁ గల్పితము. బంగారము కుండలముగ మారినప్పటికి కుండలావస్థయందును, దీని పూర్వోత్తరావస్థలందును నది సువర్ణమే యగునటుల విశ్వముతో మిథ్యాతాదాత్మ్యసంబంధమున నున్న ఆత్మ విశ్వముతో గలిసియుండును; అనఁగా విశ్వాకారముగ నున్నప్పుడును, విశ్వము యొక్క పూర్వోత్తరావస్థలయందును స్వయం ప్రకాశమానమయి యుండును. కాఁబట్టి సర్వవ్యవహారావస్థలయందును, వ్యవహారసంబంధము లేనప్పుడును పరమాశ్చర్యరూపుఁడ నగు నాకే నమస్కారము. ॥౧౪॥

---

అవ॥— జ్ఞానజ్ఞేయజ్ఞాతృరూపత్రిపుటీరూపసంసారము ప్రత్యక్షముగ నుండఁగ జగదాత్మలకు మిథ్యాతాదాత్మ్యమని యెట్లు చెప్పవచ్చును? అను శంక కుత్తరము.—

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం తథా జ్ఞాతా త్రితయం నాస్తి వాస్తవం,
అజ్ఞానాద్భాతి యత్రేదం సోఽహమస్మి నిరంజనః॥౧౫॥

తా॥ జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత యను త్రిపుటీరూపము మాయాకల్పితమే కాని పారమార్థికముగ లేదు. అనిర్వచనీయమయిన అజ్ఞానము వలన మిథ్యాతాదాత్మ్యముచేత నీవిశ్వము, ఏనాయందధ్యస్తమయి భాసించునో, అట్టి నేను నిరంజనుఁడను. అనఁగా ప్రపంచమలసంబంధశూన్యుఁడను. ॥౧౫॥

---

అవ॥--- ప్రపంచమలసంబంధములేని నిరంజనుఁడవగు నీకు దుఃఖసంబంధ మెటులఁ గలిగెనని శంకరాఁగా, ద్వైతభ్రమమూలమునఁ గలిగినదే కాని వాస్తవము కాదని చెప్పుచున్నాఁడు.---

**శ్లో॥ ద్వైతమూలమహో దుఃఖం నాన్యత్తస్యాస్తి భేషజమ్,**
**దృశ్యమేతన్మృషా సర్వం ఏకోఽహం చిద్రసోఽమలః॥౧౬॥**

తా॥ నిరంజనుఁడగు ఆత్మకు దుఃఖాధ్యాసము ద్వైతభ్రమవలనఁ గలిగినదే కాని వాస్తవము కాదు. మాయాతత్కార్యాతీతుఁడును, చిన్మాత్రస్వరూపుఁడును నగు నేనొక్కఁడనే నిత్యుఁడను. 'జడమగు దృశ్యప్రపంచము సర్వము నసత్యము' అను పరమార్థజ్ఞాన మొకటియె త్రివిధదుఃఖవ్యాధులకుఁ బరమౌషధము; కాని యితర మెట్టిదియును కాదు.

వి--- స్వప్నమందుఁ దోఁచు ప్రపంచ మప్పటికి నిజముగఁ దోఁచినను జాగ్రదవస్థ రాఁగా నది మిథ్య యగుచున్నది కదా! అదేవిధమున అవిద్యావశమున నాభాసగాఁ దోఁచు త్రిపుటీరూపప్రపంచము స్వస్వరూపజ్ఞానము కలుగఁగనే మిథ్యయగుచున్నది. ఇట్లు ద్వైతప్రపంచము అధ్యాసమాత్రమే యని తెలిసికొనుటయే సంసారదుఃఖనాశనోపాయము.

---

అవ||--- అయితే యీద్వైతప్రపంచాధ్యాసమునకు నిమిత్త మేమి? ఉపాదాన మేమి? అను ప్రశ్న కుత్తరము---

శ్లో || బోధమాత్రోహ మజ్ఞానా దుపాధిః కల్పితో మయా,
ఏవం విమృశతో నిత్యం నిర్వికల్పే స్థితిర్మమ ||౧౭||

తా || పారమార్థికముగ విచారింపఁగా నేను చిదేకమాత్రుఁడను. సర్వాధిష్ఠానమగు నాయందు మదీయమాయాశక్తివలన అహంకారాదులతోఁ గూడిన ద్వైతప్రపంచము కల్పింపఁబడినది. ఇట్లు నిత్యము విమర్శించుటచేత ద్వైతవాసన నశించి స్వరూపచైతన్యమందు స్థితి కలిగినది. (బ్రహ్మాస్మి) యను నిష్ఠ కలిగినది. ||౧౭||

---

అవ||--- లోకములోఁ బుట్టిన దెల్ల నశించును కదా. స్వరూపచైతన్యప్రాప్తిరూపమగు ముక్తియుఁ బూర్వోక్తవిచారము వలన బుట్టినదే కనుక నదియు నశింపవలయును. అట్టి విచారము వలనఁ బుట్టనిదైతే విచారహీనులకుం గూడ ముక్తి కలుగవచ్చును. అను శంకలకు సమాధానము---

శ్లో || నమేబంధోస్తి మోక్షో వా భ్రాంతిశ్శాంతా నిరాశ్రయా,
అహో! మయి స్థితం విశ్వం వస్తుతో న మయిస్థితం||౧౮||

తా || నేను నిత్యచిద్రూపుఁడనగుటచే నాకు బంధమోక్షములు వాస్తవముగ లేవు. అట్లైన శాస్త్రవిచారమున కేమి ఫల మనిన, ఆరోపితబంధమోక్షములకుఁ గారణమగు భ్రాంతినిఁ దొలఁగించుటయే దానికి ఫలము. నాయందారోపితమగు విశ్వము కాలత్రయమందును నాసత్తకంటె నితరసత్త లేనిదగుటచేత, వాస్తవముగ లేదను విమర్శనము వలన, అజ్ఞానజన్యమగు

భ్రాంతి నష్టమగునే కాని, యీవిమర్శనము వలన నిత్యపరమానందాత్మ పుట్టింపఁబడదు. కనుక నది నశించునదియుం గాదు. శాస్త్రవిమర్శనము చేత భ్రాంతినిదానమగు అజ్ఞానము తొలఁగును. కనుక భ్రాంతియే నిరాధారమై నశించును. అట్లు విమర్శింపనివారలకు భ్రాంతి తొలఁగనిచో ముక్తి లేదు.

వి—— విశ్వము, బంధము, మోక్షము ననునవి భ్రాంతిజన్యములు. కనుక అజ్ఞానము తొలఁగఁగనే యవి నశించునవే. ఆత్మ త్రికాలాబాధ్యమయిన కేవలపరమానందస్వరూపము. అట్టిస్వరూపప్రాప్తిరూపమగు ముక్తి నిత్యసిద్ధమయినదే కాని క్రొత్తఁగా బుట్టినది కాదు. మేఘముచే నాచ్ఛాదింపఁబడిన భానునివంటిది. అజ్ఞానమనెడి మేఘము తొలఁగఁగనే జ్ఞానసూర్యుఁడు ప్రకాశించుచునే యుండును. భ్రాంతిని దొలగించుకొనుటయే ముక్తిసాధనమని యిందలి పరమార్థము. ||౧౫||

---

అవ||— ఉపాదానమగు అధిష్ఠానము నశింపకుండుటచేత ముక్తులకు దేహాదిప్రపంచముతో సంబంధము కలుగవలయునే? అను శంక కుత్తరము.—

శ్లో|| స్వశరీర మిదం విశ్వం న కించి దితి నిశ్చితమ్,
శుద్ధచిన్మాత్ర ఆత్మా చ తత్కస్మిన్కల్పనాధునా ||౧౬||

తా|| శరీరోపాధితోఁ గూడిన యీవిశ్వము సత్యమనిగాని, అసత్యమని కాని నిశ్చయింపఁబడదు. ఇందుకు, "నేహ నానాస్తి కించన" అనెడి శ్రుతి ప్రమాణము. ఆత్మయన్ననో యది చిన్మాత్రము, శుద్ధము, మాయామలసంబంధశూన్యమయినదియు కావున విశ్వకల్పన కుపాదానమగు అజ్ఞానము నశించినపుడు విశ్వము దేనియందు కల్పింపఁబడును? [illegible]

ర్వికల్పన కాధారమే లేదు. కనుక ప్రపంచకల్పనయు మిథ్యయే యగును. ||౧౯||

---

అవ|| — ప్రపంచమంతయు మిథ్యయగునేని వర్ణజాత్యాశ్రమయుక్తమగు శరీరము కూడ మిథ్యయే యగును. అట్లైన ఉత్తమశరీరములను గుఱించి వర్తించెడు విధినిషేధశాస్త్రము మిథ్యకావలెను. అటులగునేని శాస్త్రబోధితము లగు స్వర్గనరకాదులు మిథ్యలగుటచే స్వర్గసుఖాపేక్ష గాని, నరకమునుండి భయము కాని యెవ్వానికిం గలుగకుండవలయును. ఇంతియేకాక శాస్త్రబోధితము లగు బంధమోక్షములు సత్యము కాకపోవును. అను నీయాక్షేపణములకు అంగీకారపూర్వకముగ పరిహారముం జెప్పుచున్నాఁడు.--

శ్లో|| శరీరం స్వర్గనరకౌ బంధమోక్షౌ భయం తథా,
కల్పనామాత్రమేవైతత్ కిం మే కార్యం చిదాత్మనః ||

తా|| శరీరస్వర్గనరకాదిక మంతయు కల్పనామాత్రమె కాని వాస్తవము కాదు. నిత్యప్రకాశస్వరూపుఁడగు సూర్యునకు మేఘముల రాకపోకలవలన లాభనష్టములు లేని విధమున సచ్చిదానందాత్ముఁడనగు నాకీ శరీరాదికముల రాకపోకలవలన లాభనష్టములు లేవు. విధినిషేధములను బంధమోక్షములను బోధించెడి శాస్త్రములు అవిద్యావంతులను (అజ్ఞానులను) గూర్చియె వర్తించును; గాని తత్త్వజ్ఞానికి శాస్త్రముల వలనఁ బ్రయోజనమేమియు లేదు. ||౨౦||

---

అవ|| — స్వర్గాదులతోఁ దనకుఁ బ్రయోజనము లేదని చెప్పియు

న్నాఁడు. కావున, ఇహలోకముతోఁగూడఁ దనకుఁ గార్యము లేదని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ అహో! జనసమూహేపి న ద్వైతం పశ్యతో మమ,
అరణ్యమివ సంవృత్తం క్వ రతిం కరవాణ్యహం ॥౨౧॥

తా ॥ ద్వైతభ్రాంతిలేని నాకు జనసమూహమునయితము నిర్జనారణ్యమువలె నున్నది. కావున మిథ్యాకల్పితప్రపంచములో దేనినిఁ బ్రేమింతును? దృగ్రూపుఁడనగు నాకు దృశ్యవస్తువునందు ప్రీతి లేదని భావము. ॥౨౧॥

అవ॥— విషయములందుఁ గోరికలేకపోయినను, మమతాస్థానమగు శరీరమందును, అహంతాస్థానమగు అహంకారమందును (అనఁగా నా శరీరము నేను అను) స్పృహ కలుగుచున్నది కదా? యను ప్రశ్నకుత్తరము.—

శ్లో ॥ నాహం దేహో న మే దేహో జీవో నాహ మహంహిచిత్,
అయ మేవ హి మే బంధ ఆసీద్యా జీవితే స్పృహా ॥ ౨౨॥

తా ॥ దేహము జడము కనుక నది నేను కాను. నిస్సంగుఁడను కనుక నాకు దేహమును లేదు. అకర్త్రాత్మనగు నాకుఁ గర్తృరూప మగు అహంకారమును లేదు. నేను కేవలచిద్రూపుఁడను. అయితే, వివేకవంతులకుఁ గూడ జీవితమందు స్పృహయుండనేల యంటివేని వినుము; జీవితస్పృహయే నాకు పూర్వము బంధమయ్యెను. జీవనార్థమై పురుషుఁడు సేయు ధనార్జనాదికయత్నము జీవితేచ్ఛాబంధమగును. అది జ్ఞానసాధనము నకుఁ బ్రతిబంధమగును. ఇపుఁడు గురుబోధామృతపానసంతృప్తుఁడనై,

నిష్పరిగ్రహుఁడనై, సచ్చిదానందానుభవశాలినై యున్న నాకు ప్రాణధారణ రూపమగు జీవితమందు సయితము స్పృహ లేదు. ॥౨౨॥

---

అవ॥— పిమ్మట, తనయొక్క సర్వజగదధిష్ఠానత్వమును జూచి చెప్పుచున్నాఁడు.—

**శ్లో॥ అహో! భువనకల్లోలై ర్విచిత్రై ర్ద్రాక్సముత్థితమ్,**
**మయ్యనంతమహాంభోధౌ చిత్తవాతే సముద్యతే॥౨౩॥**

తా॥ ఆహా వింత! అనంతసుఖసాగరుండ నగు నాయందు చిత్తమనెడి వాయువు బయలుదేరఁగ నానావిధభువనరూపములగు తరంగము లనేకము లుత్పన్నమగుచున్నవి. నిర్మలమగు మహాసముద్రమున వాయు జృంభణమువఁ దరంగములు బుట్టినను, ఆతరంగములు సముద్రము కంటె వేఱు కావు. అటులనే సర్వపరిపూర్ణమగు చిదాత్మయందుఁ జిత్తవిజృంభణము కలిగెనేని యనంతములగు నానావిధభువనములు పొడమును. ఆభువనములు చిదాత్మ కంటె వేఱుకావు. అనఁగా ఆత్మకుఁ జిత్తవైకల్యము కలిగినప్పుడే మిథ్యయగు విశ్వము స్ఫురించును. మిథ్యయగు చిత్తము ఆత్మ కాదుకనుక పుట్టిచిత్తమందుఁ బొడమిన సంకల్పవికల్పరూపమగు విశ్వమును మిథ్యయే యని భావము. ॥ ౨౩ ॥

---

అవ॥— ఇఁక ప్రారబ్ధక్షయావస్థ నను వదించుచున్నాఁడు.—

**శ్లో॥ మయ్యనంతమహాంభోధౌ చిత్తవాతే ప్రశామ్యతి,**
**అభాగ్యా జ్జీవవణిజో జగత్పోతో వినశ్వరః ॥౨౪॥**

తా॥ సర్వవ్యాపకచిత్సాగరుఁడ నగు నాయందు సంకల్పవికల్పశాలియగు మనోమారుతము, సంకల్పవికల్పాదులు లేకుండ శాంతించఁగా జీవాత్మయను వర్తకుని యొక్క ప్రారబ్ధక్షయమను దురదృష్టము వలన శరీరాదు లనెడి యోడలసమూహము ఆత్మాంభోధియందు మునిగిపోవును. మనోబుద్ధ్యహంకారచిత్తముల సంసర్గమువలన నిర్మలాత్మకు జీవన్ముక్తియుఁ గలుగదు. అప్పుడు స్వప్నమందుఁ దోఁచునట్లే విశ్వము గోచరించును: గాని మనోబుద్ధ్యహంకారచిత్తములు ఆత్మయందు లయమయినపుడు విజ్ఞానపరిపూర్ణమై, ఆత్మ నిర్మలమై బోధరూపముగ నుండును దానిచే సకలప్రారబ్ధక్షయమై జీవన్ముక్తి కలుగును. (సినిమా యందలి దీపమును తెరపై ప్రసరించు దాని కాంతియు, సత్యమును, నిర్మలము నైనవి. ఆదీపముముందు ఉయగు ఫోటో ఫిల్ము మిథ్యయయ్యును తెరపై చిత్రవిచిత్రచిత్తరువుల సత్యద్భుతలీలలఁ గనుపరచును కదా. అటులనె ఆత్మ యాసినిమాదీపమువంటిది. మనోబుద్ధ్యహంకారచిత్తములు ఫోటో ఫిల్ము వంటివి. ఈఫోటోఫిల్ము లేనిచో దీపమున నిలిచియుండు శుద్ధతేజస్సు వలెనె ఆత్మకు మనోబుద్ధిచిత్తాహంకారములు లేని యెడల శుద్ధబోధమాత్రమే సత్యమై, స్థిరస్థాయియై యుండును. అట్లుండుటయె ముక్తి యని భావము). ॥ ౨౪ ॥

---

అవ॥— దుర్ఘటఘటనాశక్తిసామర్థ్యమువలనఁ దనయందె సర్వజీవవ్యవహారమును దోఁచునని చెప్పుచున్నాఁడు—

**శ్లో॥ మయ్యనంతమహాంభోధా వాశ్చర్యం జీవవీచయః,**
**ఉద్యంతి ఘ్నంతి ఖేలంతి ప్రవిశంతి స్వభావతః॥ ౨౫॥**

తా॥ ఆహా! ఏమి యాశ్చర్యము! నిష్క్రియుఁడను, నిర్వికారుఁడను,

అనంతసుఖాంబుధిని నగు నాయందు జీవములనెడి తరంగములు పొడముచున్నవి. వీనిలో కొన్ని శత్రుభావమునఁ బరస్పరముఁ గొట్టుకొనును. కొన్ని మిత్రభావాధ్యాసవలన పరస్పరముఁ గ్రీడించును. అవిద్యాకామకర్మక్షయము కాఁగా నవి నాయంద లీనమగును. కాఁబట్టి స్వాభావికముగ నవిద్యాకామకర్మస్వభావవశమునని యీజగదుత్పత్త్యాదికము కలుగుచున్నది. ఘటము నశింప ఘటాకాశము మహాకాశమందుఁ గలసినటులె, అవిద్యాకామకర్మక్షయము కాఁగా స్వాభావికముగ చిద్రూపాంశమున సర్వము నాయందె లీనమగును. (అవిద్యాకామకర్మవిషయమై ౧వ ప్ర॥ ౧౦వ శ్లోకమునకు టిప్పణిఁ జూడవలెను).

---

ఈద్వితీయప్రకరణమందు శిష్యుఁడగు జనకరాజు తన స్వానుభవస్థితిని నివేదింపఁగా గురువగు శ్రీ అష్టావక్రముని మిగుల సంతుష్టుఁడును, ఆశ్చర్యనిమగ్నుఁడును నయ్యెను.

ఆత్మానుభవోల్లాసము
౨వ ప్రకరణము
సమాప్తము.



## ౩ వ ప్రకరణము

# ప్రత్యాక్షేపద్వారోపదేశము.

గురుప్రోక్తము.

అవ॥— ౨ వ ప్రకరణమందు శిష్యుఁడగు జనకరాజు నివేదించిన యనుభవజ్ఞానామృతముం గ్రోలినవాఁడయ్యును, శ్రీ అష్టావక్రమునీంద్రుఁడు కరుణాయత్తమనస్కుఁడై, విజ్ఞానానుభవము గల తన శిష్యుఁడు లోకవ్యవహారనిరతుఁడై యుండుటచే నతని విజ్ఞానము నింకను బరీక్షించుటకై శిష్యుని వ్యవహారస్థితి నాక్షేపించు నెపమున ఆత్మానుభవస్థితి నుపదేశించుచున్నాఁడు.—

శ్లో॥ అవినాశిన మాత్మాన మేకం విజ్ఞాయ తత్త్వతః,
తవాత్మజ్ఞస్య ధీరస్య కథ మర్థార్జనే రతిః ॥ ౧ ॥

తా॥ శిష్యా! నిర్వికల్పము, కాలత్రయాబాధ్యము, దేశకాలవస్తుభేదశూన్యము, ఏకము నగు చిత్స్వరూపమందు నిదిధ్యాస కలవాఁడవై, పరిపూర్ణాత్మతత్త్వము నెఱింగిన ధీరుఁడవగు నీకు లోకవ్యవహారమందును, అర్థసంగ్రహమందును ప్రీతి యెట్లు కలిగెను? (చిదాత్మయొక్క విశేషణత్రయముచేత కాలకృత వస్తుకృత దేశకృత భేదము లాత్మకు లేవని తాత్పర్యము. అతతి సర్వం=అన్నిటిని వ్యాపించినది, కనుక "ఆత్మ" యనఁబడును.) ॥౧॥

---

అవ॥—ఆత్మజ్ఞానము కలిగినపుడు విషయసంగ్రహము కలుగకుం

ఘునా! యను శంకకు, ఆత్మాఽజ్ఞానమే విషయప్రీతికిఁ గారణమని సదృష్టాంతముగ నిరూపించుచున్నాఁడు.—

శ్లో॥ ఆత్మజ్ఞానా దహో ప్రీతి ర్విషయభ్రమగోచరే,
శుక్తే రజ్ఞానతో లోభో యథా రజతవిభ్రమే ॥ ౨ ॥

తా ॥ ఓయి శిష్యా! ఆత్మజ్ఞానము లేనపుడె విషయభ్రమ గోచరించును గాని, విజ్ఞానము కలిగినపుడు ఆత్మాతిరిక్తమగు విషయభ్రమ బాధింపదు. ఎట్లన, ముత్యపుచిప్పను జూచి యది ముత్యపుచిప్పయని తెలియకున్ననే కద యది వెండియను భ్రమచేత లోభము కలుగుచున్నది. ముత్యపుచిప్పయే యని తెలిసినవాఁడు దానిని రజతమని భ్రమఁ జెందడు. ఇది పామరజనులకు సయితమనుభవసిద్ధమే. కాబట్టి ఆత్మజ్ఞానము లేనివానికే కాని ఆత్మజ్ఞునకు విషయములు గోచరింపవు. ॥౨॥

---

అవ॥— అజ్ఞానమె విషయప్రీతికిఁ గారణమని చెప్పఁబడెను. మఱియు సర్వమునకు ఆత్మయె అధిష్ఠానమని యెఱింగినయెడల విషయముల యందుఁ దిరిగి ప్రీతి కలుగదని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ విశ్వం స్ఫురతి యత్రేదం తరంగా ఇవ సాగరే,
సోఽహ మస్మీతి విజ్ఞాయ కిం దీన ఇవ ధావసి ॥ 3 ॥

తా ॥ శిష్యా! సముద్రమందుఁ బుట్టిన తరంగములకు సముద్రజలసత్తయే కాని వేరుసత్త లేని విధమున, ఆత్మయందుఁ గల్పితమైన విశ్వమునకు ఆత్మసత్తకంటె నన్యసత్త లేదు. "సోహమస్మి" అనఁగా తత్పదార్థమును, సర్వాధారమును నగు "ఆత్మయే నేను" అని యనుభవమువలనఁ దె

లిసినవాఁడవయ్యును, (ఆత్మసాక్షాత్కారము గలిగియు), అది నాది, ఇది నాది, యీ మొదలగు యాశల నొందెదవేల? అని యాక్షేపము. ||౩||

---

అవ||— ఇట్టీ శ్లోకత్రియము చేత జ్ఞానియగు శిష్యునియందుఁ గనుపించు విషయవాసనలఁ గూర్చి యాక్షేపించి, యింకను శిష్యునిఁ బరీక్షించుటకై, సర్వసామాన్యముగ జ్ఞానులందుఁ గల విషయవాసనల గురు వాక్షేపించుచున్నాఁడు.—

శ్లో|| శ్రుత్వాపి శుద్ధచైతన్య మాత్మాన మతిసుందరమ్,
ఉపస్థేత్యంతసంసక్తో మాలిన్య మధిగచ్ఛతి ||౪||

తా|| గురూపదేశమున వేదాంతవాక్యములను విని, ఆత్మసాక్షాత్కారము గలిగియు, ప్రాప్తవిషయము లందాసక్తుఁడగు జ్ఞాని మూఢుఁడు కాఁడా? మోహజనక మగు విషయాసక్తి జ్ఞానికిఁ దగదని భావము. (ఉప= సమీపే, స్థా= తిష్ఠంతి, ఉపస్థే=ప్రాప్తమయిన విషయము లని వ్యుత్పత్తి) ఈప్రకరణమందు శిష్యునియొక్క జిజ్ఞాసకై యిట్లాక్షేపద్వారా గురువు సుమపదేశమునే చేయుచున్నాఁడు గాని నిజముగా నాక్షేపము లేదని యూహింపవలెను. ||౪||

---

అవ||— మఱల నాశ్చర్యముద్రితో నాక్షేపించుచున్నాఁడు.—

శ్లో|| సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని,
మునే ర్జానత ఆశ్చర్యం మమత్వ మనువర్తతే ||౫||

తా|| బ్రహ్మాదిస్థావరాంతమగు సర్వప్రపంచమునకు ఆత్మ అధిష్ఠానమై యున్నదనియు, రజ్జువునందు సర్పభ్రాంతి కలిగిన విధమున ఆత్మ

యందే సకలభూతములు నారోపింపఁబడినవనియు నెఱింగిన మునికిఁగూడ విషయప్రీతి కలిగినేని యది యాశ్చర్యము కాదా! ముత్యపుచిప్ప వెండివలెఁ గనపడుచున్నను, అది ముత్యపుచిప్పయని తెలిసినవాఁడు ఆమిథ్యారజతమున కాశపడఁడు. మఱియు, స్వప్నమందుఁదోఁచు ప్రియతమవస్తువును జాగ్రదవస్థయం దెవఁడును గోరడుగద. ॥ ౫ ॥

---

శ్లో॥ ఆస్థితః పరమాద్వైతం మోక్షార్థేపి వ్యవస్థితః,
ఆశ్చర్యం కామ వశగో వికలః కేలిశిక్షయా ॥ ౬ ॥

తా॥ సజాతీయవిజాతీయ స్వగతభేదరహితమగు అద్వితీయాత్మసాక్షాత్కారముఁ గలవాఁడై, మోక్షస్వరూపమగు సచ్చిదానందపరమాత్మయందు తదేకనిరతుఁడయ్యును ప్రాక్తనవాసనావశమునఁ గామపరతంత్రుడై వైకల్య మొందినటుల నటించుట వింతకదా! (ఇచట శిష్యుఁడు కేవలమాత్మసాక్షాత్కార మొంది జీవన్ముక్తుఁడగుట నిశ్చయమె, అట్టి జనకుఁడు లోకవ్యవహారానుగుణముగ నటించుటఁ జూచి గురువు శిష్యుని బాహ్యనటన కారణ మెఱింగియు నాతని స్తుతింపనొల్లక నిట్లాక్షేపరూపముగఁ బ్రశ్నించుచున్నాఁడని యూహింపఁదగినది.) ॥ ౬ ॥

శ్లో॥ ఉద్భూతం జ్ఞానదుర్మిత్ర మవధార్యాతిదుర్బలః,
ఆశ్చర్యం కామ మాకాంక్షేత్ కాల మంతమనుశ్రితః॥

తా॥ కామము జ్ఞానమున కత్యంతశత్రువుగ నిశ్చయించుకొనిన జ్ఞానియు నత్యంతదుర్బలునివలె కామవాంఛ నొందు టాశ్చర్యము కదా! వినాశకాల మాసన్నమయినఁ గాని జ్ఞానికి విషయతృష్ణ కలుగదని భావము. ॥ ౭ ॥

---

శ్లో॥ ఇహాముత్ర విరక్తస్య నిత్యానిత్యవివేకినః,
ఆశ్చర్యం మోక్షకామస్య మోక్షాదేవ విభీషికా ॥

తా॥ ఆత్మ నిత్యము, శరీరాదిప్రపంచ మనిత్యము నను వివేకము గలిగి ఐహికాముష్మికభోగవిరక్తుఁడై, సచ్చిదానందస్థితియనెడి మోక్షము నకై యత్నించు జ్ఞానియు, అనిత్యము లగు తనుధనముల వియోగమునకు భీతిల్లుట యాశ్చర్యము. స్వప్నమందు గలిగిన ధనశరీరాదుల నాశము వలనఁ గలిగిన భీతి జాగ్రదవస్థయం దెవ్వనికి నుండదు కదా! అట్లే జ్ఞానికిని విషయవియోగమువలన భీతి కలుగదని భావము. ॥ ౧ ॥

---

అవ॥ ఇంతవఱకు నాక్షేపణరూపముగ బోధించెను. ఇపుడు రోషమోదములు జ్ఞానికిఁ దగవని నిరూపించుచున్నాఁడు.—

శ్లో॥ ధీరస్తు భోజ్యమానోఽపి పీడ్యమానోఽపి సర్వదా,
ఆత్మానం కేవలం పశ్యన్న తుష్యతి న కుప్యతి ॥౨॥

తా॥ ధీరుఁడగు జ్ఞాని లోకసంబంధవిషయానుభవము గలిగియు నితరులు తనను నిందాదులచే బీడించినను, వానియం దెట్టిలక్ష్యమును లేక సర్వదా సుఖదుఃఖభోగాదిరహితమగు నాత్మసుఖము నే పొందుచుఁ దన్నితరులు స్తుతించుపట్ల సంతోషముగాని, నిందించునపుడు రోషముగాని లేకయుండును. పరిశుద్ధాత్మకు తోషరోషహేతువులు కలుగనే కలుగవని భావము. ౨

---

అవ॥ తోషరోషకారణములగు స్తుతినిందాదులు శరీరధర్మములగుటచేత, ఆశరీర మాత్మకంటె భిన్నమైనదని తెలిసి సదా ఆత్మానుసంధానపరు

డగు జ్ఞానికి నిందాస్తుతులవలన ఖేదమోదములు కలుగవని మఱల నిరూపించుచున్నాఁడు.—

శ్లో॥ చేష్టమానం శరీరం స్వం పశ్యత్యన్యశరీరవత్,
సంస్తవేచాపి నిందాయాం కథం క్షుభ్యే న్మహాశయః॥

తా॥ ఆత్మ నిష్క్రియము. మాయాకల్పితచేష్టలు శరీరమునకే గాని ఆత్మకు లేవు. తాను శరీరాతీతచిన్మాత్రుఁడ ననెడి దృఢనిశ్చయము గలిగి తనశరీరము నన్యశరీరమును వలె నాదరింపక నుపేక్షించు మహాశయుఁడు తన నితరులు స్తుతించినను, నిందించినను చలింపఁడు. ॥౧౦॥

---

అవ॥— చంపెడు మృత్యువును, చంపఁబడు శరీరమును మాయాకల్పితము లగుటచే ననిత్యములే యని దృఢనిశ్చితుఁడై సదా ఆత్మానుసంధానపరుఁడగు జ్ఞాని మృత్యువాసన్నమయినను భీతినొందడని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ మాయామాత్ర మిదం విశ్వం పశ్య న్విగతకౌతుకః,
అపి సన్నిహితే మృత్యౌ కథం త్రస్యతి ధీరధీః ॥౧౧॥

తా॥ ‡ మార్యమారకరూపమగు దృశ్యప్రపంచము సమగ్రముగ నసద్రూపమయినది. (మాయామాత్ర మయినది) అని తెలిసికొని, యీ శరీరాదిక మెటనుండి వచ్చును, ఎచట లయమగుననెడి విచారమందు సయితము కౌతుకము లేని విజ్ఞాని "ధీరధీః" అనఁబడును. వాఁడు చలనరహితస్వస్వరూపానుసంధాననిపుణుఁడు. అట్టి పరమవిజ్ఞాని మృత్యువు సన్నిహితమై యున్నను భయ మెందునా యని యాక్షేపము. (ఇచట శ్రీ అష్టావక్రముని తన శిష్యుఁడగు జనకుఁడు ధైర్యశాలియని నిశ్చయించియు

‡ మార్యము— చంపఁబడునది. మారకము— చంపునది.

నిట్లాక్షేపరూపముగ తత్త్వోపదేశ మొనరించుచున్నాఁడని యూహింపఁ దగినది. ఈశ్లోకార్థమునకు "అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః" అను భగవద్వాక్యము ప్రమాణము. ||౧౪||

---

అవ||— పై యాక్షేపము లన్నిటిని బోధరూపముగ గ్రహించు జ్ఞాని నిరుపమానుఁడని చెప్పుచున్నాఁడు.—

శ్లో|| నిస్స్పృహం మానసంయస్య నైరాశ్యేపి మహాత్మనః,
తస్యాత్మజ్ఞానతృప్తస్య తులనా కేన జాయతే ||౧౫||

తా|| "బ్రహ్మాహ మస్మి" యని పరబ్రహ్మస్వరూపమం దైక్యము నొంది సర్వమనోరథములఁ జాలించికొని, మోక్షమందుసయితము నిస్పృహత నందు మహాత్మునితో సాటియెవరు? ఎవరును లేరని యర్థము. ||౧౫||

---

అవ||— జ్ఞానికి గ్రాహ్యత్యాజ్యాదివ్యవహారము ఉండదని చెప్పుచున్నాఁడు.—

శ్లో|| స్వభావా దేవ జానానో దృశ్య మేత న్నకించన,
ఇదం గ్రాహ్య మిదం త్యాజ్యం స కిం పశ్యతి ధీరధీః||

తా|| ముత్తెపుచిప్పయందు రజతభ్రాంతి కలిగినపుడు విమర్శించి యది వెండికాదని తెలిసికొన్నరీతిని, తత్త్వోపదేశము చేత దృశ్య మంతయు సత్తని కాని, అసత్తని కాని చెప్పశక్యము కానిదని యెఱిఁగిన విజ్ఞాని యిది గ్రాహ్యము, నిది త్యాజ్యము నని తలఁచునా? ఇట్లు వికల్పింపఁడని భావము. ||౧౬||

---

అవ॥--- దీనికిఁ గారణము జెప్పుచున్నాఁడు.---

శ్లో॥ అంతస్త్యక్తకషాయస్య నిర్ద్వంద్వస్య నిరాశిషః,
యదృచ్ఛయాగతో భోగో న దుఃఖాయ నతుష్టయే॥

తా॥ (మనోబుద్ధిచిత్తాహంకారము లనెడి) అంతఃకరణము యొక్క దోషము వలన జనించు విషయవాసనలు, శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వములును లేని పూర్ణజ్ఞానికి దైవవశమున సంప్రాప్త మగు విషయభోగములు సుఖదుఃఖములను గలిగింపవు. (జ్ఞాని ప్రారబ్ధకర్మము ననుభవించుచు వాని వలన గలుగు సుఖదుఃఖములకుఁ జలింపడని భావము)॥ ॥౧౪॥

ప్రత్యాక్షేపద్వారోపదేశము
3-వ ప్రకరణము
సమాప్తము,



# శిష్యప్రోక్తానుభవోల్లాసము.

## ౪వ ప్రకరణము.



అవ॥— ఇంతదనుక గురువుచే బరీక్షార్థ మాక్షేపింపఁబడిన శిష్యుఁడు, ఆత్మజ్ఞానోల్లాసవశమున, జ్ఞానికయినను బ్రారబ్ధము వలన సర్వవ్యవహారములును బాధితానువృత్తిచేఁ గలుగుట కుపపత్తిఁ (క్రింది యాఱు శ్లోకములలో) జెప్పుచున్నాఁడు—

శ్లో॥ హంతాత్మజ్ఞస్య ధీరస్య ఖేలతో భోగలీలయా,
న హి సంసారవాహీకై ర్మూఢైః సహ సమానతా॥౧॥

తా॥ గురువరా! ఏమి యీ యానందము! తాను సర్వాధిష్ఠానమగు ఆత్మనని తెలిసికొన్నవాఁడై, విషయములపట్లఁ జిత్తచలనము లేక, ప్రారబ్ధవశమున లభించు భోగములఁ గ్రీడగా భావించు పరమవిజ్ఞానికి దేహాభిమానియై సంసారవృత్తినుండు మూఢునితో సామ్యము తగదు. ఇచట, "తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః । గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే" అనెడి గీతావచనము ప్రమాణము. (సత్త్వరజస్తమోగుణప్రధానమగు దేహము చేయు చేష్టలఁ దానే చేయుచున్నటుల మూఢుఁడు (అజ్ఞుఁడు) తలంచును గాని, తత్త్వజ్ఞుఁడు అహంకారాదికమునకును వాని కార్యములకును సాక్షిమాత్రుఁడై యుండి, గుణములును, కర్మములును తనకంటె భిన్నములుగ నున్నవి యను తత్త్వమును తెలిసినవాఁడై, ఇది తమంతట తామె ప్రవర్తించుచున్న గుణములయొక్క యాట యని యెఱిఁగి దానియందాసక్తుఁడు కాఁడు.) ॥౧॥

---

అవ॥— అయితే, సంసారమందు వ్యవహరించుచున్న జ్ఞాని సామాన్యసంసారులతో సమానుఁడు కాఁడా? యను శంక కుత్తరముగ జ్ఞాని హర్షాదిరహితుఁడగుట చేత నితరసంసారులవంటివాఁడు కాఁడని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ యత్పదం ప్రేప్సవో దీనాః శక్రాద్యాః సర్వదేవతాః,
అహో! తత్ర స్థితో యోగీ నహర్ష ముపగచ్ఛతి॥౨॥

తా.॥ అహా! గురువర్యా! ఇంద్రాదిసర్వదేవతలుసయితము, నేపర

మపదము నొందనిచ్ఛఁ గలిగి యది ప్రాప్తించక దీనులట్లు ఖేద మొంచె దరో, అట్టి సచ్చిదానందాఖ్యపదమందు తత్ త్వం పదార్థైక్యజ్ఞానానుభవముతో వర్తించు యోగి, విషయభోగము వలన హర్షమును జెందక సర్వదా ఆనందమయుఁడై యుండును కదా! ॥ ౨ ॥

---

అవ॥— తత్త్వజ్ఞునకు విధినిషేధములు లేవని చెప్పుటకు, వానికి పుణ్యపాపము లంటవని చెప్పుచున్నాఁడు.—

**శ్లో॥ తజ్జ్ఞస్య పుణ్యపాపాభ్యాం స్పర్శోహ్యంతర్న జాయతే,**
**న హ్యాకాశస్య ధూమేన దృశ్యమానాపి సంగతిః ॥3॥**

తా॥ 'తత్ త్వం' పదార్థైక్యానుభవము గల జ్ఞానికి పుణ్యపాపరూపము లగు అంతఃకరణధర్మము లంటవు. ఎట్లన, కంటికిఁ గనిపించు ధూమ మాకాశమున కంటనియట్లె, ఆత్మజ్ఞునకు పుణ్యపాపస్పర్శము లేదు. ఇచట, "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా" అను శ్రుతి ప్రమాణము.

వి— పై రెండుశ్లోకములలో "తత్త్వమసి" మహావాక్యార్థము సూచింపఁబడినది.

వేదాంతపంచదశి పంచమప్రకరణములోని 5-6 శ్లోకములను, ఉపదేశసాహస్రిలోని "తత్త్వమసి" ప్రకరణముఁ జూడఁదగును. ॥ 3 ॥

---

అవ॥— అయితే, కర్మములు చేయునపుడు (జ్ఞానికి) పుణ్యపాపస్పర్శము లేకుండు టెట్లు? అను శంక రాఁగా, జ్ఞానికి విధినిషేధనియమములు లేవని చెప్పుచున్నాఁడు.—

శ్లో ॥ ఆత్మైవేదం జగత్సర్వం జ్ఞాతం యేన మహాత్మనా।
యదృచ్ఛయా వర్తమానం తం నిషేద్ధుం క్షమేత కః ॥

తా ॥ దృశ్యమగు సర్వప్రపంచము పరమాత్మయే యను నిశ్చిత జ్ఞానము గల మహాత్ముఁడు వర్తించు వర్తనకు విధినిషేధము లెంచ సమర్థుఁ డెవడు? ఎవఁడును లేడు. "అవిద్యావద్విషయో వేదః" (వేదము లజ్ఞానులకొఱకే) అని శారీరకభాష్యమందును, "ప్రబోధనీయ ఏవాసౌ సుప్తో రాజేవ నందిభిః" (నిద్రించు రాజును నిద్ర మేల్కొల్పినటుల, విజ్ఞానియగువాని పార్శ్వస్థులు బోధింతురు.) అనెడి స్మృతియుం బ్రమాణము. (ఆత్మను సర్వప్రపంచముగ, సర్వప్రపంచము నాత్మగను జూచుచు, దేహేంద్రియాదిప్రపంచవాసనయే లేక, ఇంద్రియములు సేయు కర్మములయందు స్పృహయే లేక వర్తించు పరమవిజ్ఞానికి విధినిషేధములు, పుణ్యపాపములు లేవని భావము. ఏమన, అట్టి విజ్ఞాని సర్వదా బ్రహ్మానందము దక్క నొండెద్దియు నెఱుంగకుండును. ఇదియె జ్ఞానికి జాగ్రదవస్థ. పార్శ్వస్థు లెవరయిన ప్రపంచస్మృతిఁ గలిగించిన నపుడు మాత్ర మీప్రపంచమును స్వప్నముగఁ గనును.) ॥ ౪ ॥

వి— "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని। ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః" (గీత, 6-27) ఇతి గీతావాక్యరీత్యా సర్వభూతములను సర్వకారణమగు తనయందును, సర్వాధిష్ఠానమగు తనను సర్వభూతములయందును గను సమదర్శియగు మహాత్మునకు బ్రహ్మానందము దక్క నితర మెద్దియు గోచరింపకుండును గనుక నమ్మహానీయునకు విధినిషేధములు లేవు. పుణ్యపాపము లంటవు. అమ్మహాత్ముడు ప్రపంచాతీతుఁడై ప్రారబ్ధము ననుసరించి స్వేచ్ఛగ విహరించును.

---

అవ॥— ఇచ్ఛానిచ్ఛలను మఱలించుట శక్యము కాదు కనుక,జ్ఞాని సయితము యథేష్టముగఁ బ్రవర్తింపఁడా? యనుశంకకు సమాధానము.—

శ్లో॥ ఆబ్రహ్మాస్తంబపర్యంతే భూతగ్రామే చతుర్విధే,
విజ్ఞస్యైవహి సామర్థ్య మిచ్ఛానిచ్ఛావివర్జనే ॥౫॥

తా॥ బ్రహ్మాదిస్తంబపర్యంతముగఁ గల సమస్తప్రాణులకు నిచ్ఛానిచ్ఛల మఱలించుట శక్యము కాదు. అయినను, ఇచ్ఛాద్వేషముల మఱలింపసమర్థుఁడగు జ్ఞాని యదృచ్ఛాప్రవర్తనఁ గలిగియున్నను వానికి విధినిషేధనియమము లేదు. పరమవిజ్ఞాని వాయువుచే గొట్టుకొనిపోఁబడు తూలము వలె గమనభోజనాదికృత్యములు సేయుచుండినను వానియందెట్టి స్ఫురణము లేకయే చేయుచుండును. కావున వానికి విధినిషేధములు, నియామకములు కావని భావము. ॥౫॥

---

శ్లో॥ ఆత్మాన మద్వయం కశ్చి జ్జానాతి జగదీశ్వరమ్,
యద్వేత్తి తత్స కురుతే న భయం తస్య కుత్రచిత్ ॥౬॥

తా॥ 'తత్' పదార్థము పరబ్రహ్మ మగు జగదీశ్వరునిగాను, 'త్వం' పదార్థము ఆత్మగాను, ఈరెండు అభిన్నముగాను తెలిసికొనిన మహనీయుఁడు వేయిమందిలో నొక్కఁడుండును. ఇట్లనుభవమునఁ దెలిసికొన్న జ్ఞాని ప్రారబ్ధవశమున బాధితానువృత్తిచే కర్తవ్య మెద్దియో దాని నే చేయును. అట్లు చేసినందున వానివలన నిహమందును, పరమందును భయ మొందడు. ఎట్లనఁగా— దగ్ధపటము బట్టవలెనే కనుపించినను కట్టుట కది పనికిరాదు. ఇట్లే దృఢమగు తత్త్వజ్ఞాని చేసెడి గ్రహణత్యాగాదిక్రియలు వేఁచిన గింజలు మొలువని విధమున, వానికి బంధములు

గావు. ఆత్మజ్ఞానియొక్క క్రియలు తత్త్వజ్ఞానము చేతఁ దామె బాధితము లగును. ప్రారబ్ధవశమున బాధితము లయ్యును ప్రారబ్ధశరీరావసానపర్యంతము నుండెడి క్రియలే బాధితానువృత్తము లనఁబడును. ॥౮॥

శిష్యప్రోక్తానుభవోల్లాసము

౪వ ప్రకరణము

సమాప్తము.



# ఆచార్యోక్తలయచతుష్టయము.

౫-వ ప్రకరణము.



ఇట్లు జనకరాజు చెప్పిన యుల్లాసషట్కము వలన శిష్యునిఁ బరీక్షించినవాఁడై, గురువగు అష్టావక్రముని శిష్యునికి దృఢోపదేశము కొఱకు నాలుగు లయయోగము నుపదేశించుచున్నాఁడు:—

శ్లో॥ న తే సంగోఽస్తి కేనాపి కిం శుద్ధ స్త్యక్తు మిచ్ఛసి,
సంఘాతవిలయం కుర్వ న్నేవమేవ లయం వ్రజ ॥౧॥

తా॥ ఓయి శిష్యా! శుద్ధబుద్ధస్వరూపుఁడ వగు నీకు దేహగేహాదులయందు అహంకారమమత్వములు లేవు. కాబట్టి నీవు అసంగుఁడవు. అట్టి నీకు నిది గ్రాహ్యము నిది త్యాజ్యము నను నిబంధనము లేదు. అందువలన దేహోపాధియందున్న చైతన్యమాత్ర మగు ఆత్మనని భావించుచు, శిరశ్చరణాద్యవయవవిశిష్టమగు దేహమందు అనాదరణరూపమగు లయయోగము నవలంబింపుము. ॥ ౧ ॥

---

శ్లో॥ ఉదేతి భవతో విశ్వం వారిధే రివ బుద్బుదః,
ఇతి జ్ఞాత్వైక మాత్మాన మేవ మేవ లయం వ్రజ ॥ ౨ ॥

తా॥ శిష్యా! సముద్రమందు బుట్టిన బుడగలు సముద్రముకంటె వేఱుకానటుల, చిద్రూపుఁడవగు నీయందుద్భవమగు విశ్వము నీకంటె భిన్నమయినదికాదు. ఈప్రకారము సజాతీయవిజాతీయస్వగతభేదరహితమగు ఆత్మను దెలిసికొని, ఏకాత్మజ్ఞానమనెడి లయయోగము నొందుము. ॥ ౨ ॥

---

అవ॥— హారసర్పాదిభేదములు ప్రత్యక్షముగ గోచరించుచుండ, నా హారాదివిలయ మెట్లు నగునను శంకకు సమాధానము.

శ్లో॥ ప్రత్యక్షమ ప్యవస్తుత్వా ద్విశ్వం నాస్త్యమలే త్వయి,
రజ్జుసర్పఇవ వ్యక్త మేవ మేవ లయం వ్రజ ॥ 3 ॥

తా॥ రజ్జువునం దారోపింపఁబడిన సర్పము భ్రాంతికాలమున నిజముగ సర్పమువలెఁ దోఁచినను విమర్శింప నది రజ్జువుకంటె వేఱు కానటుల, శుద్ధచిద్ఘనమాత్రుఁడవగు నీయందు స్ఫురించు విశ్వము భ్రాంతికాలము

న బ్రహ్మత్వముగఁ గన్పించినను, అది అవిద్యాకల్పితము కావున ప్రబోధస
మయమున లేనిదే యగును. హేయోపాదేయమగు ద్వితీయవస్తువు లేనందు
న ఏకాత్మజ్ఞానమనెడి లయయోగమును బొందుము. ॥ ३ ॥

---

శ్లో॥ సమదుఃఖసుఖః పూర్ణ ఆశా నైరాశ్యయో స్సమః,
సమజీవితమృత్యు స్స న్నేవమేవ లయం వ్రజ ॥ ४ ॥

తా ॥ నీవు సదా ఆత్మానందపరిపూర్ణుఁడవు, కనుక దైవవశమున
సంభవించు సుఖదుఃఖములు, ఆశాతూష్ణీంభావములు, జీవనమరణములు, నను
నివి ఆత్మధర్మములు కాక మాయాజనితము లగుటచేత తుచ్ఛములు కావున
వాని నన్నింటియందు సమభావముతో సదా బ్రహ్మదృష్టిరూపమగు లయ
యోగము నభ్యసింపుము. ॥ ४ ॥

ఆచార్యోక్త లయచతుష్టయము.

౫వ ప్రకరణము.

సమాప్తము.



# ఉత్తరచతుష్కము.

## ౬ వ ప్రకరణము.

### శిష్యప్రోక్తము



అవ॥— ఈవిధముగఁ దనను బరీక్షింప గురువు లనుయోగము నుపదేశింపఁగా శిష్యుఁడు పూర్ణాత్ముఁడగు వానికి లయాదులతోఁ బనిలేదని విన్నవించుచున్నాఁడు.—

శ్లో॥ ఆకాశవ దనంతోఽహం ఘటవ త్ప్రాకృతం జగత్,
ఇతి జ్ఞానం తథైతస్య నత్యాగో న గ్రహో లయః॥౧

తా॥ ఆత్మనగు నేను ఆకాశము వలె నంతము లేనివాఁడను. అయితే అనంతమగు ఆత్మకు దేహాదినివాస మెట్లనిన? దేహాదిక మగు జగత్తు ఘటము వలెనే ప్రకృతివలనఁ దోఁచుచున్నది. ఆకాశమునకు ఘటము నివాసము నవచ్ఛేదకము నైనట్లు ఆత్మకు విశ్వము నివాసమును నేకదేశావచ్ఛేదకము నగును. దీనికిం బ్రమాణముం జెప్పుచున్నాఁడు---

వేదాంతసిద్ధమగు జ్ఞాన మనుభవరూపమయినది. అట్టి జ్ఞానమునకుఁ బ్రమాణ మనుభవమే కాని మఱియొకటి లేదు. అనుభవైకవేద్యమగు సదాత్మ అనంతమయిన దగుటవలన దానికిఁ ద్యజించుట కాని, గ్రహించుట కాని, లయించుటకాని సంభవింపదు. ఎట్లనఁగా, ఆకాశమున కుపాధివశమున నివాసమునుపరిచ్ఛేదకమునగు ఘటమును గ్రహింప, విడువ, లయింప, ఘటావచ్ఛిన్నాకాశము గ్రహింపఁబడినట్లు, విడువబడినట్లు, లయించినట్లును భ్రాంతిచేఁ దోఁచును. ఈగ్రహణాదికములు ఉపాధిభూతఘటధర్మములే

కాని అసంగమగు గగనముయొక్క ధర్మములు గావు. ఇట్లే ఉపాధిభూత దేహధర్మము లగు గ్రహణత్యాగాదు లెన్నఁడును నిరుపాధికాఖండాత్మకు లేవు, ॥౧॥

---

అవ॥— ఘటాకాశములు భిన్నమైనట్లు దేహాత్మలు భిన్నములనెడి శంక కలుగును గాన నట్టి సందేహనివృత్తికై యింకొక దృష్టాంతము.—

**శ్లో॥ మహోదధిరివాహం స ప్రపంచో వీచిసన్నిభః,**
**ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః॥౨॥**

తా॥ ఆత్మనగు నేను (అపారమగు) మహాసముద్రమువంటివాడను. ఆమహాసముద్రమం దుద్భవించు తరంగసముదాయము వంటిది యీ మిథ్యాప్రపంచజాలము. ఇట్టి నిశ్చయజ్ఞానము గలవానికి గ్రహణత్యాగాదులు లేవు. ॥౨॥

---

అవ॥— అయితే, సముద్రతరంగదృష్టాంతము వలన దేహాత్మలకు ప్రకృతివికృతిభావము కలుగును గనుక తన్నివారణమునకు నింకొక దృష్టాంతమును జెప్పుచున్నాఁడు.—

**శ్లో॥ అహం స శుక్తిసంకాశో రూప్యవద్విశ్వకల్పనా,**
**ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః ॥**

తా॥ ఆత్మనగు నేను రజతభ్రమాధిష్ఠానమగు శుక్తివంటివాడను. భ్రమమూలమున దోఁచు రజతము వంటిది విశ్వకల్పనము. ఇట్టియథార్థజ్ఞానము గలవానికి గ్రహణత్యాగాదులు లేవు. ॥ ౩ ॥

---

అవ॥— శుక్తిదృష్టాంతము వలన సైతము ఆత్మకు పరిచ్ఛిన్నత్వము గలుగునను శంకకు సమాధానము జెప్పుచున్నాడు.---

శ్లో॥ అహంవా సర్వభూతేషు సర్వభూతా న్యథో మయి,
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహోలయః॥

తా॥ జడమగు మాయకును, తత్కార్యమగు విశ్వమునకును సత్తాస్ఫూర్తులు నావలననే కలుగుచున్నవి. కాని యీరెండును వాని సహజధర్మములు కావు. కాబట్టి సర్వభూతములకు (సర్వసృష్టికి) అధిష్ఠానము నేనే. నాకు (ఆత్మకు) నన్య మెద్దియు లేదు. ఇట్లుండ వేదాంతసిద్ధమగు శుదాత్మకు గ్రహణత్యాగాదులు లేవు.

శ్రీ శ్లోక్త ముత్తర చతుష్కము

౬వ ప్రకరణము

సమాప్తము.





## ౭ వ ప్రకరణము

# అనుభవపంచకము.

### శిష్య ప్రోక్తము.



అవ॥--- (౬ వ ప్రకరణమందు చెప్పినట్టుల) లయయోగము లేని యెడల సంసారవిక్షేపము తప్పదను శంక రాఁగా, లయము లేకున్నను లోపము లేదని శిష్యుఁడు తన యుల్లాసము కొలంది అనుభవపంచకమను నీ శ్లోకములవలన గురువునకు నివేదించుచున్నాఁడు.—

**శ్లో॥ మయ్యనంతమహాంభోధౌ విశ్వపోత ఇతస్తతః,**
**భ్రమతి స్వాంతవాతేన న మమాస్త్యసహిష్ణుతా ॥౧॥**

తా॥ గురువర్యా! చిదాత్మయగు నేననెడి అపారమహాసముద్రమునందు విశ్వములను నౌకలు మనస్సను వాయువుచేతఁ గొట్టఁబడి యిటునటు తిరుగులాడును. ఓడలయొక్క పరిభ్రమణమును సముద్రము శ్రమలేక యెట్లు సహించునో అట్లే యీ విశ్వభ్రమణమును నేను శ్రమ లేకయే సహింతును. ॥ ౧ ॥

---

అవ॥--- జగద్వ్యవహారము వలనఁ దనకెట్టిలోపమును లేదని చెప్పియున్నాఁడు. ఇపుడు జగదుత్పత్తిలయముల వలనఁ గూడ తనకేలోపమును లేదని చెప్పుచున్నాఁడు.

**శ్లో॥ మయ్యనంతమహాంభోధౌ జగద్వీచిః స్వభావతః,**
**ఉదేతు వాస్తమాయాతు న మే వృద్ధిర్న చ క్షతిః ॥౨॥**

తా॥ నాకారరహితమై, ఆద్యంతములు లేని నా ఆత్మయను మహాసముద్రమందు జగత్తులను అల లనేకములు స్వాభావికముగ నుదయించుచుండును. మఱియు నవి యంతరించుచుండును. అటులీ జగత్తు లుద్భవించుటవలన వృద్ధి గాని, లయమొందుటవలన క్షయము గాని నాకు (ఆత్మకు) లేవు. ॥౨॥

---

అవ॥--- పై దృష్టాంతము వలన స్వాత్మయందు జగద్వ్యాపారము కలుగుచున్నందున నది భ్రమమాత్రమే యని చెప్పుచున్నాఁడు.---

శ్లో॥ **మయ్యనంతమహాంభోధౌ విశ్వం నామ వికల్పనా,**
**అతిశాంతో నిరాకార ఏత దేవాహమాస్థితః ॥3॥**

తా॥ ఆద్యంతములు లేని చిదాత్మనగు నేననెడి మహాసముద్రమందు బొడము జగద్వ్యాపారమంతయు భ్రమమాత్రమే కాని నిజము కాదు. కనుక నీప్రపంచమువలన నాకెట్టి యుపద్రవమును లేదు. కారణమేమన నేను నిరాకారుఁడను. జ్ఞానస్వరూపుఁడను. (నగు ఆత్మను). అట్టి పూర్ణాత్మజ్ఞానస్థితుఁడనై యున్న నాకు లయయోగముతోఁ బనిలేదు. ॥3॥

---

అవ॥--- ఇంకను అతిశాంతత్వమునే స్ఫుటపరచుచున్నాఁడు.---

శ్లో॥ **నాత్మా భావేషు నో భావ స్తత్రానంతే నిరంజనే,**
**ఇత్యసక్తోఽస్పృహః శ్శాంత ఏత దేవాహ మాస్థితః॥౪॥**

తా॥ ఆత్మ సర్వవ్యాపి కనుక కల్పితము లగు దేహాదులందు ఘటములలోని జలమువలె, ఆధేయము (ఉంచబడునది) కాదు. ఆత్మ అనంత

ము, నిరంజనము కనుక నేనెట్టి సంసర్గము, ఇచ్ఛాదిధర్మములును లేక కేవలశాంతుఁడనై యున్నాఁడను. ॥౪॥

ఆవ॥--- ఆత్మకిచ్ఛాదులు లేమికిఁ గారణాంతరము.---

శ్లో॥ అహాహా! చిన్మాత్ర మేవాహ మింద్రజాలోపమంజగత్,
అతో మమ కథం కుత్ర హేయోపాదేయకల్పనా ॥౫॥

తా॥ ఆహా! నేను చైతన్యమాత్రుఁడను. ప్రపంచజాత మంతయు నింద్రజాలము వలె కనుపించుచున్నను ఆత్మసత్తకంటె వేఱుసత్త కలది కాదు. పృథక్సత్తారహితములై మిథ్యాభూతము లగు అట్టి వస్తువులలో దేని నెట్లు కోరుదును. దేనిని గ్రహింతును. దేనిని విడుతును. ఏద్దియును లేదు. ఇంద్రజాలము సేయువాఁ డనేక వింతవస్తువులఁ గల్పించియు నవి యెల్ల మిథ్య కావున వానియందెట్టి హేయోపాదేయబుద్ధియుఁ గలుగకుండునట్లు ఆత్మయందు మిథ్యాకల్పితము లగు ప్రాపంచికసంబంధవస్తువులందు జ్ఞానికి హేయోపాదేయములు లేవని భావము. ॥౫॥

---

**అనుభవపంచకము**

**౭వ ప్రకరణము**

**సమాప్తము.**



# బంధమోక్షవ్యవస్థాచతుష్కము.

## ౮ వ ప్రకరణము

### గురుప్రోక్తము.

—:0:—

అవ॥— ఇట్లు శిష్యుని లెస్సగఁ బరీక్షించిన గురువు బంధమోక్షవ్యవస్థానిరూపణమిషచేత శిష్యునికిఁ గల యాత్మానుభవము నభినందించుచున్నాఁడు.---

**శ్లో॥ తదా బంధో యదా చిత్తం కించి ద్వాంఛతి శోచతి,**
**కించి న్ముంచతి గృహ్ణాతి కించి ద్ధృష్యతి కుప్యతి ॥ ౧ ॥**

తా ॥ వత్సా! "అతో మమ కథం కుత్ర హేయోపాదేయకల్పనా" (మిథ్యాభూతములగు వస్తువులలో నెట్లు దేనినిఁ గోరుదును, దేని గ్రహింతును, దేనిని విడుతును) అని నీవు చెప్పినదంతయు నిజమె. ఏమన, విషయముల జూచినపుడు వానియెడల వాంఛాదివికారములు నీచిత్తమునఁ గలిగెనేని యదియె (జీవబుద్ధితోఁ గూడిన) బంధము, ముక్తికిఁ బ్రతిబంధకము నగును. ॥ ౧ ॥

---

**శ్లో॥ తదా ముక్తి ర్యదా చిత్తం న వాంఛతి న శోచతి,**
**న ముంచతి న గృహ్ణాతి న హృష్యతి న కుప్యతి ॥ ౨ ॥**

తా ॥ పై శ్లోకములో జెప్పిన (కోరుట, గ్రహించుట, విడుచు

ట, సంతోషించుట, కోపించుట మొదలగు చిత్తవికారములు కలుగకుం డుటయె ముక్తి. ॥ ౨ ॥

---

అవ॥— ఇటుల బంధమోక్షముల వేర్వేరఁ జెప్పి, యాబంధమో క్షముల రెండింటినిఁ గూర్చి మఱలఁ జెప్పుచున్నాఁడు.—

శ్లో॥ తదా బంధో యదా చిత్తం సక్తం కాస్వపి దృష్టిషు,
తదా మోక్షో యదా చిత్త మసక్తం సర్వదృష్టిషు ॥

తా ॥ దృశ్యమును జడమును నగు దేహాదిప్రపంచము "అనాత్మ" యను దృష్టిఁ గలిగియుండుట సయితము బంధమే యగును. కాబట్టి విష యములందే కాక, ఆత్మానాత్మవివేకమందు సయితము లక్ష్యము లేక ని స్స్పృహత నుండుటయె మోక్షము. (చిత్తము సంకల్పవికల్పశూన్యముగ నుండుటయే మోక్షమని యభిప్రాయము.) ॥ 3 ॥

---

అవ॥— దగ్ధపటముకరణి నుండియు బాధితానువృత్తిచేత విషయ దృష్టిఁ గలిగియుండుటయు, బంధహేతు వేయనియు నట్టి దృష్టి లేకుండుట యే మోక్షమనియుఁ జెప్పఁ బడినది. అయినప్పటికి, అహంకారము (అ హంభావము) లేకుండుటయె మోక్షమనియు, అహంకారస్థితియే బంధమ నియుం జెప్పి శిష్యుఁడు చెప్పిన యర్థము నభినందించుచు గురు విట్లనువ దించుచున్నాఁడు—

శ్లో ॥ యదా నాహంతదా మోక్షో యదాహం బంధనంతదా,
మ త్వేతి హేలయా కించి న్మాగృహాణ విముంచమా ॥ ర ॥

తా ॥ సర్వానర్థములకు మూలమయిన "అహం" (నేను) అను అ

హంభావాధ్యాస మెప్పుడు తొలఁగునో యప్పుడు మోక్షసిద్ధియగును. ఎంతవఱకు "నేను" అను అహంభావము నిలిచియుండునో యంతవఱక బంధము తొలఁగదు. శిష్యా! ఇట్లు తెలిసికొనియె. నీవు త్యాగగ్రహణాది క్రియలందుఁ గర్తృత్వము లేనివాఁడవై, లీలామాత్రుఁడవై యున్నాఁడవు. అకర్త్రాత్మజ్ఞానమువలన కర్తృత్వాభిమానము లేనివాఁడవై యున్నాఁడవని భావము. (నేను ఆత్మను, అనాత్మను, జ్ఞానిని, అజ్ఞానిని, ఇదినేయు చున్నాను, లేదు, నిశ్చలుఁడను ఇత్యాద్యభిమానశూన్యుఁడవై, సర్వదా సచ్చిదానందపరమాత్మవై ఇంద్రియవ్యాపారములు తమంత జరుగుచున్నను నిష్క్రియుఁడవై, యున్నాఁడవని భావము. ఇదియె ముక్తిస్వరూపము.) ॥౪॥

---

బంధమోక్షవ్యవస్థాచతుష్కము
౮-వ ప్రకరణము.
సమాప్తము.

౯-వ ప్రకరణము
శేది....
# నిర్వేదాష్టకము.
గురుప్రోక్తము.

---

అవ॥— ఇదివఱకు శిష్యుఁడు చెప్పిన యనుభవసిద్ధాంతమును దృఢపరచుటకై యిచ్ఛాత్యాగరూపమగు నిర్వేదమును శ్లోకాష్టకముచే గురువు బోధించుచున్నాఁడు. "మత్వేతి హేలయా కించి న్మాగృహాణ" అనిచె

[illegible]ను. ఈయంశము ననువాదించుచు దానికిఁ గారణమగు వైరాగ్యమును బ్రతిపాదించుచున్నాఁడు:—

శ్లో॥ కృతాకృతేచ ద్వంద్వాని కదా శాంతాని కస్యవా,
ఏవం జ్ఞాత్వేహ నిర్వేదా ద్భవత్యాగపరోఽవ్రతీ ॥౧॥

తా॥ ఇది కర్తవ్యము, ఇది కర్తవ్యము కాదు, అనెడి పట్టుదలయు, సుఖదుఃఖాదిద్వంద్వములయందభిమానమును, నెప్పటికి నెవ్వానికిని నివృత్తి కాదు. ఇట్లు తెలిసికొని కృతాకృతాదులందును సుఖాదిద్వంద్వములందును నిర్వేదుఁడవై (అనఁగా వానియందు మనసు తగులనివాఁడవై) యుండుము. (నిర్వేదము= తత్త్వజ్ఞానదుఃఖేర్ష్యాదులచేతం గలుగు హేయత్వబుద్ధి.) ॥౧॥

---

అవ॥— చిత్తధర్మత్యాగరూపమగు వైరాగ్యము (నిర్వేదము) అరుదుగా నొకానొక మహాత్మునకే కాని, ఎల్లరకును గలుగదని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ కస్యాపి తాత ధన్యస్య లోకచేష్టావలోకనాత్,
జీవితేచ్ఛా బుభుక్షా చ బుభుత్సోపశమంగతాః ॥౨॥

తా॥ వత్సా శిష్యా! ఉత్పత్తివినాశరూపమగు లోకవ్యవహారావలోకనము వలన జీవితేచ్ఛయు, బుభుక్షయు (భోగేచ్ఛయు), బుభుత్సయు (తెలియనిచ్ఛయు) నొకానొకమహాశయునకే తొలఁగును. ఈవచనమును బట్టి మహాత్ముఁడగు శిష్యునిం గూర్చి గురువుగారి యనువాదమే కాని యుపదేశము కాదని యీ ప్రకరణారంభముననే సూచింపఁబడెను. ॥౨॥

---

అవ॥— జ్ఞానులకు దేనియందును గోరిక కలుగకుండుటకుఁ గారణము:—

శ్లో॥ అనిత్యం సర్వమేవేదం తాపత్రితయదూషితమ్,
అసారం నిందితం హేయ మితి నిశ్చిత్య శామ్యతి ॥3॥

తా॥ దృశ్యమానప్రపంచజాతమంతయు ననిత్యము, చిదాత్మయందారోపితము, ఆత్మకంటె వేఱుసత్తలేనిది, ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికతాపత్రియములచే దూషితమయినది, కావున సారము లేనిది. అనఁగా తుచ్ఛము నసత్తును హేయము నైనది. ఆత్మసత్తకంటె వేఱగు స్వసత్తలేనిది కనుక ననాదరణీయమయినది. జ్ఞాని యిట్టి దృఢనిశ్చయము కలిగి దేనియందు నెట్టి యిచ్ఛయు లేకుండును. (దేహేంద్రియసంబంధమగు వ్యాధులవలనఁ గలుగు బాధల ననుభవించుట ఆధ్యాత్మికతాపము. నరపశుపక్షిమృగాదుల వలనఁ బీడింపఁబడుట ఆధిభౌతికతాపము. దైవికముగ సంభవించు అతివృష్టి, అనావృష్టి, ప్రళయాగ్నివాయువులు మొదలగు వానివలనఁ గలుగు బాధ లనుభవించుట ఆధిదైవికతాపము). ॥3॥

---

అవ॥— సుఖదుఃఖాదిద్వంద్వములు ప్రారబ్ధకర్మవశమున సంభవించునవి కావున వాని నవశ్య మనుభవింపవలెను. కనుక వానియందుఁ గోరికగాని, ద్వేషము గాని లేకుండ సమబుద్ధితోఁ బ్రాప్తమగువాని ననుభవించుజ్ఞాని ముక్తినొందునని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ కోఽసౌకాలోవయఃకింవాయత్రద్వంద్వాని నోనృణాం,
తాన్యుపేక్ష్య యథాప్రాప్తవర్తీ సిద్ధిమవాప్నుయాత్ ॥

తా॥ నరులకు, భూతభవిష్యద్వర్తమానకాలములందును, బాల్య

యౌవనాదివయోలక్షణశరీరావస్థలందును, సుఖదుఃఖాదిద్వంద్వములు లేని కాలమే లేదు. అని నిశ్చయించుకొని, ఆసుఖదుఃఖాదులయందు లక్ష్య ముంచక వాని ననుభవించి తద్ద్వారా ప్రారబ్ధక్షయ మొనరింపవాఁడు ముక్తినొందును. ॥ ౪ ॥

---

అవ॥— ప్రతివాదిజిగీషాదిదోషమాషితములగు తర్కాదిశాస్త్రజ్ఞాననిష్ఠయందును, నానావిధప్రత్యవాయములతోఁ గూడిన యాగాదికర్మములందును, ప్రాణనిరోధనహేతువు లగు అష్టాంగయోగములందును, ముముక్షువున కాసక్తి తగదని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ నానామతం మహర్షీణాం సాధూనాం యోగినాంతథా,
దృష్ట్వా నిర్వేద మాపన్నః కోన శామ్యతి మానవః॥౫॥

తా॥ గౌతమజైమిన్యాదిమహర్షుల మతములు అణుపరిమాణవాద యాగనిరతాదులచేఁ బలుతెఱఁగులు. హోమజపకృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సులచే సాధువుల మతములు పలువిధములు. యోగుల మతములు భిన్నములు. ఇట్లాయామతములు నానావిధములుగ నుండుటయు, నొకదాని కొకటి సంబంధము లేమింజేసియు, సత్యాన్వేషణమునకు సరియైన మార్గము ను జూపమింజేసియు, నీమతముల యెడలను, కర్మములయెడలను నిర్వేదమును (నిరాశను) జెంది, సద్గురూపదిష్టమార్గమున ఆత్మానుసంధాననిష్ఠాపరుఁ డగువాఁ డెట్లుపశమింపకుండును? అనఁగా, ఆత్మానుభవము గలవాని కితరమార్గములు రుచింపవు.

[ఇది సాధనచతుష్టసంపన్నుఁడగు ఆరూఢుని విషయమై చెప్పఁబడినది. ఆరూఢావస్థ కలుగని సామాన్యజిజ్ఞాసువునకు, ఆరూఢావస్థ కలుగు

వలకు గురుశిక్షతోఁ గూడిన యుత్తరమార్గములలో నేదేని యాచరణీయమే యగునని యభిప్రాయము. ॥౫॥

---

అవ॥--- కర్మాదుల నుపేక్షించి కేవలము జ్ఞాననిష్ఠయే కలిగియుండుమని బోధించుచున్నాఁడు.---

శ్లో॥ కృత్వా మూర్తి పరిజ్ఞానం చైతన్యస్య న కిం గురుః,
నిర్వేదసమతాయుక్త్యా యస్తారయతి సంసృతేః ॥౬॥

తా॥ నిర్వేద మనఁగ విషయములందాసక్తి లేకపోవుట; సమత యనఁగా శత్రుత్వమిత్రత్వభావము లేక సమబుద్ధిఁ గలిగి సర్వత్ర ఆత్మబుద్ధిఁ గలిగియుండుట; యుక్తి యనఁగా శ్రుతికి విరుద్ధము కాని తర్కము. ఈమూడింటిచేతను సచ్చిదానందమూర్తి పరిజ్ఞానము, (అనఁగా ఆత్మసాక్షాత్కారము) నొంది పిమ్మట గురుసహాయమపేక్షింపని జ్ఞాని 'న కిం గురుః' అనఁ బడును. అట్టి మహనీయుఁడు ఆత్మజ్ఞుఁడై సంసారసాగరముం దరించును. (ముక్తి నొందును)

వి--- మూర్తిపరిజ్ఞానమనఁగా స్వస్వరూపజ్ఞానము (ఆత్మానుభవము) గలిగిన జ్ఞానికి గురుసహాయము గాని కర్మాచరణము గాని యవసరము లేదు. నదిని దాటువరకు నే తెప్పయు, నావికుఁడును అవసరము గాని, దాటిన పిమ్మట తెప్పతోఁగాని, నావికునితోఁ గాని యవసరముండదు కదా! అదిరీతి విధమున, ఆత్మజ్ఞానమున్ను, తదనుభవమున్ను గలుగువరకు మాత్రమే గురుసహాయమున్ను, కర్మాచరణమున్ను అవసరమని యభిప్రాయము.

---

అవ॥--- చైతన్యస్వరూపజ్ఞానోపాయముం జెప్పుచున్నాఁడు---

శ్లో॥ సర్వభూతవికారాం స్త్వంభూతమాత్రాన్ యథార్థతః,
తత్క్షణా ద్బంధనిర్ముక్తః స్వరూపస్థో భవిష్యసి ॥౭॥

తా॥ ఓశిష్యా! పంచభూతవికారములగు దేహేంద్రియాదులను యథార్థముగ (తత్త్వవిచారణవలన) జడము లగు పృథివ్యాదిపంచభూతమాత్రములే కాని ఆత్మస్వరూపములు కావని తెలియుము. అట్లు తెలిసికొనుచేని యాక్షణమందె నీవు బంధనిర్ముక్తుఁడ వగుదువు. అనఁగా శరీరాహంభావనిర్ముక్తుఁడవై శరీరాదులకంటె భిన్నమగు ఆత్మస్వరూపుఁడవగుదువు. శరీరాదుల ననాత్మగాఁ దెలిసినంతట, ఆ శరీరాదులకు సాక్షీమాత్రుఁడవగు ఆత్మవే నీవుగ నుందువని భావము. ॥ ౭ ॥

---

అవ॥--- అప్రకార మాత్మజ్ఞానము కలిగినను ఆత్మనిష్ఠకలుగుటెట్లు? అను శంకరాఁగా నాయాత్మనిష్ఠవాసనలు క్షయింపఁగాఁ దప్పకఁ గలుగునని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ వాసనా ఏవ సంసార ఇతిసర్వా విముంచ తాః,
తత్త్యాగో వాసనాత్యాగా త్స్థితిరద్య యథా తథా॥౮॥

తా॥ విషయవాసనలే సంసారము. కనుక విషయవాసనల విడువుము. అటుల వాసనాత్యాగము వలన ఆత్మనిష్ఠ స్థిరమగును. దానివలన సంసారము (దేహేంద్రియాదివిషయవ్యాపారమందభిరుచి) తొలంగును. అంతట శరీరస్థితి ప్రారబ్ధ మెట్లుండునో యట్లగును. ఇచట "కర్తృత్వ

త్యదశైవదానకుశలో దుర్వాసనాసంచయః" అను శంకరాచార్యవచనము ప్రమాణము.

---

## గురుప్రోక్త నిర్వేదాష్టకము

### ౯-వ ప్రకరణము

### సమాప్తము



# ఉపశమాష్టకము.

### ౧౦ వ ప్రకరణము

### గురుప్రోక్తము.



అవ॥--- విషయసంబంధము లేని సంతోషరూపమగు నిర్వేదము చెప్పఁబడినది. ఇఁకను విషయతృష్ణోపశమము నభినందించుచు గురువు సోదాహరణముగాఁ జెప్పుచున్నాఁడు,—

శ్లో॥ విహాయ వైరిణం కామ మర్థం చానర్థసంకులం,
ధర్మ మప్యేతయో ర్హేతుం సర్వత్రానాదరం కురు॥

తా॥ శిష్యా! జ్ఞానోత్పత్తికి నవరోధమును గలిగించు కామమును (విషయాసక్తిని) విడువుము. ఆర్జించుటయందును, సంరక్షించుటయందును

ననే కామార్థముల గలిగించు ధనసంపదపేక్షను విడువుము. ఈకామార్థముల కైనధర్మమును నైతము పేక్షింపుము. ॥౧॥

---

అవ॥— మిత్రక్షేత్రాదుల నార్జించు కర్మములం దుపేక్ష యెట్లుకలుగు నను శంకకు అమిత్రక్షేత్రాదు లనిత్యమని తెలిసికొనుటయే ఉపేక్షకుం గారణమని చెప్పుచున్నాఁడు.—

**శ్లో॥ స్వప్నేంద్రజాలవత్పశ్య దినాని త్రీణి పంచవా,**
**మిత్రక్షేత్రధనాగారదారదాయాదిసంపదః ॥౨॥**

తా॥ శిష్యా! మిత్రధనదారదాయాది సంపద లెల్లను స్వప్నమువలెను, ఇంద్రజాలమువలెను స్వల్పకాలముమాత్ర ముండునవి గాని స్థిరములు కావని తెలియుము. ॥ ౨ ॥

---

అవ॥— "సర్వత్రానాదరం కురు" అని చెప్పఁబడినది. తృష్ణలేకుండఁ బ్రౌఢవైరాగ్యము ననె ముక్తి నొందుమని చెప్పుచున్నాఁడు:—

**శ్లో॥ యత్ర యత్ర భవే త్తృష్ణా సంసారం విద్ధితత్రవై,**
**ప్రౌఢవైరాగ్య మాశ్రిత్య వీతతృష్ణ స్సుఖీభవ ॥3॥**

తా॥ ఎపుడు విషయాసక్తి కలుగునో యప్పు డెల్ల సంసారబంధము కలుగుచున్నది. ఏమన విషయాసక్తి కలుగఁగనే కర్మము, ఆకర్మద్వారా సంసారమును గలుగును. కావున ప్రౌఢవైరాగ్యము చేత, అనఁగా, ప్రాప్తభోగములందుఁ బ్రీతియు, నప్రాప్తభోగములందుఁ గోరికయు లేకుండ, ఆత్మనిష్ఠ గలిగి (బ్రహ్మానంద) సుఖము ననుభవించుము. ॥ 3 ॥

---

అవ॥— ఈయర్థమునె మఱియొకరీతిం జెప్పుచున్నాఁడు.—

శ్లో॥ తృష్ణా మాత్రాత్మకో బంధ స్తన్నాశో మోక్ష ఉచ్యతే,
భవాసంసక్తిమాత్రేణ ప్రాప్తితుష్టి ర్ముహుర్ముహుః ॥

తా ॥ కర్మవాసన బంధహేతువగును. కావున విషతుల్యములగు విషయములం దాసక్తియే బంధము. విషయవాసన నశించినంతనె నివృత్తిహేతుకమగు మోక్షము సిద్ధించును. ఇచట "యతో యతో నివర్తతే తతస్తతో విముచ్యతే। నివర్తనాద్ధి సర్వతో న వేత్తి దుఃఖ మణ్వపి" అను వృద్ధవచనము ప్రమాణము.

దేహాదివిషయములతో సంగము (సంబంధము) లేనిమాత్రమున, ప్రతిక్షణము ఆత్మప్రాప్తికలనఁ సంతోషము కలుగును. కనుక తృష్ణానాశనమే (విషయాసక్తి లేకపోవుటయే) మోక్షము, అని యర్థము. ॥ ౮ ॥

---

అవ॥— అయితే బుభుత్సారూపమగు తృష్ణ(బోధగాననిచ్ఛ) విడుచు టెట్లు, అను శంకకు సమాధానము.—

శ్లో॥ త్వమేక శ్చేతన శ్శుద్ధో జడం విశ్వమసత్తథా,
అవిద్యాపి న కించిత్సా కా బుభుత్సా తథాపి తే ॥ ౯ ॥

తా ॥ లోకమందు పదార్థములు మూఁడు. ఆత్మ, జగత్తు, అవిద్య, అను నవి. వీనిలో ఏకము, చైతన్యమాత్రము, నిర్మలము, పూర్ణము నైన చిదభిన్నమైన ఆత్మవు నీవు. దీనినే నీవు తెలిసికొనవలసినది. అనఁగా నీవె సర్వపరిపూర్ణాత్మవు. దీనికంటె వేఱుగ ఆత్మ యున్నదని కాని, జగత్తు వేఱని కాని తలఁపఁదగదు. కావున ఆత్మబుభుత్సయుం దగదు. జగత్తు అసత్తు జడము. కావున జగద్బుభుత్సయు తగదు. అవిద్య యనునది సదసద్విలక్ష

ణామయినది. అనఁగా సత్తును అసత్తును గాక అనిర్వచనీయమయినది. కావున అవిద్యాబుభుత్సయుఁడగదు. కనుక నీకిఁకఁ దెలియఁదగిన దెద్ది? ఎద్దియును లేదు. (సర్వపరిపూర్ణ జ్ఞాన కనిర్మలచిదాత్మవే నీవైయుండ బుభుత్సయు లేదని భావము.) ఇచట, "యస్మిన్నస్మిన్నస్తి లోకే బోధస్తత్తదుపేక్షణే। యద్బోధమాత్రం తద్బ్రహ్మేత్యేవం ధీర్బ్రహ్మనిశ్చయః॥" అనెడి శ్రీవిద్యారణ్యముని వచనము ప్రమాణము. బోధాత్మ ఏకమును పూర్ణమునని తెలియుము. భూతవర్తమానాదికాలములును, వానియందుఁ గలిగెడు విషయములును మాఱుచున్నను అది, అది, అది అనెడి బోధమాత్రమె నిలుచును. ॥ ౫ ॥

---

అవ॥— జగత్తు జడమనియు, అసత్తనియుఁ జెప్పిన విషయమును స్పష్టపరచుచున్నాఁడు.—

**శ్లో॥ రాజ్యం సుతాః కళత్రాణి శరీరాణి సుఖానిచ,**

**సంసక్తస్యాపి నష్టాని తవ జన్మని జన్మని ॥ ౬ ॥**

తా॥ ప్రతిజన్మమందును అత్యంతాసక్తితో నార్జించిన రాజ్యాదిసంపదలు, పుత్రకళత్రదాయాది బంధువులు, ఆరాజ్యాదిసంపదలతోఁ గూడినసుఖమును నెంత ఆసక్తితోఁ జూచినప్పటికి నవి యెల్ల నాయా జన్మములతో నంతమొందుచున్నవే కాని, యొక జన్మమునుండిమఱియొక జన్మములోనికి సంప్రాప్తముకావు కనుక, ఈరాజ్యాదిసంపదలతోఁ గూడిన ప్రపంచవటన మెల్ల నసత్తు, ననిత్యము, స్వప్నమువలె మిథ్యయు నగును. ఆత్మమాత్రము నిత్యము. (ఇచట, "కతికాయాగతాః ప్రాక్తే పితరః కతి మాతరః। కతిదారా స్సుతా మూఢ కేతేతే కస్యవా భవాన్॥" అనెడి వృద్ధవచనము ప్రమాణము. వత్సా! నీకు మాతాపితృపుత్రకళత్రాదుల

తోఁగూడ ననేకశరీరములు గతించినవి. కాని వానిలో నీకు సంబంధ మించుకయు లేదు. అని యుపచసార్థము) ॥ ౬ ॥

---

అవ॥— బుభుత్స (తెలిసికొననిచ్ఛ) సయితముఁ గూడదని చెప్పఁ బడెను. ఇఁక ధర్మార్థకామములందును వాంఛ కూడదని చెప్పుచు న్నాఁడు:---

**శ్లో॥ అల మర్థేన కామేన సుకృతేనాపి కర్మణా,**
**ఏభ్య స్సంసారకాంతారే న విశ్రాంత మభూన్మనః ॥**

తా॥ ధర్మార్థకామములందిచ్ఛ యుండఁగూడదు. ఏమనఁగా, నీధర్మార్థకామములతోఁ బూరితమై దుర్గమమయిన సంసార మను కాంతారమునుండి తప్పించుకొని విశ్రాంతి నొందుట కడుదుర్లభము. కావున నీధర్మార్థకామములందు సయిత మాసక్తి తగదు. ॥౭॥

---

అవ॥— ఇటుల తృష్ణాశాంతిని నిరూపించి, యిపుడు కర్మమందలి వాసనయుఁ దగదని చెప్పుచున్నాఁడు:---

**శ్లో॥ కృతం న కతి జన్మాని కాయేన మనసా గిరా,**
**దుఃఖ మాయాసదం కర్మ తదద్యాప్యుపరమ్యతాం॥౮॥**

తా॥ వత్సా! నీవు వెనుకటిజన్మములందు కాయక్లేశము నొంది ప్రయాసమును దుఃఖమును గలిగించు కర్మము లెన్ని జేసియుంటివి? ఆ పూర్వజన్మకర్మముల వలన నీకంతకంత కనర్థము తప్ప వేమియుండినది?

కాబట్టి యిష్టమయినను గర్మములం దాసక్తి వదలి జ్ఞాననిష్ఠుండవై ఆత్మసుఖమును బొందుము. ||౮||

---

## గురుప్రోక్తము ఉపశమాష్టకము
## ౧౦-వ ప్రకరణము
## సమాప్తము.

---

## ౧౧-వ ప్రకరణము
# జ్ఞానాష్టకము.
### గురుప్రోక్తము.



అవ||--- విజ్ఞానమునఁ దప్ప మఱి యెద్దానివలనను శాంతి కలుగదని బోధించుటకై గురు విపుడు జ్ఞానాష్టకమును జెప్పుచు ముందుగ జ్ఞానసాధనమును జెప్పుచున్నాఁడు.---

**శ్లో|| భావాభావవికారశ్చ స్వభావా దితి నిశ్చయీ,**
**నిర్వికారో గతక్లేశ స్సుఖేనైవోపశామ్యతి ||౧||**

తా|| భావాభావరూపవికారములు మాయనుండియు దాని సంస్కారముల నుండియుఁ గలుగుచున్నవి కాని వికారరహితమగు నిర్మలాత్మనుండి కలుగవు. ఇట్టి దృఢనిశ్చయము గల పురుషుఁడు తన నిశ్చయబలముచేతనే అనాయాసముగ శాంతి నొందును. ||౧||

అవ॥— అయితే, మాయ జడమయినది కదా. అట్టి జడమునుండి భావాభావవికారములు కలుగు టెట్లు? అను శంక కుత్తరము —

శ్లో॥ ఈశ్వర స్సర్వనిర్మాతా నేహాన్య ఇతి నిశ్చయీ,
అంతర్గళితసర్వాశ శ్శాంతః క్వాపి న సజ్జతే ॥౨॥

తా॥ జీవుఁ డీశ్వరపరవశుఁడు, కావున భావాభావాదిసర్వవికార సృష్టికిని ఈశ్వరుఁడే కర్త అను దృఢనిశ్చయము గలపురుషుఁడు, తన నిశ్చయబలవశముననే సర్వతృష్ణారహితుఁడగును. కనుక నట్టివాఁడు నిశ్చలచిత్తుఁడై శాంతినొంది ఆత్మసుఖ మొందును. ॥౨॥

---

అవ॥--- అయితే, ఈశ్వరుఁడే సర్వనిర్మాత (సర్వసృష్టికిఁ గర్త) యగునేని, కొందఱు దరిద్రులు, కొందఱు ధనికులు, కొందఱు సౌఖ్యవంతులు, కొందఱు దుఃఖితులు, ఇత్యాదివైషమ్యస్థితి యుండుటకుం గారణమేమి? అను శంకకు సమాధానముఁ జెప్పుచున్నాఁడు.---

శ్లో॥ ఆపద స్సంపదః కాలే దైవాదేవేతి నిశ్చయీ,
తృప్తః స్వస్థేంద్రియో నిత్యం న వాంఛతి న శోచతి ॥

తా॥ పురాకృతసుకృతదుష్కృతములకు ఫలకాలము వచ్చినపుడు, ఈశ్వరప్రేరితములై సుఖదుఃఖములు సంపదాపదలును గలుగుచుండును. అనెడి దృఢనిశ్చయముఁ గలిగి తృష్ణారహితుఁడై, నిత్యసంతుష్టుఁడై, యెట్టి కోరికలును లేక, ఇంద్రియములను విషయములందుఁ జొరనీయక వర్తించు జ్ఞాని దొరకని దానినిఁ గోరఁడు, నష్టమయినదానికి దుఃఖింపఁడు. ॥3॥

---

అవ॥— అట్టి దృఢనిశ్చయము గలవారలు సయితము గర్మములఁ జేయుచున్నవారలేయై కనుపించుచున్నారే?' అను ప్రశ్నకుత్తరము.—

శ్లో॥ **సుఖదుఃఖే జన్మమృత్యూ దైవాదేవేతి నిశ్చయీ,**
**సాధ్యాదర్శీ నిరాయాసః కుర్వన్నపి నలిప్యతే ॥౪॥**

తా॥ కర్మఫలభూతములగు సుఖదుఃఖాదులు జన్మాంతరకర్మ ననుసరించియే ప్రాప్తించుననెడి దృఢనిశ్చయము గలవాఁడు, "నే నీఫలము ననుభవించుచున్నాను." అనెడి సంకల్పమే లేక, నిరాయాసముగఁ బ్రారబ్ధవశమగు కర్మలఁ గర్తృత్వాభిమానరహితుఁడై చేయుచుఁ గర్మజన్యములగు అనర్థములం బాటింపక వానికి సాక్షిమాత్రుఁడై ఆత్మసుఖ మొందును. ॥౪॥

---

అవ॥— అట్లు కర్మములఁ జేయునపు డాయాసమొందకుండు టెట్లు? అను ప్రశ్న కుత్తరము.—

శ్లో॥ **చింతయా జాయతే దుఃఖం నాన్యథేహేతి నిశ్చయీ,**
**తయా హీనస్సుఖీ శాంత స్సర్వత్ర గళితస్పృహః॥౫॥**

తా॥ ఇహదుఃఖము (సంసారదుఃఖము) చింతచేతనే కలుగుచున్నది, కాని యితరమువలనఁ గలుగదు అనెడి దృఢనిశ్చయముఁ గలిగి చింతాపరుఁడు కాకుండ శాంతుఁడై (స్థిరాంతఃకరణము గలిగి) సర్వత్ర * సుఖసాధనపరుఁడై నిస్స్పృహుఁడగు పురుషుఁడు ఆత్మసుఖమొందును. ప్రారబ్ధవశమున సంప్రాప్తమగు దుఃఖములను జింతింపకుండుట

---

* విషయములను గోరకుండుటయే పరమసుఖసాధనము. అని సతలమహర్షి మతము.

దొక మహౌషధము. అని చెప్పెదను ఈక్రిందిశ్లోకము దీనికిం బ్రమాణము.

"అకాండపాతజాతానా మార్ద్రాణాం మర్మభేదినాం,
గాఢశోకప్రహారాణా మచింతైవ మహౌషధిః"          ॥౫॥

అవ ॥ పైని జెప్పఁబడిన సాధనములచే జ్ఞానసిద్ధి నొందిన వారల నిజదశను నిరూపించుచున్నాఁడు.---

శ్లో ॥ నాహం దేహో నమే దేహో బోధోఽహమితినిశ్చయీ,
కైవల్య మివ సంప్రాప్తో న స్మరత్యకృతం కృతమ్॥౬॥

తా ॥ దేహము నేను కాను. నాకు దేహము లేదు. నేను నిత్యబోధస్వరూపుఁడను అనెడి నిశ్చయజ్ఞానము వలన దేహమందు అహంభావమును, (గేహాదులయందు) మమకారమును లేనివాఁడై, దేహేంద్రియాదులు సేయు కృతాకృతములందు "నేను చేసితి" నను స్మరణము లేకయే జ్ఞాని వర్తించును. విదేహకైవల్యము నొందినవాఁడు తన కృతాకృతముల స్మరింపకుండునట్లు జీవన్ముక్తుఁడును వర్తించునని భావము.          ॥౬॥

శ్లో ॥ ఆబ్రహ్మస్తంబపర్యంత మహ మేవేతి నిశ్చయీ,
నిర్వికల్పః శ్శుచి శ్శాంతః ప్రాప్తాప్రాప్తవినిర్వృతః ॥౭॥

తా ॥ బ్రహ్మ మొదలు తృణపర్యంతమునగు చరాచరప్రపంచమంతయు నేనే యను నిశ్చయానుభవము గల పురుషుఁడు, సంకల్పవికల్పములు లేక శుచియై (విషయసంగరూపమలము లేనివాఁడై) నిశ్చలాంతఃకరణుడై, ప్రాప్తాప్రాప్తవిషయము లందెట్టి వృత్తియును లేక, ఆత్మానందపరిపూర్ణుఁడై యుండుటచేత పరమసంతోషియై వర్తించును.          ॥౭॥

అవ॥— అయితే ఆత్మజ్ఞానికి నిర్వికల్పాదిరూపమెట్లనినఁ జెప్పు చున్నాఁడు.—

శ్లో॥ నానాశ్చర్య మిదం విశ్వం న కించిదితి నిశ్చయీ,
నిర్వాసన స్స్ఫూర్తిమాత్రో న కించిదివ శామ్యతి ॥౮॥

తా॥ సకలజగదధిష్ఠానపరమాత్మసాక్షాత్కారము గలుగుట చేత, నానాశ్చర్యరూపమగు నీజగత్తంతయు, ఆత్మసత్తకంటె వేఱుసత్త లేనిదియ ను నిశ్చయము గల పురుషుఁడు, వాసనాశూన్యుఁడు, కేవలచిన్మాత్రుఁడు నై విశేషవ్యవహారము లెవ్వియుం దనకుఁ గోచరింపనివాఁడై, కార్యాకార నోపాధినిర్ముక్తుఁడై తత్త్వజ్ఞానము చేత సర్వమును స్వప్నమువలె మిథ్య యని తలఁచి దానివలన నివృత్తుఁడై యుండును. ॥౮॥

గురుప్రోక్తజ్ఞానాష్టకము
౧౧-వ ప్రకరణము
సమాప్తము.

౧౨-వ ప్రకరణము
# ఏవమేవాష్టకము.
శిష్యప్రోక్తము

అవ॥— జ్ఞానాష్టకములో "నకించి దివ శామ్యతి" (ఆత్మసత్తకంటె వన్యసత్త దృశ్యవస్తువున కేమియు లేదని గురువుచే) చెప్పఁబడినది. ఆ

ట్టి యనుభవము తనకుఁ గలిగినదని విశదీకరించుటకై "ఏవ మేవాష్టకము" శిష్యులకు నివేదించుచున్నాఁడు. అందు మొదట కాయవాక్చిత్తములయొక్క నిర్వ్యాపారత్వమును జెప్పుచున్నాఁడు—

శ్లో॥ కాయకృత్యాసహాః పూర్వం తతో వాగ్విస్తరాసహాః,
అథ చింతాసహాస్తస్మా దేవమేవాహ మాస్థితః ॥౧॥

తా॥ నేను పూర్వము శరీరాయాసముతోఁ గూడిన కర్మములఁ జేయలేనంటిని. తరువాత వాచికరూపజపకర్మముం జేయలేనైతిని. పిమ్మట మనోవ్యాపారములగు చింతల విడిచితిని. కాఁబట్టి యిప్పుడిట్లు నిర్వ్యాపారుఁడనై, స్వస్వరూపనిరతుఁడనై యుంటిని. ॥౧॥

---

అవ॥— ఈ చెప్పిన వ్యాపారత్రయము లేకపోవుటకు హేతువుం జెప్పుచున్నాఁడు.—

శ్లో॥ ప్రీత్యభావేన శబ్దాదే రదృశ్యత్వేన చాత్మనః,
విక్షేపైకాగ్రహృదయ ఏవమేవాహ మాస్థితః ॥౨॥

తా॥ నాకిప్పుడు కాయికవాచికసంబంధమగు కర్మముల యందింటను బ్రీతి లేక, ఆత్మయు నింద్రియములకు గోచరము కామిచే, (ఆత్మ వేఱు నేను వేఱు ననెడి భావము లేమిచే), ఆసనాదికాయికవిక్షేపము, జపాది వాచికవిక్షేపము, ధ్యానాదిమానసికవిక్షేపము, నను నీ త్రివిధవిక్షేపము (చలనము) లేకుండ సర్వదా స్వస్వరూపనిరతుఁడనై యున్నాఁడను. (నశ్వరములును, ఆత్మకంటె విలక్షణములు నగు మనోవాక్కాయములు మూఁడు నుంగాక వీనికి సాక్షియగు కేవలసచ్చిదానందపరమాత్మనై యున్నాఁడ నని భావము.) ॥౨॥

---

అవ॥— అయినను సమాధికొఱకు యత్నింప నవసర ముండదా? యను శంకకుత్తరము.—

శ్లో॥ సమాధ్యాసాదివిక్షిప్తౌ వ్యవహారస్సమాధయే,
ఏవం విలోక్య నియమ మేవమేవాహ మాస్థితః ॥ 3 ॥

తా ॥ అనర్థకరమగు కర్తృత్వభోక్తృత్వాధ్యాసమువలన విక్షేపము (చలనము) కలిగినప్పుడు దానిం దొలఁగించుటకే సమాధివ్యవహారము కలుగవలయునుగాని, అట్టి విక్షేపమే లేనప్పుడా సమాధివ్యాపారముతోఁ బని లేదని పరికించి, శుద్ధాత్మజ్ఞానము మాత్రముగనుండి దేహాధ్యాసమును లేకుండుటచేత సమాధియును లేని స్వస్వరూపనిరతుఁడనై యుంటిని. (ఆత్మావలోకనమునకై కాయికవాచికమానసికసంబంధమగు ప్రయత్నమే లేకుండ, ఆత్మయే నేనై యుంటిని, అని భావము.) ॥3॥

శ్లో॥ హేయోపాదేయవిరహా దేవం హర్షవిషాదయోః,
అభావాదద్య హే బ్రహ్మ న్నేవమేవాహ మాస్థితః ॥

తా ॥ పూర్ణాత్మదర్శనగు నాకు హేయోపాదేయవస్తువు (గ్రహించఁదగినది గాని విడువఁదగినది గాని) లేదు. అందువలన హర్షవిషాదములును (ప్రాప్తవస్తువుపట్ల సంతోషమును, నప్రాప్తవస్తువునకై దుఃఖమును) లేవు. కావున, గురువరా! నేనిపుడు స్వస్వరూపనిరతుఁడనై యున్నాను.

శ్లో॥ ఆశ్రమానాశ్రమం ధ్యానం చిత్తస్వీకృతవర్జనం,
వికల్పం మమ వీక్ష్యైతై రేవమేవాహ మాస్థితః ॥౫॥

తా॥ (1) బ్రహ్మచర్యాద్యాశ్రమనియమము నట్టి నియమము లేకుండుటయు; (2) ధ్యానము; (3) చిత్తగ్రహణము చిత్తవర్జనము; అను నీమూఁడింటివలనను సంకల్పవికల్పము లుకలుగుచుండుటం జూచి, యీమూఁడును లేకయె నిట్లు స్వస్వరూపనిరతుఁడనై యున్నాఁడను. (కాయిక వాచికమానసికవిక్షేపము లేకుండ స్వప్రకాశపరిపూర్ణాత్మనై యున్నాఁడనని భావము.) ॥౫॥

---

శ్లో॥ కర్మానుష్ఠానమజ్ఞానా ద్యథైవోపరమ స్తథా,
బుద్ధ్వా సమ్య గిదం తత్త్వ మేవ మేవాహ మాస్థితః ॥

తా॥ కర్మానుష్ఠానమునకును, గర్మత్యాగమునకును నజ్ఞానమే కారణము ఇట్లని దీని యథార్థము నెఱింగినవాఁడనై, కర్మానుష్ఠానము కాని కర్మత్యాగము కాని లేనివాఁడనై స్వస్వరూపనిరతుఁడుగ నున్నాఁడను. ॥౬॥

---

శ్లో॥ అచింత్యం చింత్యమానోఽపి చింతారూపం భజత్యసౌ,
త్యక్త్వా తద్భావనం తస్మా దేవమేవాహ మాస్థితః ॥౭॥

తా॥ "పరబ్రహ్మము చింతింపశక్యము కానిది" అని చింతించువాఁడును చింతాపరుఁడే యగును. అనఁగా, ఆత్మచింతాలక్షణముగురూపమును భజించువాఁడగును. ఈకారణమువలన, బ్రహ్మ మచింత్యము అను భావనసయితము లేక భావనారహితస్వస్వరూపనిరతుఁడనై యుంటిని.

(పరమాత్మతత్త్వముం దెలియుటకు శ్రమాదులు జపాదులును గాక ణములుగావు. ఎట్లన, సంన్యాసి అవధూత ఇత్యాద్యాశ్రమనియమములవఁ

న కాయికవిక్షేపము కలుగును. జపాదులవలన వాచికవిక్షేపము కలుగును. ధ్యానధారణసమాధ్యాదులవలన మానసికవిక్షేపము కలుగును. ఇట్టి కాయిక వాచికమానసికలక్ష్యముల నతిక్రమించి కేవలపరమాత్మయందే లక్ష్యముంచుటగాని అచింత్యబ్రహ్మభావనారూపమగు లక్ష్యమగును. పరమాత్మ యెట్టి భావాభావములును లేని పరిపూర్ణవస్తువు కావున అపరిపూర్ణబ్రహ్మమే నేను, అని భావము.) ॥౭॥

---

అవ॥—"ఏవమేవ" (ఈగురుబోధరీతిగనే) అనెడిపూర్ణావస్థనొందుటకు సాధకము చేయువాఁడు శ్రేష్ఠుఁడు. స్వాభావికముగనె యట్టి పరిపూర్ణావస్థనొందినవాఁడిట్టివాఁడని చెప్పఁగలయునా అని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ ఏవమేవ కృతం యేన స కృతార్థో భవేదసౌ,
ఏవమేవ స్వభావో యః స కృతార్థో భవేదసౌ ॥౮॥

తా॥ సర్వక్రియారహితమగు "ఏవమేవ" అనెడి యవస్థను సాధనఁ జేసిచేసి పొందినవాఁడు కృతార్థుఁడు. అట్టి "ఏవమేవ" అనెడి నిజావస్థ యగు స్వభావముచేత నేయుండు ధన్యుని నేమని చెప్పవచ్చును? (అట్టిమహాత్ముఁడు కేవలసచ్చిదానంద పరమాత్మయే యని భావము.) ॥౮॥

---

ఏవమేవాష్టకము

౧౨-వ ప్రకరణము

సమాప్తము.

౧౩-వ ప్రకరణము.

# యథాసుఖసప్తకము.

శిష్యప్రోక్తము.



అవ॥—ఇంతకుముందు చెప్పిన "ఏవమేవ" అను నవస్థకు ఫలితమైన తన సుఖావస్థను శిష్యుఁడు గురువునకు నివేదించుచున్నాఁడు.—

శ్లో॥ అకించనభవం స్వాస్థ్యం కౌపీనత్వేఽపి దుర్లభమ్,
త్యాగాదానే విహాయాస్మాదహమాసే యథాసుఖమ్॥౧॥

తా॥ కౌపీనమందు నయిన మాసక్తి కలిగెనేని సర్వసంగపరిత్యాగమువలనఁగలుగు చిత్తస్థైర్యము దుర్లభమేయగును. ఆకారణముచేత నేను వస్తుపరిగ్రహణమందును, వస్తుత్యాగమునందును, ఆసక్తిలేక సదా సుఖస్వరూపుఁడనై యున్నాఁడను. నాకు దుఃఖమెప్పుడునులేదు. ॥ ౧ ॥



శ్లో॥ కుత్రాపి ఖేదః కాయస్య జిహ్వా కుత్రాపి ఖిద్యతే,
మనః కుత్రాపి తత్త్యక్త్వా పురుషార్థే స్థితస్సుఖమ్ ॥ ౨ ॥

తా॥ ఆసనాది శరీరకర్మమువలన దేహమునకాయాసము కలుగును. జపాదివాచికకర్మమువలన జిహ్వకు క్లేశము కలుగును. ధ్యానాదికర్మవలన మనఃక్లేశము కలుగును. కావున నేనా కాయిక వాచిక మానసిక కర్మత్రయమును విడిచి యథాసుఖముగ పరమపురుషార్థమగు స్వాత్మానందస్వరూపుఁడనైయున్నాఁడను.

వి॥— కాయిక వాచిక మానసిక కర్మములయందు మనస్సు అనాత్మ కాంతమగునుగనుక స్వస్వరూపానంద సుఖము కలుగదు. కావున, ఆసన జపధ్యానాదినియమములులేకయే నిరంతరము యథాసుఖస్థితిని (తురీయావస్థను) ఉండుటయే పరమపురుషార్థమని (జీవన్ముక్తియని) భావము. ॥౨॥

---

అవ॥— అటుల మనోవాక్కాయవ్యాపారముల మానుటచేత దేహమే పడిపోవును. దేహధారణకై భోజనపానాదులు మానుట యెట్లు? అనుశంకకుత్తరము—

శ్లో॥ కృతం కిమపి నైవ స్యాదితి సంచిత్య తత్త్వతః,
యదా యత్కర్తుమాయాతి తత్కృత్వాఽసే యథాసుఖం ॥3॥

తా॥ శరీరేంద్రియాదులు సేయు పనులు తత్త్వదృష్టిచే విమర్శింప ఆత్మ సేయునవి కావని నిశ్చయించి యాశరీరాదులు సేయు కార్యములం దహంభావము లేకయే చేయుచు ఆనందపూర్ణుడనై యున్నాను. ॥3॥

---

అవ॥— ధర్మార్థకామములం గోరువాఁడు నిష్ఠతో గర్మము చేయును. మోక్షము గోరువాఁడు నిష్ఠతోఁ గర్మము మానును. మొదటి త్రివర్గము పురుషార్థమే. తురీయము (మోక్షము) పరమపురుషార్థముకనుక నిష్ఠ రెండింటికిని ఆవశ్యకమే యను శంక కుత్తరము—

శ్లో॥ కర్మనైష్కర్మ్యనిర్బంధభావా దేహస్థయోగినః,
సంయోగాయోగవిరహాదహమాసే యథాసుఖం ॥౪॥

తా॥ ఇది కర్మ, యిది నైష్కర్మ్యము నను నిర్బంధరూపమగుభా

వము దేహాసక్తిగల యోగికే యుండును. నేనన్ననో దేహస్థితియందు గాని దేహపతనమందు గాని సంకల్పము లేనివాఁడనై స్వానందమగ నున్నాఁడను, కనుక నాకు దేహాధ్యాసంగమును లేదు, కర్మ నైష్కర్మ్యనిర్బంధమును లేదు. ॥౪॥

---

అవ॥--- మఱియు, లోకసంబంధవ్యాపారమందును నాకెట్టి నిర్బంధము లేదని చెప్పుచున్నాఁడు ---

శ్లో॥ అర్థానర్థౌ న మే స్థిత్యా గత్యా న శయనేన వా,
తిష్ఠతః గచ్ఛతః స్వపతః తస్మాదహమాసే యథాసుఖం॥

తా॥ నేను పూర్ణానందాత్మదర్శినగుటచే నాస్థితిగతుల వలన నాకర్థానర్థములు లేవు. కావున ననాసక్తితో యూరకుండినను, నడిచినను, శయనించినను నేను సర్వదా యథాసుఖముగ నున్నాఁడను. ॥౫॥

---

అవ॥--- ఈయర్థమునే మఱియొకరీతిని స్ఫుటపరచుచున్నాఁడు:-

శ్లో॥ స్వపతో నాస్తి మే హానిః సిద్ధిర్యత్నవతో న వా,
నాశోల్లాసౌ విహాయాస్మాదహమాసే యథాసుఖం॥

తా॥ యత్నరహితుఁడనై యూరకున్నందున నాకెట్టిహానియు లేదు. యత్నవంతుఁడనై యున్నను నాకెట్టిఫలవిశేషప్రాప్తియు లేదు. ఆ కారణము వలన నేను చలించుచున్నను, కదలకున్నను నాకు నాశోల్లాసములు లేనందున సర్వదా యథాసుఖవర్తినై యున్నాను. ॥౬॥

---

శ్లో॥ సుఖాదిరూపా నియమం భావే ష్వాలోక్యభూరిశః,
శుభాశుభే విహాయాస్మాదహమాసే యథాసుఖమ్ ॥

తా॥ వేసవిని సుఖకరమగు వీవన శీతకాలమున దుస్సహము. శీతకాలమున సుఖకరమగు అగ్నిసేవ వేసవిని దుస్సహము. అటులె బంధుగు లొకప్పుడు శత్రువు లగుదురు. శత్రువు లొకప్పు డాప్తు లగుదురు. ఇట్టిసుఖదుఃఖాదిధర్మము లనిత్యము లని తెలిసికొనినవాఁడనై వానియందనాదరభావముతో సుఖస్థితి నున్నాఁడను. ॥ ౭ ॥

యథాసుఖసప్తకము
౧౩-వ ప్రకరణము
సమాప్తము.



౧౪వ ప్రకరణము

# శాంతిచతుష్టయము.

శిష్యప్రోక్తము.



అవ॥— పూర్వము (౧౦-వ ప్రకరణమందు) గురూపదిష్టమగు ఉపశమాష్టకమును స్ఫురణకుఁ దెచ్చుకొని శిష్యుఁడు తన సుఖావస్థను సమర్థించుచు నిపుడు తన శాంతావస్థను నివేదించుచున్నాఁడు.—

శ్లో॥ ప్రకృత్యా శూన్యచిత్తో యః ప్రమాదాద్భావభావనః,
నిద్రితో బోధితఇవ క్షీణసంసరణో హి సః ॥ ౧ ॥

తా ॥ స్వాభావికముగ విషయాసక్తి లేనివాఁడయ్యును నిద్రినుండి మేల్కొల్పఁబడినవానివలెఁ బ్రమాదవశమున ప్రారబ్ధవశములగు పూర్వవిషయముల బుద్ధిపూర్వకముగ భావించువాఁడు "భావభావనుఁడనఁబడును." అట్లు నిద్రయందు శూన్యచిత్తుఁడయ్యు నొకానొకప్పుడు మేల్కొల్పఁబడినందునఁ బ్రమాదమునఁ బూర్వవిషయములఁ దలచుకొనువానివలె, విషయస్ఫురణముఁ గలిగినవాఁడయ్యును భావభావనునివలె నతఁడు విషయములందు శాంతచిత్తుఁడే యగును. కనుక నట్టివాఁడు సంసారవిషయానుస్మరణము లేనివాఁడే యగును. (౧౨-౧౩ ప్రకరణములందు జెప్పఁబడిన విధముగ పూర్ణజ్ఞానియగు మహాశయుఁ డొకానొకప్పు డితరులచేతఁ బ్రబోధితుఁడై పూర్వవిషయములను తలఁచుచున్నను, అతఁడు విషయాసక్తుఁడును. సంసారియుఁ గానేరఁడని భావము.) ॥ ౧ ॥

---

శ్లో॥ క్వధనాని క్వమిత్రాణి క్వమే విషయదస్యవః,
క్వశాస్త్రం క్వచ విజ్ఞానం యదా మే గళితా స్పృహా॥

తా ॥ విషయాసక్తియే లేక పూర్ణాత్మదర్శినగు నాకు గతించిన విషయముల స్మరణము మరలఁ గలుగు టెట్లు? (కలుగదు.) ధనమేల? విషరూపచోరులేడ? శాస్త్రమేల? విజ్ఞానము, అనఁగా బ్రహ్మాహమస్మి యను నిదిధ్యాసనమేల? పరిపూర్ణాత్మదర్శినగు నాకు ధనాదులందును విజ్ఞానమందును ఆస్థయే లేదని భావము. ॥ ౨ ॥

---

శ్లో॥ విజ్ఞాతే సాక్షిపురుషే పరమాత్మని చేశ్వరే,
నైరాశ్యే బంధమోక్షేచ నచింతా ముక్తయే మమ॥ 3॥

తా ॥ దేహేంద్రియాదులకు సాక్షియగు "త్వం" పదలక్ష్యార్థమును, పరమాత్మయగు 'తత్' పదలక్ష్యార్థమును నేకముగఁ దెలిసి, 'బ్రహ్మాఽహ మస్మి' యనెడి సాక్షాత్కారమువలన నిత్యనిర్ముక్తచిద్రూపాత్మానుభవము గలిగి, బంధమోక్షములందు నిస్పృహుఁడనగు నాకు ముక్తికొఱకయిన చింతలేదు. ॥ 3 ॥

---

అవ॥— ప్రమాదమున భావభావనుఁడగు (పూర్వవిషయస్మృతిగల) వాఁడు శాంతుఁడెట్లగును? అనెడి శంకకు సమాధానము.—

శ్లో॥ అంతర్వికల్పశూన్యస్య బహిస్స్వచ్ఛందచారిణః,
భ్రాంతస్యేవ దశా స్తాస్తా స్తాదృశా ఏవ జానతే. ॥ ౪ ॥

తా ॥ అంతరంగమున సంకల్పవికల్పములు లేక, బాహ్యమునకుఁ బిచ్చివానివలె స్వేచ్ఛతోఁ దిరుగు జ్ఞానియొక్క వ్యాపారము, అట్టి జ్ఞానులకే తెలియును గాని, ఇతరులకు తెలియదు. ॥౪॥

శాంతిచతుష్టయము
౧౮-వ ప్రకరణము
సమాప్తము.



## ౧౫వ ప్రకరణము.

# తత్త్వోపదేశవింశతికము.

### గురుప్రోక్తము.



అవ॥— ప్రథమమున శిష్యున కొక్కసారి తత్త్వోపదేశమును జేసియు నయ్యది దుర్లక్ష్యమయినది కనుక, ఛాందోగ్యోపనిషత్తున దయానిధియగు ఉద్దాలకుఁడు తన శిష్యుఁడు శ్వేతకేతువునకు "తత్త్వమసి" యను మహావాక్యమును మఱల మఱల బోధ కావలెఁ దొమ్మిదిమార్లుపదేశించిన తెఱఁగున నిపుడు శిష్యుఁడగు జనకునకు శ్రీఅష్టావక్రముని తిరిగి యాత్మోపదేశమును జేయుచున్నాఁడు. దానికై ముందు జ్ఞానోపదేశమున కధికారిలక్షణమును జెప్పుచున్నాఁడు.—

**శ్లో॥ యథా తథోపదేశేన కృతార్థ స్సత్వబుద్ధిమాన్,**
**ఆజీవ మపి జిజ్ఞాసుః పర స్తత్ర విముహ్యతి ॥౧॥**

తా॥ సత్వబుద్ధిగల శిష్యుఁడొకసారి గురూపదేశము నొందినంత మాత్రముననె కృతార్థుఁడగును. కృతయుగమందు ప్రణవోపదేశమాత్రముననె శిష్యులు కృతార్థులైరి. సత్వబుద్ధిలేని (రజస్తమోగుణప్రధానులగు) వారలు యావజ్జీవమును ఆత్మజిజ్ఞాస జేసియు, గురువువలన ననేకపర్యాయములు బోధితు లయ్యును, మోహపరవశులై తరింపఁజాలరు. ఎట్లన, వామదేవుఁడు మాతృగర్భస్థుఁడయ్యును కేవలసత్వమూర్తి కావున నొకసారి ప్రణవోపదేశమాత్రమున జ్ఞానియై ముక్తి నొందెను. బలిచక్రవర్తి రజోగుణావృతుఁడు కావున, బ్రహ్మదేవునిచే నెన్నిపర్యాయములు తత్వోప

దేశ మొందినను మోహ (సంశయ) వశుఁడై కృతార్థుఁడు కాక పోయెను.

---

అవ॥— ఇపుడు సుఖోపాయముగ బంధమోక్షముల సంగ్రహముగఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో॥ మోక్షో విషయవైరస్యం బంధో వైషయికో రసః,
ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు ॥2॥

తా॥ విషయములం దనురాగము లేకుండుటయే మోక్షము. వాని యందనురాగముఁ గలిగియుండుటయే బంధము. ఈబంధమోక్షముల తారతమ్యము దెలియుటయె ఉత్కృష్టమగు జ్ఞానము. కావున, శిష్యా! ఇటుల విమర్శించి నీయిచ్ఛప్రకారము చేయుము. (విషయానురాగమును బూర్తిగ విడిచి బంధముక్తుఁడవై ముక్తి నొందు మని భావము). ॥2॥

---

అవ॥— ఈవిషయవైరస్యము తత్త్వబోధచేతనే కాని కలుగదని చెప్పుచున్నాఁడు:—

శ్లో॥ వాగ్మిప్రాజ్ఞమహోద్యోగం జనం మూకజడాలసమ్,
కరోతి తత్త్వబోధోఽయ మతస్త్యక్తో బుభుక్షుభిః॥3॥

తా॥ ఈఆత్మతత్త్వబోధము, బహుచతురవాక్యభాషిని మూగివానిగ జేయును; నానావిశేష 'శాస్త్ర' వేదిని జడునిగఁ జేయును; నానాక్రియానుష్ఠానశాలిని నిష్క్రియునిగఁ జేయును. కారణ మేమన, తత్త్వజ్ఞాని యొక్క మనస్సు ప్రత్యగ్బ్రహ్మనిరతమగుటచేత వాని శాగాదీంద్రియము

లు భంగపడి స్వస్వవ్యాపారవిముఖము లగును. అనఁగా తత్త్వజ్ఞానము సర్వేంద్రియముల భంగపరచి వాని వాని వ్యాపారముల నడికట్టును. కావునజ్ఞాని వ్యర్థమగు వాగాదివ్యాపారములను జేయఁడు. భోగేచ్ఛ గలవారలీతత్త్వబోధము నాదరింపరు.

వి—— తత్త్వజ్ఞులు సకలవిద్యాపరిపూర్ణు లయ్యును, 14 వ ప్రకరణము 4 వ శ్లోకములోఁ జెప్పఁబడినట్లు, బాహ్యమునకుఁ బిచ్చివారివలె నటింతురు. వారి జాడలు జ్ఞానులకే కాని యితరులకుఁ దెలియవు. పటాటోపముతో నుపనిషదాదిగ్రంథస్థవిషయముల నతిచతురతతో నుపన్యసించువారలు, తర్క—వ్యాకరణాదిశాస్త్రవిషయముల వాక్ప్రౌఢిమతో నుడువువారలు, యజ్ఞయాగాదికర్మల నతివైభవముతో నాచరించువారలును తత్త్వవేత్తలు కారనియు, ఆత్మానుభవము గలవారలకు నెటువంటి పటాటోపములు నుండవనియు నిందలి సారాంశము. ॥ 3 ॥

---

అవ॥—— ఇఁక తత్త్వబోధసిద్ధికొఱ కుపదేశించుచున్నాఁడు——

**శ్లో॥ న త్వం దేహో న తే దేహో భోక్తా కర్తా న వా భవాన్,**
**చిద్రూపోఽసి సదా సాక్షీ నిరపేక్ష స్సుఖం చర ॥౪॥**

తా॥ నీవు కేవలచిద్రూపుఁడవు. కనుక దేహాదిరూపము నీవు కావు. నీకు దేహసంబంధమును లేదు. ఇచట "అసంగోహ్యయం పురుషః" అను శ్రుతి ప్రమాణము. కర్తృత్వభోక్తృత్వాదులకు సాక్షిమాత్రుఁడవగుటచే నీవు కర్తవును గావు. భోక్తవును గావు. ఘటమును జూచువాఁడు ఘటముకంటె వేరైనట్లు దేహత్రయము యొక్క రాకపోకలం జూచుచు సాక్షిమాత్రుఁడవగు నీవు దేహాదులకంటె భిన్నుఁడవు. కావున నీవు దేహా

సుమను తత్సంబంధవిషయములందును, నిరపేక్షుండవై సుఖింపుము. ॥౪॥

---

అవ॥— నిరపేక్షత్వము నుపపాదించుచున్నాఁడు.—

శ్లో॥ రాగద్వేషౌ మనోధర్మౌ న మనస్తే కదాచన,
నిర్వికల్పోఽసి బోధాత్మా నిర్వికారస్సుఖం చర ॥౫॥

తా॥ వత్సా! రాగద్వేషములు మనోధర్మములు. చిన్మాత్రుండవును, అమనస్కుండవును నగు నీకు జడమగు మనస్సుతో నెప్పుడు నెట్టిసంబంధమును లేదు. కావున మనస్సును నీవు కావు. నీకు జడమగు మనస్సుతో నధ్యాసము కలిగి నేని, అనఁగా మనస్సే నీనను కొనునెడల రాగాదులు కలుగును గాన నట్టి మనస్సుతో నధ్యాసముఁ గలిగించుకొనకుము. రాగద్వేషములు నీధర్మము లెటులఁ గావని శంకింతువేని వినుము. నీవు నిర్వికల్పబోధాత్మవు. కావున రాగాదుల నంటక చిన్మాత్రుండవై సుఖింపుము.

---

అవ॥— రాగద్వేషము లెటుల కలుగకుండు నను శంక కుత్తరము.

శ్లో॥ సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని,
విజ్ఞాయ నిరహంకారో నిర్మమస్త్వం సుఖీ భవ ॥౬॥

తా॥ ఆత్మ సర్వభూతములందును కారణరూపముగ ననుస్యూతమై యున్నదనియు, సర్వభూతములును ఆత్మయందే యధ్యసింపఁబడినవనియు భావించి, అహంకారమమకారములనువిడిచి (బ్రహ్మానంద) సుఖము నొందుము. (అనుస్యూతమనఁగా హారముయొక్క అన్నిపూసలలోను దారముకూడియుండునట్లు సమస్తప్రపంచమందును ఆత్మ వ్యాపించియుండుట. అధ్యా

సమనఁగా భ్రాంతిచే రజ్జువును సర్పమనుకొనుపట్టుల పరబ్రహ్మమును జగత్తుగ భావించుట)

వి— సర్వభూతస్థ మాత్మానం సర్వభూతానిచాత్మని । ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ గీత 6-29.

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతానిచాత్మని, సంపశ్యన్ బ్రహ్మ పరమం యాతి నాన్యేన హేతునా ॥ కైవల్యశ్రుతి.

ఈప్రకారము ఆత్మానుభవము గల మహాశయుఁడే జ్ఞాని. ॥౬॥

---

అవ॥— ఆత్మయందె సర్వభూతము అధ్యస్తమయిన దని చెప్పినదానిని స్ఫుటపరచుచున్నాఁడు —

శ్లో॥ విశ్వం స్ఫురతి యత్రేదం తరంగా ఇవ సాగరే,
తత్త్వమేవ న సందేహ శ్చిన్మూర్తే విజ్వరో భవ ॥౭॥

తా॥ సముద్రమునుండి కలిగిన తరంగాదులు స్వకారణమగు సముద్రముకంటె వేఱు కానట్లె చిదాత్మయందుఁ గల్పితమగు విశ్వము స్వకారణమగు చిదాత్మకంటె వేఱు కాదు. వత్సా! నీవు ఆచిదాత్మవే కనుక నట్టి దృఢానుభవమున సకలసంతాపములను విడిచి సుఖింపుము. ॥౭॥

---

అవ॥— శిష్యునియందత్యంతకరుణతో గురువు మఱల మఱల బోధించుచున్నాఁడు.—

శ్లో॥ శ్రద్ధత్స్వ తాత శ్రద్ధత్స్వ నాత్ర మోహం కురుష్వ భోః,
జ్ఞానస్వరూపో భగవా నాత్మాత్వం ప్రకృతేఃపరః॥౮॥

తా ॥ వత్సా! అతిశ్రద్ధతో వినుము. నీవు భాగలక్షణచేత రూఢిగ చిన్మాత్రుఁడవే యని నమ్ముము. నీవు కేవలము జ్ఞానస్వరూపుఁడవు. ప్రకృతికిం బరుఁడవు. తత్ పదార్థమగు పరమేశ్వరుఁడవును, త్వం పదార్థమగు ఆత్మయును నీవే. (ప్రకృతి కాని, ప్రకృతికార్యమగు దేహాదిప్రపంచము గాని నీవు కావు. "తత్త్వమసి" యను మహావాక్యము బోధించు సచ్చిదానందపరమాత్మవు నీవె. ఆయాత్మయె పరబ్రహ్మము. ఇట్టి దృఢనిశ్చయమే దేహాభిమానమును తొలఁగించుటకు సదుపాయము.) ఈదృఢనిశ్చయమును ప్రతిబంధించెడి అసంభావనావిపరీతభావనలు అవిద్యాకల్పితనామరూపాత్మకజగత్తు నుపేక్షించుటచేతఁ దొలఁగును.

అసంభావనయనఁగా— ఆత్మ కలదనెడి నమ్మకము లేకపోవుట.

విపరీతభావనయన— దేహమే ఆత్మయనుకొనుట.

భాగలక్షణ యనఁగా— కల్పితాంశమును విడిచి ముఖ్యాంశమును గ్రహించుట. ఎట్లనఁగా— సర్వజ్ఞుఁడగు పరమేశ్వరునితోఁ గించిజ్జ్ఞుఁడగు జీవున కైక్యమును తత్త్వమస్యాదిమహావాక్యములు బోధించునపుడు కల్పితములగు సర్వజ్ఞత్వకించిజ్జ్ఞత్వాదులనెడి యొక భాగమును మాత్రము వదిలి, యుపాధిద్వయము నందున్న శుద్ధచైతన్యమాత్రమును గ్రహింపఁగా జీవేశ్వరుల కైక్యము సంభవించును. శుద్ధచైతన్యమునకు మాయోపాధివలన ఈశ్వరసంజ్ఞయు, అవిద్యోపాధివలన జీవసంజ్ఞయుఁ గలిగినవి. కావున నీ యీశ్వరజీవసంజ్ఞల నుపేక్షింపఁగా శుద్ధచైతన్యము (పరమాత్మ) మాత్రమే శేషించును. (చూ. ప్ర ౧౫, శ్లో ౩౪ తా. ॥౮॥

---

అవ॥--- ఆత్మకును, దేహమునకును గల వైలక్షణ్యమును వివరించుచున్నాఁడు.---

శ్లో॥ గుణైః సంవేష్టితో దేహ స్తిష్ఠత్యాయాతి యాతిచ,
ఆత్మా న గంతా నాగంతా కిమేన మనుశోచసి ॥౯॥

తా॥ ఇంద్రియాదులతోఁ గూడిన యీ దేహ మిహలోకమం దున్నది. కొలఁదికాలముక్రిందట వచ్చినది. కొంతకాలమువఱకు నుండి నశించును. దేహాదులకంటె వేఱయిన ఆత్మ క్రొత్తగ వచ్చినది కాదు. పోవునదియును గాదు. కాఁబట్టి (నిత్యాత్మవగు) నీవు "నేను పుట్టితిని మృతినొందెదను" అని శోకింతు వేల? ఆత్మకు దేహధర్మముల గల్పించుకొని శోకింపవల దని భావము.

---

అవ॥— చిద్రూపాత్మవగు నీకు దేహమున్నందున వృద్ధియు, నది నశించినందున హానియును లేవని చెప్పుచున్నాఁడు---

శ్లో॥ దేహస్తిష్ఠతు కల్పాంతం గచ్ఛత్వద్యైవ వా పునః,
క్వ వృద్ధిః క్వ చ వా హానిస్తవ చిన్మాత్రరూపిణః ॥౧౦॥

తా॥ నిత్యచిన్మాత్రరూపుఁడవగు నీకు కల్పాంతమువఱకును దేహమున్నందున వృద్ధియు, నిప్పుడె పోయినందున హానియును లేదు. ॥౧౦॥

---

అవ॥— తరంగముల యుత్పత్తినాశములవలన సముద్రమునకు వృద్ధిక్షయములు లేనట్లు, ప్రపంచముయొక్క యుత్పత్తినాశములవలన ఆత్మకు వృద్ధిక్షయములు లేవని చెప్పుచున్నాఁడు.---

శ్లో॥ త్వయ్యనంతమహాంభోధౌ విశ్వవీచిః స్వభావతః,
ఉదేతు వాస్తమాయాతు న తే వృద్ధిర్న వా క్షతిః ॥౧౧॥

తా॥ అనంతచిదంబుధివగు నీయందు అవిద్యాకామకర్మమూలమగు విశ్వము అనెడి తరంగములు సహజముగ నుదయించును, నశించును. అందువలన నీకువృద్ధియు లేదు, క్షతియు (నాశము) ను లేదు. ఏమనఁ జిదాత్మ నిత్యము, ఏకము, పరిపూర్ణము, అనంతము అనాది. చూ. ప్ర॥౧॥శ్లో॥౧౦ టిప్పణి.

---

అవ॥— చిదేకరసాత్మకుఁడవగు నీయందు విశ్వకల్పన మాయికమే కాని వాస్తవము కాదని శ్లోకత్రయముచే వివరించుచున్నాఁడు—

శ్లో॥ తాతచిన్మాత్రరూపోఽసి న తే భిన్నమిదం జగత్,
అతః కస్య కథం కుత్ర హేయోపాదేయకల్పనా॥౧౨॥

తా॥ జగత్తు నీసత్తకంటె నన్యసత్త లేనిది కనుక సన్మాత్రుఁడవగు నీకంటె వేఱుకాదు. కాఁబట్టి నీకు మాయికపదార్థసంబద్ధము లగు హేయోపాదేయములు లేవు. ఆరోపితవస్తు వధిష్ఠానము కంటె వేఱు కాదని "నాధిష్ఠానా ద్భిన్నతాఽఽరోపితస్య" అనెడి యార్షవచన మిట ప్రమాణము. (ఆరోపితము, అధ్యస్తము, కల్పితము, ఇవి సమానార్థకములు.

---

శ్లో॥ ఏకస్మిన్నవ్యయే శాంతే చిదాకాశేఽమలే త్వయి,
కుతో జన్మ కుతః కర్మ కుతోఽహంకార ఏవ చ॥౧౩॥

తా॥ సజాతీయవిజాతీయస్వగతభేదములు లేక, ఏకరూపుఁడవు, నాశరహితుఁడవు, కార్యసంబంధము లేని శాంతుఁడవు, నిర్మలచిదాకాశమాత్రుఁడవు, సర్వోపాధిశూన్యుఁడవు నై యున్న నీకు జన్మకర్మములు వాస్తవముగ లేవు. అహంకారమును లేదు. నీకుఁ బుట్టించెడు ద్వితీయవస్తు

వు లేనందున జన్మము లేదు. జన్మము లేనందున నాశము లేదు. నిష్క్రి యుఁడవగుటవలననే కర్మమును లేదు. మఱియు నిర్మలుఁడవగుటవలన రాగద్వేషరూపమలములకు హేతువగు అహంకారమును లేదు. ||౧౩||

అవ॥— ఏకత్వము నుపపాదించుచున్నాఁడు——

శ్లో ॥ యత్త్వం పశ్యసి తత్రైక స్త్వమేవ ప్రతిభాససే,
కిం పృథగ్భాసతే స్వర్ణా త్కటకాంగదనూపురం ॥

తా ॥ (కార్యము లగు) కటకాంగదనూపురాదులందు (కారణరూపమగు) స్వర్ణమే వ్యాపించియున్నటుల, నీవు చూచెడి కార్యజాతమందంతటను కారణరూపుఁడవగు నీవె వ్యాపించి ఏకమై స్ఫురించుచున్నావు. (సువర్ణ మెన్నిరూపములుగ మారినను స్వర్ణమే యైనటుల, ఆత్మ స్వశక్తిచే నెన్నిరూపములుగ మారినను వాని సత్త ఆత్మసత్తయే కాని వేఱు కాదని భావము.) ||౧౪||

శ్లో ॥ అయం సోఽహ మయం నాహం విభాగ మితి సంత్యజ,
సర్వమాత్మేతి నిశ్చిత్య నిస్సంకల్ప స్సుఖీభవ ||౧౫||

తా ॥ "సర్వమును గారణరూపమగు ఆత్మయే" అనెడి నిశ్చయముతో, "సోఽహం, నాహం" (నేను, నేను కాను) ఇత్యాదిభేదభ్రమను విడిచి, నిర్వికల్పుఁడవై, యొక్క ప్రతిభాసమును లేక సుఖింపుము. ద్వితీయవస్తువు (ఆత్మేతరము) న్నదని తలంచుటయె దుఃఖమగును. ||౧౫||

అవ॥--- భేదబుద్ధిని విడిచే యుపాయమును జెప్పుచున్నాఁడు---

శ్లో॥ త్వయ్యేవాజ్ఞానతో విశ్వం త్వ మేకః పరమార్థతః,
త్వత్తోఽన్యో నాస్తి సంసారీ నాసంసారీచ కశ్చన॥౧౬॥

తా॥ అజ్ఞానము చేత (ననఁగా నిస్స్వరూపము మఱచి) విశ్వాకార విక్షేపము (ప్రపంచబుద్ధి) కలిగినప్పుడే నీకు విశ్వము స్ఫురించును. కాని, మాయాకల్పితమగు నీసర్వమును పరమార్థము చేతఁ గారణరూపుఁడవగు నీవే; సంసారి ముక్తుఁడు అను విభజనమే నీకు లేదు. ॥౧౬॥

---

శ్లో॥ భ్రాంతిమాత్ర మిదం విశ్వం న కించిదితి నిశ్చయీ,
నిర్వాసనః స్ఫూర్తిమాత్రో నకించిదివ శామ్యతి ॥౧౭॥

తా॥ ఈవిశ్వము భ్రాంతిరూపముచేతనే కలుగుచున్నది. కావున ఆత్మసత్త్వకంటె పృథక్సత్త లేనిది, అనెడి నిశ్చయము గలవాఁడు సర్వసంకల్పశూన్యుఁడును, వాసనారహితుఁడును, స్ఫూర్తిమాత్రుఁడును, నిర్వికారుఁడునై యుపశమించును. (సర్వదా ఆత్మజ్ఞప్తిమాత్రము కలిగి సంకల్పవికల్పాదులు లేనివాఁడు ముక్తుఁడని భావము) ॥౧౭॥

---

శ్లో॥ ఏక ఏవ భవాంభోధా వాసీ దస్తి భవిష్యతి,
న తే బంధోఽస్తి మోక్షో వా కృతకృత్య స్సుఖం చర॥

తా॥ (జననమరణరూప) సంసారమహాంబుధియందు కాలత్రయమందును నిత్యుఁడవై (ఆత్మవగు) నీవొకండవె యున్నాఁడవు. కనుక నీ

కు బంధమోక్షములు లేవు. (ఇట్టి దృఢనిశ్చయము కలవాడవై స్వస్వరూపానందమగ్నవై సుఖింపుము. ||౧౮||

---

శ్లో || మా సంకల్పవికల్పాభ్యాం చిత్తం క్షోభయ చిన్మయ,
ఉపశామ్య సుఖం తిష్ఠ స్వాత్మన్యానందవిగ్రహే ||౧౯||

తా || చిన్మయుండవగు వత్సా! సంకల్పవికల్పములచేత చిత్తక్షోభము నొందకుము. సర్వసంకల్పవికల్పములను విడిచి పరమానందరూపమగు స్వాత్మయందు రమింపుచు సుఖివై యుండుము. ||౧౯||

---

అవ|| — ధ్యానమును సయితము విడువవలెనని చెప్పుచున్నాడు —

శ్లో || త్యజైవ ధ్యానం సర్వత్ర మా కించిద్ధృది ధారయ,
ఆత్మా త్వం ముక్త ఏవాసి కిం విమృశ్య కరిష్యసి ||౨౦||

తా || శిష్యా! సర్వత్ర ధ్యానమును సయితము విడువుము. ఏమన అధిష్ఠానమగు ఆత్మకంటె వేఱగు ధ్యానముకూడ మానసికవ్యాపారముగుట వలన నది నశ్వరము. కనుక నీకు నీవు ధ్యానించతగిన దెద్ది? అట్టి ధ్యానమును నాత్మేతరమె కనుక మననము సయితము వలదు. నిత్యాత్మవగు నీవు సదా ముక్తుండవె. ఇట్టి విమర్శింపలేని ధ్యానసాధనములవలన ఫలమెద్దియును లేదు. (మాయికములగు సకల సంకల్పవికల్పములు, వాసనలు, జపతపధ్యానమననాది మానసికవ్యాపారములు విడిచి నిత్యపరమానందైకాత్మ తాదాత్మ్యము నొందుటయె ముక్తియని భావము.)

వి— ధ్యానము మానసికము; నిదిధ్యాసనము మనోతీతము. ||౨౦||

తత్త్వోపదేశవింశతికము

౧౫-వ ప్రకరణము

సమాప్తము.

౧౭-వ ప్రకరణము

# విశేషోపదేశకము.

గురుప్రోక్తము.

అవ॥— ఇఁక నీప్రకరణమందు, తత్త్వజ్ఞానముచేత, "సర్వప్రపంచమునకు నాత్మసత్తకంటె పృథక్సత్త లే" దను నిశ్చయము గలిగి, తృష్ణా (ఆశా) రహితాదివైరాగ్యముతో సర్వవిస్మరణము కలిగిననే ముక్తి కలుగును గాని, మఱి యేయితరోపాయముచేతను ముక్తి కలుగదనే విశేషము నుపదేశించుచున్నాఁడు.—

శ్లో॥ ఆచక్ష్వ శృణువా తాత నానాశాస్త్రాణ్యనేకశః,
తథాపి న తవ స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే ॥ ౧ ॥

తా॥ వత్సా! నానాశాస్త్రముల ననేకసార్లు నీవు శ్రద్ధతో గురుముఖమున వినినను, శిష్యుల కుపదేశించినను, నీకు సర్వవిస్మరణము (సర్వమును మఱచుట) కలుగకుండ స్వాస్థ్యము (శాంతి) కలుగదు. అయితే, సుషుప్తియందెల్లరకును సర్వవిస్మరణము కలుగుచున్నది కనుక నందఱకును మోక్షము కలుగుచునే యున్నది, ఇఁక సర్వవిస్మరణ మెందుకనియెదవేని వినుము. సుషుప్తియందు విషయవిస్మరణమే కాని, దానికిఁ గారణమగు అజ్ఞానవిస్మరణము లేదు. జీవన్ముక్తుఁడు స్వాధ్యస్తమగు అజ్ఞానమును, తత్కార్యవిషయములను మఱచి సదా కేవలచిన్మాత్రుఁడై యుండును. ఇచట "సర్వం" అనుపదమువలన "మూలాఽవిద్య" గ్రహింపఁబడెను. ఈయవిద్యావిస్మరణమే ముక్తియని తాత్పర్యము. (సర్వప్రాణులకు

ను సుషుప్తియందు విషయవిస్మరణము కలిగినను జాగ్రదవస్థయం దజ్ఞానచిహ్నమగు విషయస్మరణము కలుగుచునే యుండును. జీవన్ముక్తుఁడు సుషుప్త్యాదిసర్వావస్థలయందును విషయవిస్మరణము, నజ్ఞానవిస్మరణమునుం గలిగి (అనగా సర్వమును మఱచి) విస్మృతుఁడై యుండునని తాత్పర్యము.)

---

అవ||— సర్వవిస్మరణము (సర్వమును మఱచుట) కలుగఁగా మాయికములగు సర్వస్వరూపములను జూచుచుండియు జీవన్ముక్తుని చిత్తము సర్వాశారహితమయి యుండునని సూచించుచున్నాఁడు.—

శ్లో|| భోగం కర్మ సమాధిం వా కురు విజ్ఞ తథాపి తే,
చిత్తం నిరస్తసర్వాశ మత్యర్థం రోచయిష్యతి || ౨ ||

తా|| స్వస్వరూపానుసంధానముగల ప్రాజ్ఞుఁడా! సర్వభోగముల ననుభవించుచున్నను, సమాధినిష్ఠ నున్నను సర్వకర్మలఁ జేయుచున్నను, సర్వాశారహితమై సర్వవిస్మరణ మొందిన నీచిత్తము నశ్వరమగు దృశ్యప్రపంచమునందు రోఁతఁ జెంది స్వస్వరూపమందే యభిరుచిఁ గలిగి యుండును. ||౨||

---

అవ||— సర్వతృష్ణారహితుఁడగు జ్ఞాని కర్మములం జేసినను నవి దుఃఖహేతువులును, ఆయాసజనకములును గానేరవని సూచించుచున్నాఁడు.—

శ్లో|| ఆయాసాత్సకలో దుఃఖీ నైనం జానాతి కశ్చన,
అనేనైవోపదేశేన ధన్యః ప్రాప్నోతి నిర్వృతిమ్ ||3||

తా॥ సకలజనులును శ్రమచేతనే దుఃఖితు లగుచున్నారు. కాని యిట్టి యాయాసమే దుఃఖహేతు వని యెవ్వరును తెలిసికొనరు. శ్రమయే దుఃఖకారణమని యీయుపదేశముచే జ్ఞాని నిర్వృతిం జెంది ధన్యుడై పరమసుఖము నొందును. (తృష్ణవలన శ్రమ. శ్రమవలన సంసారదుఃఖము కలుగును గాన జ్ఞాని తృష్ణారహితుండై స్వస్వరూపము నొందు అనగా, దేహాభిమానమును విడచి, యాత్మసుఖముం బడసి ముక్తుండగును.) ॥ ౩ ॥

---

అవ॥--- (ఇంద్రియాది) వ్యాపారమందాసక్తి లేకుండుటయే సుఖహేతు వని చెప్పుచున్నాడు.---

శ్లో॥ వ్యాపారే ఖిద్యతే యస్తు నిమేషోన్మేషయో రపి,
తస్యాలస్యధురీణస్య సుఖం నాన్యస్య కస్యచిత్ ॥౪॥

తా॥ ఎవడు (నేత్ర) నిమేషోన్మేషవ్యాపారమునందు సయిత మా సక్తి లేక యుండునో యట్టి నిస్పృహుండగు మహాసోమరికిం గలుగు సుఖము (నేనీపనిం జేయవలయునను) దృఢాభినివేశము గలవానికిం గలుగదు.

---

అవ॥--- సర్వతృష్ణాశూన్యుడగువానికి ద్వంద్వభావము గూడ నశించునని చెప్పుచున్నాడు---

శ్లో॥ ఇదం కృత మిదం నేతి ద్వంద్వై ర్ముక్తం యదా మనః,
ధర్మార్థకామమోక్షేషు నిరపేక్షం తదా భవేత్ ॥

తా॥ ఇది చేసితి, నిది చేయలేను. ఈమొదలగు ద్వంద్వభావము లు లేని జ్ఞాని ధర్మార్థకామమోక్షములందును నిరపేక్షుండగును. జీవన్ముక్తునకు ద్వంద్వభావములు గలుగవని భావము. ॥౫॥

---

అవ॥— పురుషార్థచతుష్టయమందు నిరపేక్షుఁడై విరక్తుఁడగువాని కిని, కాముకుఁడగువానికిని గల వైలక్షణ్యమును జెప్పుచున్నాఁడు:—

శ్లో॥ విరక్తో విషయద్వేష్టా రాగీ విషయలోలుపః,
గ్రహమోక్షవిహీన స్తు న విరక్తో న రాగవాన్ ॥౬॥

తా॥ ముముక్షువై (మోక్షేచ్ఛ గలిగి) విషయములయందు ద్వేష బుద్ధిగలవాఁడు విరక్తుఁడనఁబడును. కామములందపేక్ష గలిగి విషయలో లుపుఁడగువాఁడు రాగి యనఁబడును. గ్రహణమోక్షేచ్ఛలు రెండును లే నివాఁడు విరక్తుఁడును గాఁడు; రాగియుంగాఁడు. హానోపాదానేచ్ఛ లేకుం డుటచేత సర్వనిరపేక్షుఁడగును. అనఁగా ధర్మార్థకామములందును మోక్ష మందును నిరపేక్షుఁడగును. అట్టివాఁడె జ్ఞానియు, ముక్తుఁడును. ॥౨॥

---

అవ॥— అయితే, జ్ఞానిసయితము హానోపాదానాది (వస్తుగ్రహ ణత్యాగాది) వ్యవహారము గలవాఁడుగ గన్పించునే! అనుశంకకుత్తరము—

శ్లో॥ హేయోపాదేయతా తావ త్సంసారవిటపాంకురః,
స్పృహా జీవతి యావద్వై నిర్విచారదశాస్పదమ్ ॥౭॥

తా॥ అవివేక (అజ్ఞాన) దశాస్పదమగు తృష్ణ (ఆశ) నిలిచియుం డునంతపర్యంతము హేయోపాదానాదివ్యవహార మనునట్టి సంసారవృక్ష శాఖ లంకురించుచునే యుండును. కాఁబట్టి మనోబుద్ధిచిత్తాహంకారములు లయమై యెట్టి స్పృహయు లేని పూర్ణదశకు వచ్చువరకు సంసారవృక్షాం కురము నశింపదు. జ్ఞాని కెట్టి స్పృహయు లేకపోవుటచేత హానోపాదా నాదివ్యాపార ముండినను సంసారతరుశాఖ లంకురింపవు. (వేఁచబడినగిం జ స్వరూపముతో నున్నను మొలవదు. ఇచట "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భ

స్మసాత్కురుతేఽర్జున” అనెడి గీతావాక్యము ప్రమాణము. స్వరూపజ్ఞానము కలుఁగనిదే విషయములందు స్పృహ తొలఁగదు) జ్ఞానిసర్వవ్యవహారమందును నిస్పృహుఁడు గనుక గ్రాహ్యత్యాజ్యాదివ్యవహారము ఆభాసమాత్రముగఁ గలిగియు సంసారి కాఁడని తాత్పర్యము. ॥౭॥

---

అవ॥— జ్ఞానికి దేహాభిమానము లేనందున వాని వ్యాపారము దగ్ధపటన్యాయమున ఆభాసమాత్రముగ నుండునని శ్లోకత్రయముచేఁ జెప్పుచున్నాఁడు.---

శ్లో॥ ప్రవృత్తౌ జాయతే రాగో నివృత్తౌ ద్వేషఏవహి,
నిర్ద్వంద్వో బాలవద్ధీమా నేవ మేవ వ్యవస్థితః ॥౮॥

తా॥ రాగయుక్తమగు ప్రవృత్తి యుండెనేని, ఉత్తరోత్తర రాగమే కలుగును. విషయములందు ద్వేషపూర్వకముగ నివృత్తి కలిగనేని, ఉత్తరోత్తర విషయములందు ద్వేషమే కలుగును. కనుక జ్ఞానియగువాఁడు పసిబాలుని రీతి శుభాశుభానుసంధానమే (మంచిచెడ్డల తలంపే) లేక, రాగద్వేషరహితుఁడై, రాగజనిత మగు ప్రవృత్తియు, ద్వేషజనిత మగు నివృత్తియును లేకయే వర్తించును. అనఁగా, జ్ఞాని ప్రవృత్తినివృత్తులు, రాగద్వేషములు, శుభాశుభానుసంధానము మొదలగు ద్వంద్వవృత్తు లెంత మాత్రమును లేక స్థిరుఁడై యుండును. కేవలముఁ బ్రారబ్ధవశమునఁ బ్రాప్తమగు కృత్యము లందు ప్రవృత్తినివృత్తు లున్నటుల వర్తించినను రాగద్వేషరహితుఁడు గాక చిత్తమందు ప్రవృత్తి నివృత్తులు లేకయే కార్య మాచరించును ॥౮॥

---

శ్లో॥ హాతు మిచ్ఛతి సంసారం రాగీ దుఃఖజిహాసయా,
వీతరాగోహి నిర్దుఃఖ స్తస్మి న్నపి న ఖిద్యతి ॥౯॥

తా॥ రాగి సంసారమందు దుఃఖము కలుగునను తలంపుతో దుఃఖ నివారణమునకై సంసారత్యాగము జేయఁగోరును. వీతరాగుఁడగు జ్ఞానియ న్ననో రాగసంబంధమగు దుఃఖమే లేనివాఁడు (రాగద్వేషములు లేనివాఁడు) గనుక సంసారమందు ప్రవర్తించుచున్నను ఖేద మొందఁడు. (రాగయుతుఁడగువాఁడు దుఃఖభీతిచే సంసారత్యాగము గోరును. గాని యది జ్ఞానము చేతఁగాదు. జ్ఞాని సంసారి యయ్యు రాగద్వేషాదులు లేనివాఁడు కావున సంసారదుఃఖమును బాటింపక సదా చిన్మాత్రుఁడై ఆత్మసుఖము ననుభవించుచుండునని భావము.) ॥౯॥

---

శ్లో॥ యస్యాభిమానో మోక్షేపి దేహేపి మమతా తథా,
న చ జ్ఞానీ నవా యోగీ కేవలం దుఃఖభాగసౌ ॥౧౦॥

తా॥ నేను జ్ఞానిని, త్రికాలవృత్తాంతముల నెఱిఁగినవాఁడను, ముక్తుఁడను, ఇత్యాద్యహంభావముతో మోక్షమందభిమానము గలవాఁడు జ్ఞాని కానేరఁడు. అటులనె, నేను యోగాభ్యాసిని, నాదేహము సకలగుణకర్మసమర్థతఁ గలది, అత్యధికముగ భుజించుటకుఁ గాని యుపవాసము లు సేయుటకుఁ గాని సమర్థుఁడను, ఇత్యాదిదేహాభిమానము గలవాఁడు యోగియుఁ గాఁడు, జ్ఞానియును గాఁడు. దుఃఖహేతువులగు అహంభావమును, మమత్వమును నివృత్తి కానందున నట్టివాఁడు కేవలదుఃఖియే యగును. సర్వవిస్మరణము కలుఁగనివాఁడు జ్ఞాని కానేరడని తాత్పర్యము.) ॥౧౦॥

---

అవ॥— సర్వవిస్మరణోపదేశము నుపసంహరించుచున్నాఁడు.—

శ్లో॥ హరో యద్యుపదేష్టా తే హరిః కమలజోఽపివా,
తథాపి న తవ స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే ॥౧౧॥

తా॥ శిష్యా! బ్రహ్మవిష్ణుమహేశ్వరులు స్వయముగ నీకెంతయు పదేశించినను సర్వవిస్మరణము (సర్వము మరచుట) లేక నీకు స్వాస్థ్యము కలుగదు.

వి— మాయికము లగు దృశ్యపదార్థములందు ఉపేక్షయే 'సర్వ విస్మరణము'. ॥౧౧॥

విశేషోపదేశకము
౧౬-వ ప్రకరణము
సమాప్తము.



౧౭-వ ప్రకరణము

# తత్త్వజ్ఞస్వరూపవింశతికము.

గురు ప్రోక్తము.



అవ॥— జ్ఞానమందెల్లరకు నభిరుచి కలుగుటకై తత్త్వజ్ఞానఫలము ను వివరించుతలంపుతో, తత్త్వజ్ఞాని దశను గురువు ౨౦ శ్లోకములచే స్థ పరచుచున్నాఁడు.—

శ్లో॥ తేన జ్ఞానఫలం ప్రాప్తం యోగాభ్యాసఫలం తథా,
తృప్తః స్వచ్ఛేంద్రియో నిత్య మేకాకీ రమతే తు యః॥

తా ॥ భోగములను గోరక ఆత్మారాముఁడగువాఁడు యోగాభ్యాసఫలమును జ్ఞానఫలమును బొందినవాఁడగును. కనుక నట్టి యాత్మారాముఁడు కల్పితవిషయములను గోరక అద్వితీయుఁడై యానందించును. ॥ ౧ ॥

---

శ్లో॥ న కదాచి జ్జగత్యస్మిన్ తత్వజ్ఞో హంత ఖిద్యతి,
యత ఏకేన తేనేదం పూర్ణం బ్రహ్మాండమండలమ్ ॥ ౨ ॥

తా ॥ ఓయి ప్రియశిష్యా! ఈజగత్తునఁ దత్వజ్ఞుఁడెప్పుడును ఖేద మొందడు. ఏమన నట్టి మహనీయుని (ఆత్మ) వలననే యీబ్రహ్మాండమండల మంతయు వ్యాపింపఁబడియున్నది. ఆయాత్మకంటె ద్వితీయవస్తు వెద్దియును లేదు, కనుక నతనికి ఖేదమే లేదు. (ఆత్మ ఏకమై సర్వపరిపూర్ణమయినది కనుక నట్టి పరిపూర్ణాత్మజ్ఞుఁడగు జ్ఞానియు సర్వపరిపూర్ణుఁడే కనుక నాజ్ఞానికి మోహఖేదహేతువగు ద్వితీయదృష్టియే లేదని భావము.)

---

శ్లో॥ న జాతు విషయాః కేఽపి స్వారామం హర్షయంత్యమీ,
సల్లకీ పల్లవప్రీత మివేభం నింబపల్లవాః ॥ 3 ॥

తా ॥ ఆత్మయందే సదా రమించువాఁడు స్వారాముఁడనఁబడును. అట్టి మహనీయుఁ డింద్రియార్థములఁ గోరనివాఁడు గనుక, ఆత్మసత్తకంటె నితరసత్తలేని తుచ్ఛములగు విషయములవలని సుఖమునకు హర్షింపఁడు. ఎట్లనఁ దీయని యందుగుచిగుళ్లయం దభిరుచిగల గజేంద్రము చేఁదగు వేప

విస్పష్టము గోరని విధమున స్వాత్మారాముఁడగు జ్ఞాని తుచ్ఛములగు విషయసుఖముల కానందింపఁడు. (మా. ప్ర. ౧. శ్లో॥ ౮. మనుష్యలోక దేవలోకానందముకంటె నత్యుత్కృష్టమగు ఆత్మానందమునం దనుభవముగల జ్ఞాని తుచ్ఛములగు విషయసుఖములఁ బరిగణింపఁడు, అని భావము). ॥ 3 ॥

---

శ్లో॥ యస్తు భోగేషు భుక్తేషు న భవత్యధివాసితా,
అభుక్తేషు నిరాకాంక్షీ తాదృశో భవదుర్లభః ॥ ౪ ॥

తా॥ ప్రాప్తభోగము లందాసక్తియు నప్రాప్తభోగములందాకాంక్షయును లేక సర్వదా స్వాత్మానందతృప్తుఁడై విహరించుజ్ఞాని యీ లోకమంచు కోటి కొకఁడైన నుండుట దుర్లభము. ॥౪॥

---

శ్లో॥ బుభుక్షు రిహ సంసారే ముముక్షురపి దృశ్యతే,
భోగమోక్షనిరాకాంక్షీ విరలో హి మహాశయః ॥ ౫ ॥

తా॥ లోకమందంతటు (సాధువులు, యతులు, యోగులు మొదలగు వేషధారులగు) కొందఱశనాపేక్షులై "బుభుక్షువులు" గను, కొందఱు మోక్షాసక్తులై "ముముక్షువులు" గను గనుపింతురు గాని భోగమోక్షములు రెండింటియందును నెట్టికాంక్షయును లేక సర్వదా పరిపూర్ణబ్రహ్మానందనిమగ్నులై చరించు "మహాశయు" లరుదుకదా. ఇచట, "మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే, యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః" (వేలకొలది జనులలో నొకానొకండె జ్ఞానసిద్ధిని సంపాదించుకొనయత్నించును; ప్రయత్నించువారిలో సైత మొకానొకనికే సత్యజ్ఞానము కల్గును) అని గీతావచనము ప్రమాణము. ॥౫॥

శ్లో ‖ ధర్మార్థకామమోక్షేషు జీవితే మరణే తథా,
కస్యాప్యుదారచిత్తస్య హేయోపాదేయతా నహి ‖

తా ‖ పురుషార్థము లగు ధర్మార్థకామమోక్షములందును, జీవిత మరణములందును హేయోపాదేయవృత్తి లేక, అనఁగా ప్రతిమనుజుఁడు ను గోరఁదగిన ధర్మార్థకామజీవితములందాసక్తియు, కోరఁదగని మరణమందు భీతియు లేక వీనియన్నిటియందును సమబుద్ధియు నుపేక్షయుఁ గలిగి, ఆత్మానందభరితుఁడై విహరించు బ్రహ్మజ్ఞాని కోటి కొక్కఁడైన నుండునో యుండఁడో. ‖ ౬ ‖

---

శ్లో ‖ వాంఛా న విశ్వవిలయే న ద్వేషస్తస్యచ స్థితౌ,
యథా జీవికయా తస్మాద్ధన్య ఆస్తే యథాసుఖమ్ ‖౭‖

తా ‖ సర్వప్రపంచమున కధిష్ఠానమగు బ్రహ్మరూపము మాత్రము స్ఫురించునట్టి జ్ఞానికిఁ బ్రపంచవిలయము కావలెనను కోరిక లేదు. ప్రపంచస్థితియందు ద్వేషమును లేదు. అటులఁ గృతకృత్యుఁడగు జ్ఞాని ప్రారబ్ధవశమున సంప్రాప్తము లగు విషయసంబంధదుఃఖాదికములందు నుపేక్షతో సర్వదా ఆత్మసుఖానందపరిపూర్ణుఁడై జీవయాత్ర గడపును. ‖౭‖

---

శ్లో ‖ కృతార్థోఽనేన జ్ఞానేనేత్యేవం గలితధీః కృతీ,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్నాస్తే యథాసుఖం‖

తా ‖ (అట్టిజ్ఞాని) "నేనీయద్వైతాత్మజ్ఞానముచేతనే కృతార్థుఁడనైతిని" అనెడి సంకల్పమయినను లేక, భోజనగమనాదికృత్యములఁ జేయు

చున్నను సర్వదా ఆత్మసుఖానువర్తనుఁడైయే యుండును. అతఁడు కృతార్థుఁడు గనుక నజ్ఞానివలెను, విరక్తుని వలెను బాహ్యేంద్రియవ్యాపారములఁ జేయుచున్నను ఖేద మొందదు. ఇచట "ఉపవిష్టా వ్రజన్ గచ్ఛన్ తన్మయః స్యాత్సమాహితః" అనెడి వచనము ప్రమాణము. (పరమవిజ్ఞాని నడచుట, భుజించుట, కూర్చుండుట మొదలగు బాహ్యేంద్రియక్రియలఁ జేయుచున్నను, అంతరింద్రియవ్యాపారము లేక సర్వదా తన్మయుఁడై ఆత్మానందసుఖమునే పొందుచుండును. దేహసంబంధసుఖదుఃఖముల నెఱుఁగకుండును. అని భావము.) ॥ ౮ ॥

---

శ్లో॥ శూన్యాదృష్టి ర్వృథా చేష్టా వికలానీంద్రియాణిచ,
న స్పృహా న విరక్తి ర్వా క్షీణసంసారసాగరే ॥౯॥

తా॥ సంసారస్పృహయే లేని జ్ఞాని "క్షీణసంసారసాగరుఁ డనఁబడును. అట్టి పురుషునకు విషయస్పృహయే లేదు. అతని మనోవ్యాపారమును దేహసంబంధమగు చేష్టలును బాహ్యాంతరింద్రియవ్యాపారములును, బాలోన్మత్తపిశాచగ్రస్తుల చర్యల వలె శూన్యముగ నుండును. వానిదృష్టియు, మనోవ్యాపారము సంకల్పవికల్పరహితములుగ నుండును. కాయవ్యాపారములు ఫలాపేక్ష లేమిచే వ్యర్థములుగ నుండును. ఇచట "యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ। యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥" అను గీతావచనము ప్రకారము, సమస్తప్రాణులు నవిద్యామూలమగు నవివేకము చేత నజ్ఞానమను చీఁకటిలోఁ బడియున్న సమయమున, స్వస్వరూపసంధానపరుఁడగు జ్ఞాని మేలుకొని యుండును. ప్రాణులకు పగలుగానున్న సమయము బ్రహ్మానుభవశీలునకు రాత్రి యగును. అనఁగా, సర్వకాలసర్వావస్థలయందు దేహాదీంద్రియ

స్పృహయు, ప్రాపంచికస్పృహయును లేక ఆత్మావలోకనస్థితియందుం డుటయే జ్ఞానికి జాగ్రదవస్థ. అజ్ఞానావస్థస్వప్నము. ॥౯॥

---

శ్లో॥ న జాగర్తి న నిద్రాతి నోన్మీలతి న మీలతి,
అహో! పరదశా క్వాపి వర్తతే ముక్తచేతనః ॥

తా॥ అట్టి జ్ఞానికి (సర్వజనసామాన్యమగు) జాగ్రదవస్థ లేదు. బాహ్యవిషయానుసంధానమే లేనందునఁ (ఎచట నేమి జరుగుచున్నదియుం దెలియఁగనందునఁ) గనురెప్పలు మూయుటయు, తెరచుటయు నెఱుంగ డు. నిద్రయును లేదు. సర్వకాలసర్వావస్థలయందు సర్వవిషయములును బ్రహ్మపదార్థములుగనె చూచుచున్నవాఁడు గావున, నిద్రావస్థయందును, జాగ్రదవస్థయందును, నేత్రోన్మీలననిమీలనమందును స్పృహ లేక జడుని వలెను, సున్మత్తుని వలెను వర్తించును. ఆహా! ఇట్టి ముక్తచేతస్కుఁడగు (మనోవ్యాపారము లేని) విజ్ఞాని సర్వదా (లోకసామాన్యము కాని) యుత్కృష్టమగు తురీయాతీతావస్థయందే యుండును. ॥౧౦॥

---

శ్లో॥ సర్వత్ర దృశ్యతే స్వస్థ స్సర్వత్ర విమలాశయః,
సమస్తవాసనాముక్తో ముక్త స్సర్వత్ర రాజతే ॥౧౧॥

తా॥ అట్టి మహాత్ముఁడు సుఖదుఃఖములు ప్రాప్తించినపుడు (చలింపక) స్వస్థచిత్తుఁడై, శత్రులను, మిత్రులను సమానముగఁ జూచుచు, నెట్టివిషయవాసనలు లేక, సర్వావస్థలందును పరిపూర్ణాత్మదర్శియై, జీవన్ముక్తుఁడై విరాజిల్లును. ॥౧౧॥

---

శ్లో॥ పశ్యఞ్ఛృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గృహ్ణన్వదన్వ్రజన్,
ఈహితానీహితైర్ముక్తో ముక్త ఏవ మహాశయః ॥౧౨॥

తా॥ దేహేంద్రియకర్మము లగు చూచుట, వినుట, తాఁకుట, ఆఘ్రాణించుట, భుజించుట మొదలగు ప్రారబ్ధవ్యాపారములు చేయుచున్నను వానియందిచ్ఛాద్వేషములు లేని (వాని స్పృహయే లేని) మహాశయుఁడు, మనోవికారశూన్యుఁడు గనుక నతఁడు ముక్తుఁడే. (మహత్తర మగు ఆత్మయే యాధారముగ నున్నవాఁడు, అనఁగా సర్వదా ఆత్మానుసంధానపరుఁడగువాఁడు మహాశయుఁడనఁబడును.) చూ-గీత-అ౬-శ్లో-9

---

అవ॥— మఱల నీయంశమునే స్పష్టపరచుచున్నాఁడు.—

శ్లో॥ ననిందతి నచ స్తౌతి నహృష్యతి న కుప్యతి,
న దదాతి నగృహ్ణాతి ముక్త స్సర్వత్ర నీరసః ॥౧౩॥

తా॥ అట్టి మహాశయుఁడు నిందాస్తుతులు, మోదఖేదములు, దానప్రతిగ్రహణములును లేక (అనఁగా వీనినిఁ దాఁజేయక నితరులవలనఁ గోరక) నసంగుఁడై సర్వత్ర ముక్తుఁడై విలసిల్లును. ॥౧౩॥

---

అవ॥— మఱియు.—

శ్లో॥ సానురాగాం స్త్రియం దృష్ట్వామృత్యుంవాసముపస్థితం,
అవిహ్వలమనాః స్వస్థో ముక్త ఏవ మహాశయః ॥౧౪॥

తా॥ అట్టి మహాశయుఁడగుజ్ఞాని తనయందనురాగముగల స్త్రీనిఁ

జూచి మోహావశుఁడు కాఁడు; భయంకరమగు మృత్యువు నెదుర నిలిచినను భీతిఁ జెందడు; నిశ్చలచిత్తుఁడగు నిట్టి జ్ఞాని తప్పక ముక్తుఁడే యగును.

---

అవ॥— మఱియును జ్ఞాని నిర్వికారుఁడని యీరు శ్లోకములచే జెప్పుచున్నాఁడు—

శ్లో॥ సుఖేదుఃఖే నరే నార్యాం సంపత్సుచ విపత్సుచ,
విశేషో నైవ ధీరస్య సర్వత్ర సమదర్శినః ॥౧౫॥

తా॥ సర్వవిషయములందును (సర్వవస్తువు లందును) స్వయంప్రకాశపరమాత్మనే చూచుచుండు ధీరుఁడగు జ్ఞాని, సుఖదుఃఖములందు స్త్రీ పురుషులందు, సంపద్విపత్తులందును సమదర్శియై యెట్టివికారమునుబొందక నిశ్చలుఁడై యుండును. ॥౧౫॥

---

శ్లో॥ నహింసా నైవ కారుణ్యం నౌద్ధత్యం నచ దీనతా,
నాశ్చర్యం నైవచ క్షోభః క్షీణసంసరణేఽనరే ॥౧౬॥

తా॥ ఇంద్రియవ్యాపారస్ఫురణమును, తాను నరుఁడనను వ్యక్తియును లేక, సదా ఆత్మానుభవశాలియగు జ్ఞాని పరహింస, కరుణ, ఔద్ధత్యము, దీనత, ఆశ్చర్యము, క్షోభము, నీ మొదలగు (సంతరింద్రియ) వికారముల నొందడు. ॥౧౬॥

---

శ్లో॥ నముక్తో విషయద్వేష్టా నవా విషయలోలుపః,
అసంసక్తమనా నిత్యం ప్రాప్తప్రాప్త ముపాశ్నుతే॥

తా ॥ జీవన్ముక్తునకు విషయములందు ద్వేషముగాని యాసక్తిగాని యుండదు. దేనియందును దగులని మనస్సుతోనే ప్రారబ్ధలబ్ధభోగముల ననుభవించును. ॥ ౧౭ ॥

---

శ్లో॥ సమాధానాసమాధాన హితాహితవికల్పనాః,
శూన్యచిత్తో న జానాతి కైవల్యమివ సంస్థితః ॥ ౧౮ ॥

తా ॥ బాహ్యార్థస్మృతిలేని జ్ఞానికి సమాధానము, విక్షేపము, హితము, అహితము నిత్యాదివివిధకల్పనలు గలుగవు. అట్టి జ్ఞాని విదేహకైవల్యము పొందినవానివలెనె జీవన్ముక్తుఁడై చరించును. ॥౧౮॥

---

శ్లో॥ నిర్మమో నిరహంకారో నకించిదితి నిశ్చితః,
అంతర్గలితసర్వాశః కుర్వన్నపి కరోతి న ॥ ౧౯ ॥

తా ॥ అహంకారమమకారముల విడిచి, అధిష్ఠానాత్మకంటె నితరమెద్దియును లేదను నిశ్చయము గలిగి, దేనినిం గోరని జ్ఞాని యేకృత్యములు సేయుచున్నను, కర్తృత్వాభిమానరహితుఁడగుటచే, నెద్దియుఁ జేయనివాఁడె యగును. ॥ ౧౯ ॥

---

శ్లో ॥ మనఃప్రకాశసంమోహస్వప్నజాడ్యవివర్జితః,
దశాం కామపి సంప్రాప్తో భవే ద్గలితమానసః ॥ ౨౦ ॥

తా ॥ వృత్తిశూన్యమయిన మనస్సు ఆత్మయందు లయించిన జ్ఞాని

శ అనిర్వాచ్యమగు దశ సంప్రాప్తమగును. అంతట నతఁడు మనఃప్రకాశవర్జితుఁడు (మనస్సు లేనివాఁడు) ను, ఇంద్రియవ్యాపారమే గోచరింపని చిత్తము గలిగి యుండుటచేత (మానసముతోపాటు ఇంద్రియవ్యాపారము లేనివాఁడగుటచేత), మిథ్యాకల్పితప్రపంచస్వప్నవర్జితుఁడును, అజ్ఞానసుషుప్తి లేనివాఁడునునై, సర్వదా సత్యనిత్యాత్మదర్శనము గలిగి జాగరూకుఁడయియే యుండును. (ప్రపంచము భ్రమమాత్రమై మిథ్యాకల్పితమగుటచేత, ఆత్మదర్శనము లేని యజ్ఞానదశయే తత్త్వవిచారణమున సుషుప్తి యగుచున్నది. సద్గురుకటాక్షమున "తత్త్వమసీ" త్యాద్యాత్మ విచారణకాలమందు మనోబుద్ధిచిత్తాహంకారములు బూర్తిగ నాత్మయందు లయమగు వఱకు, ప్రపంచస్వప్నము దోఁచుచుండును. అహంకారమమకారములు బూర్తిగ నశించి సర్వవృత్తులతో పాటు మనస్సు, బుద్ధి, చిత్తమును, ఆత్మయందు అయమై మనఃప్రకాశమే లేక సర్వదా బ్రహ్మమం దైక్యమై, తానే బ్రహ్మమై యుండు తురీయావస్థయే జాగ్రదవస్థ యగును: అని భావము). ॥ ౨౦ ॥

తత్త్వజ్ఞస్వరూపవింశతికము

౧౭-వ ప్రకరణము

సమాప్తము



## ౧౮-వ ప్రకరణము

# శాంతిశతకము

### గురుప్రోక్తము



అవ॥---- తత్త్వజ్ఞస్వరూపమును జెప్పి, వీనికన్నిటికిని బ్రధానమగు శాంతలక్షణము నుపదేశింపఁబూని, శాంతిశాలియగు జ్ఞానికి నమస్కరించుచున్నాఁడు----

శ్లో॥ యస్య బోధోదయే తావత్స్వప్నవద్భవతి భ్రమః,
తస్మై సుఖైకరూపాయ నమః శాంతాయ తేజసే॥౧॥

తా॥ ప్రబోధము (ఆత్మజ్ఞానము) కలిగిన తోడనే యదివఱకు నున్న ప్రపంచభ్రమము స్వప్నమువలె తుచ్ఛముగ నెవనికిఁ దోఁచి సంకల్ప వికల్పశూన్యుఁడై, సుఖమాత్రైకస్వరూపుఁడై, స్వప్రకాశమూర్తియై విలసిల్లుచుండునో యట్టి జ్ఞానికి నమస్కారము. ॥౧॥

---

అవ॥---- అయితే ధనికుండును సుఖవంతుఁడుగఁ గనుపించుచున్నాఁడు కదా, అట్టి ధనవంతుఁడును శాంతసంకల్పుఁడైన యెడల నతఁడును సుఖైకరూపుఁడు కాఁడా? అను శంకకు సమాధానము----

శ్లో॥ అర్జయిత్వాఖిలానర్థాన్భోగానాప్నోతి పుష్కలాన్,
నహి సర్వపరిత్యాగమంతరేణ సుఖీ భవేత్ ॥౨॥

తా॥ ధనికుఁడు ధనధాన్యకళత్రాదుల నార్జించి బహువిధభోగ

ము. మాత్రి మనుభవించునే కాని యతఁడు సుఖైకరూపుఁడు కాఁడు. ఏ మనఁగా అధనధాన్యాదికభోగములు క్షీణించిన యెడల వాఁడు దుఃఖము నే పొందును. కావున సర్వసంకల్పవికల్పత్యాగము లేనిచో సుఖైకరూపుఁడు కాఁడు. ఇది నిశ్చయము. ॥ ౨ ॥

అవ॥— వంధ్యాపుత్రశబ్దము తుచ్ఛమును, నసంభవమును గనుక దానిని విడిచినటులె, సంకల్పవికల్పములు (ఆత్మధర్మములు కావు కనుక) తుచ్ఛము లగుటచే వానిని విడుచుటయె పరమార్థము. విడువనిచో సుఖైక రూపము లభ్యము కాదు దీనినే రూపకాలంకారమున విస్పష్టపరచుచున్నాఁడు—

శ్లో॥ కర్తృవ్యదుఃఖమార్తండజ్వాలాదగ్ధాంతరాత్మనః,
కుతః ప్రశమపీయూషధారాసారాదృతే సుఖమ్ ॥3॥

తా॥ చేయఁదలఁచిన పనులఁ జేయవలెననెడి యహంభావమువలనఁ గలుగు సంతాపమే తీవ్రమగు (గ్రీష్మర్తు) మార్తాండజ్వాలయనఁబడును. అట్టి తీవ్రమగు సంతాపజ్వాలవలన దహింపఁబడుచున్న మనస్సుకలవాఁడు సంకల్పవికల్పప్రశమమను నమృతధారలయొక్క జడివానచేఁ దడియకుండ సుఖింపడు. (మనోవ్యాపారమును, జిత్తభ్రాంతియు మొదలంట నశింపకుండ నెవనికిని ఆత్మసుఖము కలుగదని భావము). ॥ 3 ॥

---

అవ॥— సంసారదుఃఖమనెడి విషయమును నివర్తింపఁజేయునది గనుక సంకల్పవికల్పశాంతి అమృతమనఁబడునని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ భవోఽయం భావనామాత్రో న కించిత్పరమార్థతః,
నాస్త్యభావోహిభావానాంభావాభావవిభావినామ్॥ ౪

తా॥ ఈసంసారము సంకల్పమాత్రమునఁ గలుగుచున్నది. పరమార్థముచేత విచారింపఁగా నాత్మయందె కల్పింపఁబడినది కనుక నాత్మాతిరిక్తము కాదు. ఆత్మ భావరూపమయినది కాని యభావస్వరూపము కాదు. అభావస్వరూపమై యుండియుఁ గాలాదివశమున భావస్వరూపమయినది కాకూడదా? యనిన ఉష్ణస్వభావము గల వహ్ని కెన్నడును శీతలస్వభావము కలుగని రీతిగ మనోరాజ్యము వలె భావనామాత్రమున సిద్ధమగుచు సత్స్వభావమగు ప్రపంచము భావనానివృత్తియైనంతనె తానును నివృత్తమగుచున్నది. కాఁబట్టి సంసారతాపాపగమనమునకును, ఆత్మామృతప్రాప్తికిని హేతు వగుటచేత సంకల్పవిలయమే అమృతముగ భావింపఁబడుచున్నది. "వాసుదేవ స్సర్వం" ఇతి భగవద్వచనరీత్యా సర్వప్రపంచమును ఆత్మస్వరూపమే. కాని యది భ్రమమాత్ర మగుటచేత సంకల్పవికల్పమువలన స్వప్నప్రపంచము వలెను, సినీమా తెరమీద గనుపడు యత్యద్భుతలీలల యట్లును సిద్ధమగుచు వ్యామోహమును గలిగించుచున్నది. ఈవ్యామోహమహాంబుధిలోఁ జిక్కినచో జననమరణరూపసంసార మంతకంతకు విజృంభించును. కావున సంసారమూలమగు సంకల్పవికల్పముల నిర్మూలించినఁ గాని భవాబ్ధితరణోపాయమును తద్ద్వారా మోక్షమును గలుగవని తాత్పర్యము. ॥ ४ ॥

---

అవ॥--- సంకల్పము లుపశమించినమాత్రమున, ఆత్మామృతప్రాప్తి కలుగు టెట్లు? అను ప్రశ్న కలుగఁగా నీయాత్మామృతము యొక్క నిత్యప్రాప్తత్వమును జెప్పుచున్నాఁడు.---

శ్లో॥ న దూరం నచ సంకోచా ల్లబ్ధ మేవాత్మనః పదం,
నిర్వికల్పం నిరాయాసం నిర్వికారం నిరంజనమ్ ॥౫॥

తా॥ ఆత్మ సర్వపరిపూర్ణమైనదికనుక దూరముగలేదు. పరిచ్ఛిన్నము కాఁగా నొకదానియందిమిడియున్నదియుఁ గాదు, కాఁబట్టి యాత్మపదము నిత్యప్రాప్తమయ్యేయున్నది. కంఠమందున్న రత్నహారము పోయినదని వెతుకుకొను మూఢునియట్లు అజ్ఞానులు సంకల్పవశగులై యాత్మప్రాప్తింపలేదని తలంతురు. (అనఁగా సంకల్పశూన్యులగు విజ్ఞానుల కాత్మ నిత్యప్రాప్తమయ్యేయున్నది.) ఆత్మపదము నిర్వికల్పము (వికల్పభావముచేఁ పొందశక్యముకానిది); నిరాయాసము (ఎట్టిశ్రమయు లేకయే పొందఁదగినది); నిర్వికారము (వికారరహితమైనది); నిరంజనము (ఉపాధిమల శూన్యమైనది). (సంకల్పవికల్పములు, హఠాదియోగసాధనములు, సంశయాదివిపరీతభావనలు, దేహాభిమానము మొదలగు అహంమమకారములు లేనివారలకు ఆత్మపదము నిత్యప్రాప్తమయేయున్నది. సంకల్పములుకలవారికది కడుదుర్లభము. ఎట్లనఁగా:— మాయాకల్పితము అగుటచేత అసత్తగు దేహేంద్రియాదులె తానని భావించి కామములఁ గోరుచుఁ దనవె యంతటి కంటెను గొప్పవానిగఁ దలచు విద్వాంసుఁడు, వేదాంతశాస్త్రమును బూర్తిగఁ జదివినను శిష్యులచేఁ జదివించినను అహంకారమమకారములు గలిగియున్నందున ముక్తిమార్గమునొందజాలడు. ఇచట, "దేహేన్ద్రియాదావసతిభ్రమోదితాం విద్వా నహంతాం నజహాతియావత్ । తావన్నతస్యాస్తి విముక్తివార్తాఽప్యస్త్వేష వేదాంతనయాంతదర్శీ" ॥ అను శంకరాచార్యవచనము ప్రమాణము). ॥౫॥

---

అవ॥— అయినను నట్టిచిదాత్మ తత్త్వజ్ఞానముచేతనే పొందఁదగినదిగా శాస్త్రము చెప్పుచున్నది. "సిద్ధేఽర్థే సాధనవైయర్థ్యాత్," అను న్యాయముచేత నిత్యప్రాప్తమైయున్న యాత్మ జ్ఞానగమ్యమని చెప్పెడి శా

స్త్రము సంగతమా లేక అసంగతమా యని శంకరాఁగా, అది భ్రాంతి నాశమాత్రముననే ప్రాప్తించునని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ వ్యామోహమాత్రవిరతౌ స్వరూపాదానమాత్రతః,
వీతశోకా విరాజంతే నిరావరణదృష్టయః ॥ ౬ ॥

తా॥ శాస్త్రాభ్యాసమువలనను, గురూపదేశమువలనను గలిగిన విజ్ఞానముచేత ప్రపంచభ్రాంతి, తొలఁగఁగనె ఆత్మవిశ్రాంతిగలిగి తద్బ్రహ్మజ్ఞాని దుఃఖరహితుఁడై సర్వదా స్వభావముచేతనే (ప్రయత్నములేకయే) అద్వితీయపరిపూర్ణాత్మస్వరూపుఁడై విరాజిల్లును (శాస్త్రాభ్యాస గురూపదేశములవలన విజ్ఞానియై, ఆత్మేతరమిథ్యగోచరింపనివాఁడు స్వాభావికముగ పరబ్రహ్మమె తానై విరాజిల్లునని భావము. మఱియు, "అ[illegible] కల్పితనామరూపవ్యపోహాదేవ ప్రయతేతవిద్వాన్ । న బ్రహ్మబోధ తప పోహామాత్రాత్ బ్రహ్మవభాతి స్వయమేవ సాక్షాత్। శైవాలమాత్రాపనయే పిపాసోః కార్యః ప్రయత్నో నతు తోయసిద్ధ్యై । తస్మిన్నపేతే సలిలం విశుద్ధం సిద్ధం విభాతి స్వయమేవ సాక్షాత్॥" ఇతి శ్రీ ఆచార్యమహావాక్యదర్పణవచవరీత్యా శాస్త్రమసంగతము కాదు. శాస్త్రవాసనవలన నవిద్యావరణము తొలఁగఁగ సిద్ధబ్రహ్మము స్వయముగనె స్ఫురించును. జలావరక మగు నాచును దొలఁగింప జలమే స్ఫురించునటుల బ్రహ్మావరకమగు అజ్ఞానమును దొలఁగింప బ్రహ్మమే స్ఫురించును. ॥౬॥

---

అవ॥— ఆత్మజ్ఞానరహస్యమును జెప్పుచున్నాఁడు.—

శ్లో॥ సమస్తం కల్పనామాత్రమాత్మా ముక్తస్సనాతనః,
ఇతి విజ్ఞాయ ధీరోహి కిమభ్యస్యతి బాలవత్ ॥ ౭ ॥

తా ॥ దేహాదిసర్వప్రపంచమును అధిష్ఠానాత్మయందు కల్పితము. ఆత్మ సనాతనము, నిత్యముక్తస్వరూపము, (అనఁగా నాద్యంతములు లేక నిత్యమై దేనితోడను సంగములేనిది). ఇట్లు నిజతత్త్వమును దృఢముగఁ దె లిసికొనిన జ్ఞానికి జ్ఞానహీనుఁడగు బాలునికి వలె నిఁకఁ దెలిసికొనఁ దగిన దెద్దియు నుండదు. ॥ ౭ ॥

---

అవ॥— సమస్తమును గల్పనామాత్రమనెడి జ్ఞానమునకు నిదాన భూతమగు "తత్, త్వం" పదార్థములయొక్క యైక్యజ్ఞానము నుపదే శించుచున్నాఁడు.—

శ్లో ॥ ఆత్మా బ్రహ్మేతి నిశ్చిత్య భావాభావౌ చ కల్పితౌ,
నిష్కామః కిం విజానాతి కిం బ్రూతే చ కరోతి కిమ్॥౮॥

తా॥ "త్వం" పదార్థమగు జీవాత్మ "తత్" పదార్థమగు పరబ్ర హ్మముకంటె వేఱుకాదను దృఢనిశ్చయముగలిగి, అధిష్ఠానాత్మసాక్షా త్కారమునొంది, దృశ్యములగు ఘటాదులును, వీని యభావములును గల్పి తములని నిశ్చయించి, వీనినిఁగోరుటకుఁగారణమగు నవిద్యను దొలఁగించి, నిష్కాముఁడై, సర్వదా ఆత్మారాముఁడై యుండు జ్ఞానికి విశిష్టముగఁ (తనకంటెనన్యముగఁ) దెలియఁదగినదెద్ది? ఎద్దియునులేదు. (సంకల్పవిక ల్పశూన్యుఁడై కర్తృత్వాభిమానములేని నిశ్చలాత్మజ్ఞాని తెలియఁదగినది, చెప్పఁదగినది, చేయఁదగినదియులేక, నిందిర్యస్పృహయేలేక, సర్వదా ఆత్మానుసంధానపరుఁడై పరబ్రహ్మమై విలసిల్లునని భావము). ॥ ౮ ॥

---

అవ॥— ఆత్మయేసర్వమనను జ్ఞానమే సర్వసంకల్పములను దొల గించునని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ అయం సోఽహమయం నాహమితి క్షీణా వికల్పనా,
సర్వమాత్మేతి నిశ్చిత్య తూష్ణీంభూతస్య యోగినః ॥౯॥

తా॥ శ్లో॥ "వృత్తిహీనం మనఃకృత్వా క్షేత్రజ్ఞం పరమాత్మని। ఏకీకృత్య విముచ్యేత ముఖ్యోఽయం యోగ ఉచ్యతే.॥" అర్థము— మనస్సునం దెట్టిసంకల్పములు లేకుండ క్షేత్రజ్ఞుఁడగు జీవునిఁ బరమాత్మయం దైక్యమొనరించుటయే యోగమనఁ బడును. అప్రకారము బాహ్యాభ్యంతర వ్యాపారములన్నియు మఱచి, ఆత్మయే సర్వమునను దృఢానుభవముగల యోగికి వివిధసంకల్పములును దమంత నెక్షీణించును. నేను చేయుచున్నాను. నిన్న టిదినము వ్రతమాచరించినాడను, సోఽహమ్మని నేను ధ్యానించు[illegible], దేవదత్తుఁడనగు నేను నడచుచున్నాను, నేనుకదలుటలేదు, ఇట్ల[illegible] వికల్పములన్నియు నశింప, ఆత్మేతరవృత్తిశూన్యుఁడగువాఁడు పర[illegible]మే తానగునని భావము. ॥ ౯ ॥

---

అవ॥— సంకల్పశూన్యుఁడగు యోగియొక్క స్వరూపమును శ్లోకద్వయముచేఁ జెప్పుచున్నాఁడు—

శ్లో॥ న విక్షేపో నచైకాగ్ర్యం నాతి బోధో నమూఢతా,
న సుఖం నచవా దుఃఖ ముపశాంతస్య యోగినః ॥౧౦॥

తా॥ సంకల్పవికల్పములు లేని యోగికి విక్షేపము (చిత్తచలనము లేక స్పృహ) ఉండదు. ఏకాగ్రత (చిత్తనిరోధము), అతిబోధ (సమాధి), మూఢత (అజ్ఞానము), సుఖము, దుఃఖము మొదలగు వృత్తు లెంతమాత్రమును నుండవు. ఇచట "సకలబుద్ధివృత్తిసాక్షీ, సూక్ష్మాత్మా నస్వతః బోధ ఘను మునకందుఁ గాలుంతు" అనెడి మహాభారతవచనము ప్రమాణ

ము. అస్పందబోధ మనఁగా, ఆత్మబోధయే కాని తదితరస్ఫురణము లే
కుండుట.                                                                    ॥౧౦॥

---

శ్లో॥ స్వారాజ్యే భైక్ష్యవృత్తౌచ లాభాలాభేజనే వనే,
నిర్వికల్పస్వభావస్య న విశేషోఽస్తి యోగినః ॥౧౧॥

తా॥ అట్టి సంకల్పశూన్యుఁడగు యోగికి స్వర్గరాజ్య మబ్బినను భిక్షుకుఁడై ప్రారబ్ధవస్తువు లభించినను, లభింపకున్నను జనసమూహ మందున్నను విజనారణ్యమందున్నను, భేద మెద్దియు లేదు. ॥౧౧॥

---

శ్లో॥ క్వ ధర్మః క్వచవా కామః క్వచార్థః క్వవివేకితా,
ఇదం కృత మిదం నేతి ద్వంద్వై ర్ముక్తస్య యోగినః॥

తా॥ చేసిన దెద్దియో చేయని దేదియో యను ద్వంద్వభావములు లేని యోగికి, అవిద్యాకామసంకల్పాదులు నశించినందున ధర్మార్థకామములు, మోక్షోపాయమునకగు వివేకమునసువీనితోఁ బ్రయోజనము లేదు.౧౨

---

అవ॥— అయితే జీవన్ముక్తుఁడగు యోగికి లోకసంబంధమగు (భోజనాది) క్రియ లెట్లు జరుగు నను శంక రాఁగా ప్రారబ్ధములగు క్రియలయందాతని కాసక్తి లేకున్నను యాయా దేహధర్మములు తమంతట జరుగుచుండునని చెప్పుచున్నాఁడు—

శ్లో॥ కృత్యం కిమపి నైవాస్తి నకాపి హృది రంజనా,
యథా జీవన మేవేహ జీవన్ముక్తస్య యోగినః ॥౧౩॥

తా॥ జీవన్ముక్తుఁడగు యోగికి సంకల్పవశమునఁ జేయఁదగిన కృత్య మెద్దియు లేదు. మనస్సునం దెప్పుడును ద్వేషము గాని, అనురాగము గాని యుండవు. ఏమనఁగా నట్టి రాగాదులకు హేతుభూతమగు అవిద్యయే లేదు. కాఁబట్టి, యజమాని నిద్రించుచున్నను యెద్దు బండిని యజమాని గృహమునకే లాఁగుకొనిపోవునట్లు, జీవన్ముక్తునకు దేహధారణకయిన సర్వక్రియలు నింద్రియములద్వారా నప్రయత్నముగనే జరుగుచుండును. అట్టి ఇంద్రియవ్యాపార మతనికి గోచరింపదు. ॥౧౩॥

---

శ్లో॥ క్వ మోహః క్వచవా విశ్వం క్వతద్ధ్యానం క్వముక్తతా,
సర్వసంకల్పసీమాయాం విశ్రాంతస్య మహాత్మనః॥౧౪॥

తా॥ సర్వసంకల్పములకు మూల మగు మనస్సు ఆత్మయందు లీనమై యుండు యోగికి మోహము, ప్రపంచస్థితి, ధ్యానము, ముక్తత మొదలగువానితో బ్రయోజన మేమియు లేదు. (సూర్యకిరణములు సూర్యునియందే లీనమయినట్లు, అధిష్ఠానాత్మనుండి బహిర్వ్యాప్తము లగు వృత్తులాయాత్మయందే లీనమైనప్పుడిఁక నావృత్తులు పునర్వ్యాప్తి నొందుట కవకాశము లేదు కనుక జీవన్ముక్తుఁడగు మహాశయునకు సంకల్పములు గలుగవని భావము. ॥౧౪॥

---

అవ॥— ఆత్మారాముఁడగు యోగికి ఇంద్రియవ్యాపారలేప ముండదని శ్లోకద్వయముచేఁ జెప్పుచున్నాఁడు—

శ్లో॥ యేన విశ్వమిదం దృష్టం స నాస్తీతి కరోతు వై,
నిర్వాసనః కిం కురుతే పశ్యన్నపి న పశ్యతి ॥౧౫॥

తా ॥ ఘటపటాదిప్రపంచమును జూచి చిత్తమున అఘటాదిసంస్థాతము గలవాఁడొకప్పు డాఘటాదికములు మిథ్యయనిమాత్రము తెలిసికొనును. చూచుచుండియు చూడని, (విషయవ్యాపారస్పృహ లేని) యోగి వాసనాశూన్యుఁడగుట చేత నాతఁడు చేయున దెద్దియు లేదు. (ప్రపంచవాసన గలవానికి విషయసంస్కారముండుటచేత సకృత్తుగ దృశ్యమున శ్యమని మాత్రము తెలియవచ్చును. విషయసంస్కారమే లేకుండుటచేదృశ్యవస్తువుల నెఱుంగకుండు నిర్మలజ్ఞానికి కర్తృభావము సంయితము లేదని భావము.) ॥౧౫॥

---

శ్లో ॥ యేన దృష్టం పరంబ్రహ్మ సోహం బ్రహ్మేతిచింతయేత్,
కిం చింతయతి నిశ్చింతో ద్వితీయం యోనపశ్యతి॥౧౬॥

తా ॥ పరబ్రహ్మతత్త్వము తనకంటె వేఱుగా నున్నట్లు తలంచుముముక్షువు "అహం బ్రహ్మస్మి" అని చింతించును. కాని తనకంటె (ఆత్మకంటె) నితర మేదియును జూడని సర్వచింతారహితుఁడయిన యోగి (ఆరూఢుఁడు) దేనినిఁ జింతింపడు. అద్వితీయాత్మానుభవశాలి (యోగారూఢుఁడు) యగు జ్ఞానికి బ్రహ్మవిషయకచింతనము సైతము లేదని భావము. ॥౧౬॥

---

అవ॥— జ్ఞానికి చిత్తనిరోధము సైతము లేదని చెప్పుచున్నాఁడు—

శ్లో ॥ దృష్టో యేనాత్మవిక్షేపో నిరోధం కురుతేత్వసౌ,
ఉదారస్తు న విక్షిప్తః సాధ్యాభావా త్కరోతికిమ్॥౧౭॥

తా ॥ చింతాదిభ్రమరూపమగు ఆత్మవిక్షేపము (ఆత్మచలనము)

కాటుచుండువాఁడు విక్షేపపరిహారము కొఱకు చిత్తనిరోధము చేయును. అద్వితీయాత్మనే సర్వత్ర జూచుచుండు పూర్ణజ్ఞానికి విక్షేపమే లేదు. కావున నట్టివానికి విక్షేపపరిహారమున కయిన సమాధియు నక్కఱలేదు. (విక్షేపము=స్పందము-చలనము) ॥౧౭॥

---

అవ॥— ఈయర్థమునే స్ఫుటపరచుచున్నాఁడు—

శ్లో॥ ధీరో లోకవిపర్యస్తో వర్తమానోఽపి లోకవత్,
న సమాధిం న విక్షేపం న లేపం స్వస్య పశ్యతి ॥౧౮॥

తా॥ సర్వదా చిన్మాత్రదర్శియై యద్వితీయాత్మవిశ్రాంతుఁడగు ధీరుఁడు, అనఁగా పరమాత్మయందు దనలక్ష్యమున్నట్టుసయితము స్ఫురణము లేకుండ సతతాత్మారాముఁడగు యోగి లోకవాసనలేనివాఁడై, లోకసామాన్యము వలె ప్రారబ్ధవశమగు గమనభోజనాదిశారీరికకృత్యములఁ జేయుచున్నను, నట్టి వ్యవహారస్ఫురణమే లేక యుండును. అట్టి మహాత్మునకు సమాధి, విక్షేపము, మొదలగునవి లేవు. (లేపమనఁగా కర్తృత్వాభిమానము) ॥౧౮॥

---

అవ॥— కర్తృత్వాభిమానము లేని యోగిని ఇంద్రియవ్యాపారము లంటవని చెప్పుచున్నాఁడు—

శ్లో॥ భావాభావవిహీనో యస్తృప్తో నిర్వాసనో బుధః,
నైవ కించిత్కృతం తేన లోకదృష్ట్యా వికుర్వతా॥౧౯

తా॥ స్వాత్మానుభవతృప్తుఁడై సంకల్పవికల్పములులేక, దేహేంద్రియాది వాసనాశూన్యుఁడైయుండుమహానీయుఁడు కర్తృత్వాధ్యాసమే

లేనివాఁడు గనుక, లోకదృష్టికి నందఱివలె వ్యవహరించుచున్నను, వ్యవహరింపనివాఁడే యగును. అకర్తృత్వాత్మజ్ఞానియగుటచేఁ గర్తృత్వాధ్యాసమే లేదని భావము. ॥౧౯॥

అవ॥— దీనినే విస్పష్టపరచుచున్నాఁడు—

శ్లో॥ ప్రవృత్తౌ వా నివృత్తౌ వా నైవ ధీరస్య దుర్గ్రహః,
యదాయత్కర్తుమాయాతి తత్కృత్వాతిష్ఠతస్సుఖం ॥

తా॥ ధీరునకు అనఁగా, ఆత్మవిశ్రాంతుఁడగు యోగికిఁ బ్రవృత్తియందు గాని, నివృత్తియందు గాని (అనఁగా, ప్రారబ్ధవశము లగు కృత్యములు సేయుచుండునపుడు గాని, చేయక యూరకుండినపుడు గాని) కర్తృత్వాధ్యాసము లేదు. ఏది చేయుచున్నను చేయక యూరకుండినను నప్రయత్నముగనే యాయా పనులు జరుగుచుండ వానియందెట్టి స్పృహయులేక చిదానందపరిపూర్ణుఁడై విరాజిల్లును. కర్తృత్వాభిమానము లేని జ్ఞానిచేయు కార్యములు చేయనివే యగును.

వి— ఈ మహాద్భుతశరీరయంత్రములోపల సర్వదా (జాగ్రత్స్వప్నసుషుప్తులందు) జరుగుచుండు వ్యాపారము బాహ్యమున కెంతమాత్రము గోచరము గాకుండ నెట్లు జరుగుచుండునో అదియే విధమున ఆత్మానందమగ్నుఁడగు యోగికి బాహ్యవ్యాపారము కర్తృత్వాధ్యాసము లేకయే జరుగుచుండును. ॥౨౦॥

---

అవ॥— జ్ఞాని వాసనారహితుఁడేయైన యెడల నెవని ప్రేరణము చేత నాయా కార్యములు జరుగును? అను ప్రశ్న కుత్తరము—

శ్లో॥ నిర్వాసనో నిరాలంబః స్వచ్ఛందో ముక్తబంధనః,
క్షిప్తస్సంస్కారవాతేన చేష్టతే శుష్కపర్ణవత్ ॥

తా॥ వాసనాశూన్యుఁడు (సంకల్పవికల్పములు లేనివాఁడు), కర్తృత్వానుసంధానరహితుఁడు, రాగద్వేషరహితుఁడు, బంధకారణాజ్ఞానహీనుఁడు నగు జ్ఞాని పూర్వసంస్కారమను వాయువుచే నవశముగఁ ప్రేరితుఁడై యెండుటాకు గాలికిఁ జలించువిధమున వ్యవహరించును. ("ప్రారబ్ధకర్మణాం భోగాదేవ క్షయః" అనుభవింపక జ్ఞానమాత్రమునఁ బ్రారబ్ధము నశింపదు గనుక జ్ఞాని కర్తృత్వానుసంధానము లేకయే వ్యవహరించునని భావము) ॥ ౨౧ ॥

---

అవ॥--- సంకల్పాదిశూన్యుఁడగు జ్ఞాని నిత్యసంతుష్టుఁడని చెప్పుచున్నాఁడు---

శ్లో॥ అసంసారస్యతు క్వాపి న హర్షో నవిషాదితా,
స శీతలమనా నిత్యం విదేహ ఇవ రాజతే ॥ ౨౨ ॥

తా॥ "నవిద్యతే సంసారస్య హేతుః సంకల్పో యస్య తస్య అసంసారః" సంసారహేతు వగు సంకల్పములు లేనివాఁడు "అసంసారి" యనఁబడును. అట్టి యసంసారి యగు జ్ఞాని కెప్పుడును శోకహర్షాదివిక్షేపములు కలుగవు. గనుక నట్టి జ్ఞాని శాంతచిత్తుఁడై షడూర్మిరహితుఁడగు శివస్వరూపుఁడై విలసిల్లును. శ్లో॥ "జరామృత్యూ దేహధర్మౌ శోకమోహౌతు మానసౌ, క్షుత్పిపాసే ప్రాణధర్మౌ షడూర్మిరహిత శ్శివః॥" అనఁగా దేహధర్మము లగు జరామరణములు, మనోధర్మము లగు శోకమోహములు, ప్రాణధర్మము లగు క్షుత్పిపాసలు నను నీయాఱును షడూర్మ

బు. తేషమూర్మ్ములు లేనివాఁడు పరశివ్రుఁడు. శాంతుఁడగు జ్ఞాని జీవన్ముక్తుఁడై అనర్థహేతువగు నజ్ఞానము లేనివాఁడై విరాజిల్లును.

వి— ఇట 'శివః' అనఁగా పరమాత్మయని యర్థము. శివం కల్యాణం తద్యోగా చ్ఛివః; శామ్యతి పరమానందరూపత్వా న్నిర్వికారో భవతీతి శివః; శేతే సజ్జనమనస్స్వితి శివః; శివప్రదత్వా చ్ఛివః; ఇత్యాదివ్యుత్పత్త్యర్థమును బట్టి పరమాత్మ (పరబ్రహ్మము). ॥౨౨॥

---

శ్లో॥ కుత్రాపి న జిహాసాస్తి నాశో వాపి న కుత్రచిత్,
ఆత్మారామస్య ధీరస్య శీతలాచ్ఛతరాత్మనః ॥౨౩॥

తా॥ సంతతాత్మారాముఁడై నిశ్చలచిత్తుఁడగు జ్ఞాని ధీరుఁడనఁబడు. అట్టివాఁడత్యంతనిర్మలమనస్కుఁడగుటచే "శీతలాచ్ఛతరాత్మ" (శాంతసత్వప్రధాను) డనఁబడును. అట్టిజ్ఞానికి రాగద్వేషములు లేవు గనుక వానికి జిహాసయును లేదు. అనఁగా, దేహాధారణమందాశ గాని, దేహనాశనమునలన భీతిగాని కలుగవు. అనర్థహేతువగు అజ్ఞానమే లేనందున నతఁడు నిస్తరంగనిర్మలోదధివలె సంతతానందస్వరూపుఁడై విలసిల్లుచుండును.

---

శ్లో॥ ప్రకృత్యా శూన్యచిత్తస్య కుర్వతోఽస్య యదృచ్ఛయా,
ప్రాకృతస్యేవ ధీరస్య నమానో నావమానితా ॥౨౪॥

తా॥ స్వభావసిద్ధముగ (ప్రయత్నము లేకుండనె) చిత్తవికారరహితుఁడు, ఆత్మవిశ్రాంతుఁడు నగు ధీరుఁడు (జ్ఞాని) పామరునట్లు ప్రారబ్ధవశమగు కృత్యము లందు వర్తించినను వానికి మనమున మానావమానానుసంధానమే యుండదు. ॥౨౪॥

---

శ్లో ॥ కృతం దేహేన కర్మేదం న మయా శుద్ధరూపిణా,
ఇతి చింతానురోధీ యః కుర్వన్నపి కరోతి న ॥ ౭౫ ॥

తా ॥ దశేంద్రియసహితమగు దేహము చేయు పనులందు కర్తృత్వ మించుకయును లేక, సాక్షిమాత్రుఁడుగ నుండి నిరంతరము పరిశుద్ధాత్మానుసంధానపరుఁడగు జ్ఞాని యేపనిఁజేయుచున్నను చేయనివాఁడే యగును. ॥౭౫॥

శ్లో ॥ అతద్వాదీవ కురుతే న భవేదపి బాలిశః,
జీవన్ముక్తస్సుఖీ శ్రీమాన్ సంసరన్నపి శోభతే ॥ ౭౬ ॥

తా ॥ జీవన్ముక్తుఁడగు జ్ఞాని నేనీకార్యమును జేయుచున్నా ననెడి సంకల్పము లేకయే యెద్దియేనిం జేయును. ప్రారబ్ధవశమున నటులఁ జేసినను జిత్తమందు సంకల్పములు లేనివాఁడు కనుక మూర్ఖుఁడు కాఁడు. అట్టి మహాశయుఁడు సంసారవ్యవహారమందున్నను ఆసంసారదుఃఖముల నంటక యాత్మసుఖమునే యనుభవించుచుండును. కాఁబట్టి యతఁడు సంతతమును సుప్రసన్నుఁడై స్వప్రకాశమున దీపించుచుండును. ॥౭౬॥

శ్లో ॥ నానావిచారసుశ్రాంతో ధీరో విశ్రాంతి మాగతః,
న కల్పతే న జానాతి న శృణోతి న పశ్యతి ॥ ౭౭ ॥

తా ॥ ద్వైతవిచారము వలన శ్రమఁజెందుటచే నలసి నివృత్తుఁడగు జ్ఞాని ఆత్మయందే విశ్రాంతిఁ జెందియుండుటచేత సంకల్పాదిక మనోవికారముల నొందఁడు. కర్తృత్వాభిమానము లేనివాఁడగుటచేత నాతనికి బుద్ధివ్యాపారమును, శ్రవణనయనేంద్రియవ్యాపారములును లేవు. (మ

నోబుద్ధిచిత్తాహంకారము లాత్మయందే లీనమై యుండుసుకనుక బాహ్యాంతరేంద్రియవ్యాపారముల నెఱుంగకుండునని భావము.) ॥౨౩॥

---

శ్లో॥ అసమాధే రవిక్షేపా న్న ముముక్షు ర్నచేతరః,
నిశ్చిత్య కల్పితం పశ్య న్బ్రహ్మైవాస్తే మహాశయః॥౨౪॥

తా॥ జ్ఞాని ముముక్షువు (మోక్షాసక్తుఁడు) కాఁడు. ద్వైతభ్రమయే లేనివాఁడు కావున జ్ఞానము కొఱకు సమాధిమొదలగు క్రియల నవలంబింపఁడు. అయితే జ్ఞాని యింక నెట్టివాఁడందువేని వినుము. ఆత్మేతరమంతయుఁ గల్పితమని యిదివఱకే స్పష్టనిశ్చితుఁడు గనుక, (బాహ్యమునకు దగ్ధపటన్యాయముగ సంసారివలె గనుపించినను) నిర్వికారచిత్తుఁడయిన యమ్మహాశయుఁడు కేవలపరబ్రహ్మమై విరాజిల్లును.

వి—జ్ఞాని యనఁగా తత్త్వజ్ఞానమందు దృఢానుభవము గలవాఁడు, ముక్తుఁడు. ముముక్షు వనఁగా ముక్తికొఱకు యత్నించువాఁడు.౨౪.

---

అవ॥— సంసారియై వర్తించువాఁడు పరబ్రహ్మ మెట్లగుననుశంక రాఁగా అహంకారాభావమే యచటఁ గారణమని చెప్పుచున్నాఁడు—

శ్లో॥ యస్యాంత స్స్యా దహంకారో నకరోతి కరోతి సః,
నిరహంకారధీరేణ నకించి దకృతం కృతమ్ ॥౨౫॥

తా॥ ఎవని యంతఃకరణమందహంకారాధ్యాస ముండునో వాఁడు లోకదృష్టికి నేమియుఁ జేయనివానివలె గన్పించినను 'నేనేమియుఁ జేయను' అనెడి సంకల్పముతో కర్తృత్వాధ్యాసము గలిగియుండుటచేతఁ

గర్త్రమే యగును. కర్తృత్వాభ్యాసమే లేని ధీరుండు లోకదృష్టికి నాచరితకార్యుండయ్యును, నంతరంగమునం గార్యాచరణదృష్టి లేనివాండగుట చేత నాతండేది చేసినను జేయనివాండే యగును. ఇచట, 'యస్య నాహం కృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే । హత్వాపి స ఇమాం ల్లోకా న్నహంన్తి న నిబధ్యతే' అను గీతావచనము ప్రమాణము. ॥౨౯॥

---

అవ॥— [illegible] యును శ్లోకద్వయముచే వర్ణించుచున్నాండు.—

**శ్లో॥ నోద్విగ్నం న చ సంతుష్ట మకర్తృస్పందవర్జితమ్,**
**నిరాశం గతసందేహం చిత్తం ముక్తస్య రాజతే ॥ ౩౦ ॥**

తా॥ ముక్తునియొక్క చిత్తము కేవలప్రకాశమాత్రమై రాజిల్లును. ఏమనంగా, నతనికి చిత్తోద్వేగకారణమగు ద్వేషభావము గాని, సంతోషకారణమగు అనురాగముగాని లేవు. మఱియు, సంకల్పవికల్పశూన్యమగుట చేత చిత్తస్పందమును లేదు. అందువలన నెట్టి యాశయును లేదు. సందేహకారణమగు అజ్ఞానమే లేనందున నతని కెట్టి సంశయమును లేదు. ॥౩౦॥

---

**శ్లో॥ నిర్ధ్యాతుం చేష్టితుం వాపి యచ్చిత్తం న ప్రవర్తతే,**
**నిర్నిమిత్త మిదం కింతు నిర్ధ్యాయతి విచేష్టతే॥**

తా॥ జ్ఞాని నిష్క్రియుండై యూరకుండినను, బాహ్యవ్యాపారము సేయుచున్నను వాని చిత్త మెల్లపుడు సంకల్పశూన్యముగ యుండును. మఱియు నట్టి జ్ఞాని యెట్టి సంకల్పము లేకయే యొకప్పుడు నిశ్చలస్వరూపుండై యుండును, ఒకప్పుడేవేని చేష్టలు సేయుచుండును, ॥౩౧॥

---

అవ॥— ఇట్లు జ్ఞానికిని నజ్ఞానికిని నుండు విశేషములు చెప్పి, జ్ఞాని విషయమై యింకను విరళముగఁ జెప్పుచున్నాఁడు---

శ్లో॥ తత్త్వంయథార్థ మాకర్ణ్య మందః ప్రాప్నోతి మూఢతాం,
అథవా యాతి సంకోచ మమూఢః కోపి మూఢవత్ ॥

తా॥ అజ్ఞాని 'తత్, త్వం' పదార్థైక్యమును సద్గురువు వలన వినియును అసంభావనవిపరీతభావనలు వలన (చెప్పినదానిని సరిగా తెలిసికొనకయు, వ్యతిరేకార్థముల జేసికొనియును) నవివేకము నొందును. లేదా శాస్త్రార్థసాక్షాత్కారము కొఱకు చిత్తనిరోధము జేయును. అనేకసహస్రజనులలో నొకానొకమహాశయుఁడు మాత్రి మాంతర్యమునఁ బరిపూర్ణాత్మానుభవశాలియై బాహ్యమునకు మూఢుని వలె వర్తించును.

తత్=పరబ్రహ్మము, త్వం=ఆత్మ, రెండును నొకటియే గాన నభేదము. చూ. ప్ర. ౮, శ్లో॥. 3-౨.

అసంభావన యనఁగా గురువు చెప్పినది యగునో కాదో అనుకొనుట. విపరీతభావనయన, [illegible] యీదేహము నాత్మయే యనుకొనుట మొదలగు గురూపదేశ[illegible]లకు విపరీతార్థముల జేసికొనుట.

---

అవ॥--- "అథవా యాతి సంకోచం" అని పైశ్లోకమందు జెప్పియున్నాఁడు కనుక, ఏకాగ్రతకై చిత్తనిరోధము సయితము దూష్యమని చెప్పుచున్నాఁడు—

శ్లో॥ ఏకాగ్రతా నిరోధో వా మూఢై రభ్యస్యతే భృశమ్,
ధీరాః కృత్యం న పశ్యంతి సుప్తవత్స్వపదే స్థితాః ॥

తా॥ ఇతరధ్యాన మెద్దియును లేకుండ లక్ష్యము నొక్కదానినే

ధ్యానించుట 'ఏకాగ్రత' యనఁబడును. ఇట్టి యేకాగ్రత గాని, చిత్తని
రోధము గాని, ఆత్మసాక్షాత్కారము కలుగని యజ్ఞానులు విపరీతభావనలు
కలుగకుండుట కొఱకు శ్రద్ధతో నభ్యసింతురు. దేహాత్మధీరహితులగు (దే
హమే నేననెడి విపరీతభావన లేని) విజ్ఞానులు స్వస్వరూపానుసంధానరూ
ఢులై యట్టి యేకాగ్రత చిత్తనిరోధము మొదలగు సాధనములకొఱకు య
త్నించరు. అద్వైతానందాత్మసాక్షాత్కారము నొందిన విజ్ఞానికట్టి య
సంభావనయు, విపరీతభావనయుఁ గలుగక స్వస్వరూపప్రకాశము మా
త్రమే స్ఫురించుచుండును. ॥33॥

---

అవ॥--- చిత్తనిరోధము వలనఁ బ్రయోజన మేమియుఁ లేదని చె
ప్పుచున్నాఁడు---

**శ్లో॥ అప్రయత్నాత్ప్రయత్నాద్వా మూఢో నాప్నోతి నిర్వృతిం,**
**తత్త్వనిశ్చయమాత్రేణ ప్రాజ్ఞో భవతి నిర్వృతః ॥34॥**

తా॥ బ్రహ్మాత్మైక్యనిశ్చయము లేని మూఢుఁడు చిత్తనిరోధము వ
లనఁ గాని, కర్మానుష్ఠానము వలనఁ గాని పరమసుఖము నొందజాలడు.
ఏమన నతని కానందహేతువగు ఆత్మానందానుభవము లేదు. ప్రజ్ఞాని స
మాధియు జపము నక్కరలేకుండ తత్త్వనిశ్చయమాత్రముననే (తత్ త్వంప
దార్థాభేదజ్ఞానము చేతనే) దుఃఖహేతువగు నజ్ఞానము నశింప నతఁడాత్మా
నందానుభవశాలియై కృతార్థుఁడగును. (తత్ త్వం పదములకు ఈశ్వరుఁ
డు, జీవుడును వాచ్యార్థములు. ఈశ్వరజీవు లనెడి ఉపాధిద్వయ మందు
న్న శుద్ధచైతన్య మొకటియే లక్ష్యార్థము. సర్వజ్ఞుఁడగు నీశ్వరునితో కించి
జ్ఞుఁడగు జీవున కైక్యము సంభవింపదు కనుక, ఈవిరోధపరిహారమునకై భా

గత్యాగలక్షణచే నుపాధిరహితమగు చైతన్యమాత్రమై గ్రహించుటవల్ల తత్త్వంపదార్థముల కభేదజ్ఞానము స్ఫురించును. (చూ. తా. ప్ర-౧౫ శ్లో- ౭) ॥ ౩౮ ॥

అవ॥— మూఢునకు యోగాభ్యాసమువలన ఆత్మానుభవము కలుగదా? యను శంకకుత్తరము—

శ్లో ॥ శుద్ధంబుద్ధం ప్రియంపూర్ణం నిఃప్రపంచం నిరామయమ్,
ఆత్మానం తం నజానంతి తత్రాభ్యాసపరా జనాః ॥౩౯॥

తా॥ ప్రపంచమందు హఠాదియోగాభ్యాసమువలనను, ఖేచరీశాంభవీత్యాది ముద్రాలక్ష్యములవలనను, చిత్తనిరోధముజేసి తద్ద్వారా ఆత్మానుభవమొందయత్నించు మూఢులెప్పటికిని తత్త్వజ్ఞానమును బొందలేక, మాయామలాతీతము, స్వప్రకాశవిలసితము, సర్వపరిపూర్ణము, ప్రపంచాతీతము, సకలసంసారదుఃఖరహితము, నిరామయము, బోధమాత్రమునైయుండు స్వస్వరూపమైనాత్మను దెలియంజాలరు.

వి॰— చిత్తశుద్ధిలేనివారలకు బ్రహ్మనిష్ఠ కలుగదుగనుక, అట్టివారలకు పూర్వదశయందు చిత్తశుద్ధి కలుగువఱకు, హఠాదియోగాభ్యాసము, ధ్యానధారణసమాధులును అవసరమేయగును. కాని, పూర్వజన్మసంస్కారవశమున చిత్తపరిపక్వముగలమానవులకు విశేషప్రయత్నమక్కఱలేకయే గురూపదేశమాత్రమున,

"చెలువుగఁ బువ్వులు జేరుటకంటెన్,
పొలుపుగఁ గన్గవ మూయుటకంటెన్,
నలువుగ నీ యమనస్కపదంబే,
సులభము సౌఖ్యము నూత్నము వత్సా!"

అని సీతారామాంజనేయసంవాదములోఁ జెప్పఁబడినవిధమున సులభము

గాని తత్త్వజ్ఞానము కలుగును. నిరక్షరకుక్షులగు వారలలో సయితము బ్రహ్మ విదులుండుటకు గారణమిదియే! ॥౩౫॥

---

అవ॥— దీనినే యింకను స్పష్టముగఁ జెప్పుచున్నాఁడు—

శ్లో ॥ నాప్నోతికర్మణా మోక్షంవిమూఢోఽభ్యాసరూపిణా,
ధన్యోవిజ్ఞానమాత్రేణ ముక్తస్తిష్ఠత్యవిక్రియః ॥ ౩౬ ॥

తా॥ "నకర్మణా నప్రజయా నధనేన" ఇతి శ్రుతివచనరీత్యా యోగాభ్యాసాదికర్మములచేత మూఢుఁడు మోక్షము నొందఁజాలడు. (పునర్జన్మకారణములగు పృథివ్యాదిపంచభూతములతోఁ గూడియుండు) అవిద్యాకామకర్మముల (చూ॰ ప్ర. ౧, శ్లో. ౧౦) నిర్మూలించినధన్యుఁ డాత్మవిజ్ఞానమాత్రముననె ముక్తినొందును. ॥ ౩౬ ॥

---

అవ॥— ముముక్షువు (ముక్తినొందనిచ్ఛఁగలవాఁడు) సయితము మూఢుఁడేకనుక ముక్తినొందఁజాలఁడని చెప్పుచున్నాఁడు.—

శ్లో ॥ మూఢో నాప్నోతి తద్బ్రహ్మయతో భవితుమిచ్ఛతి,
అనిచ్ఛన్నపి ధీరోహి పరబ్రహ్మస్వరూపభాక్ ॥౩౭॥

తా॥ అజ్ఞానిచిత్తనిరోధాదులవలననే బ్రహ్మత్వము నొందఁ గోరును. కాని బ్రహ్మపథము (మోక్షము) నొందఁజాలడు. జ్ఞాని మోక్షేచ్ఛలేకయే నిశ్చయముగ నతఁడు పరబ్రహ్మస్వరూపుఁడగును. అంతఃకరణసహితుఁడు జీవుఁడు, అట్టి యంతఃకరణరూపావరణ (వ్యవధాన) మే లేనివాఁడై

సర్వభావనాశూన్యుఁడైన యాత్మజ్ఞాని వ్యవధానరహితముగ బ్రహ్మమే యగును. ఇచట, "అంతఃకరణసాహిత్యరాహిత్యాభ్యాం విశిష్యతే । ఉపాధిర్జీవభావస్యబ్రహ్మతాయాశ్చ నాన్యథా," యనెడి శ్రీవిద్యారణ్యముని వచనమును, "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి," యనుశ్రుతియుం బ్రమాణములు. (స్వభావముచేత బహిర్వ్యాప్తిగల దీపకిరణములు దీపమందేలయమై నిశ్చలమై యుండురీతి సర్వదా బహిర్వ్యాపారమే నైజముగగలవృత్తులన్నియును, ఆత్మయందేలయమైనపుడు చిదానందైకమాత్రుండగు మహాశయుఁడుదక్క తదితరుఁడు ముక్తుఁడు కాఁడని భావము). ॥ ౩౪ ॥

---

అవ॥— మఱలఁ దీనినే స్పష్టపరచుచున్నాఁడు—

శ్లో॥ నిరాధారాగ్రహవ్యగ్రా మూఢా స్సంసారపోషకాః,
ఏతస్యానర్థమూలస్య మూలచ్ఛేదః కృతో బుధైః ॥

తా॥ తత్త్వజ్ఞానహీనులగు మూఢులు సదవలంబనము లేనివారలై, కేవలముఁ జిత్తనిరోధము వలననే మోక్షము నొందెద మను దురాగ్రహగ్రస్తులై జననమరణరూపసంసారవృక్షనిర్మూలనసాధనమగు జ్ఞానఖడ్గముం బడయఁజాలక యాసంసారవృక్షమునే పెంచుచుందురు. జ్ఞానులీసంసారవృక్షమూలమును జ్ఞానఖడ్గముచే ఛేదించి ముక్తి నొందుదురు. అజ్ఞానము జననమరణరూపసంసారవృక్షమునకు మూలము కనుక, దానిని మొదలంట నిర్మూలించుటయె మోక్షమని భావము. ॥౩౫॥

---

అవ॥—మఱియు—

శ్లో॥ న శాంతిం లభతే మూఢో యతః శ్శమితు మిచ్ఛతి,
ధీర స్తత్త్వం వినిశ్చిత్య సర్వదా శాంతమానసః॥౩౬॥

తా॥ అజ్ఞాని (ఆత్మతత్త్వమెఱుంగనివాఁడు) చిత్తనిరోధాదుల వల ననే శాంతి నొందఁగోరును. కాని యతనికి శాంతికలుగదు. విజ్ఞాని ఆత్మ విశ్రాంతుఁడై యజ్ఞానము దొలఁగినవాఁడగుటచేత శాంతి నొందవలెనను కోరికలేకయే స్వభావము చేతనే సర్వదా శాంతమానసుఁడగును. (ఇచట శాంతియన సకలమనోవృత్తులును ఆత్మయందు లయముఁ జేసి యాత్మవి శ్రాంతుఁడగుట యని భావము). ॥౩౯॥

---

అవ॥— మఱియు—

శ్లో॥ క్వాత్మనో దర్శనం తస్య యద్దృష్ట మవలంబతే,
ధీరా స్తం తం నపశ్యంతి పశ్యంత్యాత్మానమవ్యయం॥

తా॥ కంటి కగపడు వస్తువుల నాస్థతోఁ జూచువానికి నింద్రి యవ్యాపారము కలిగియుండుటచేత ఆత్మదర్శనము కానేరదు. జ్ఞాని క న్నునో యిది చీఁకటి యిది వెలుతురు ననెడి దృశ్యపదార్థ మెద్దియుం గ నుపడదు. అట్టి విజ్ఞాని సర్వదా చిద్రూపాత్మనే చూచుచుండును. (దృ శ్యప్రపంచము గోచరించువాఁడాత్మజ్ఞాన మెరుఁగడు. ఆత్మజ్ఞాని దృశ్య ప్రపంచము నెఱుఁగడని భావము). ॥౪౦॥

---

శ్లో॥ క్వ నిరోధో విమూఢస్య యో నిర్బంధం కరోతివై,
స్వారామస్యైవ ధీరస్య సర్వదాఽసావకృత్రిమః॥౪౧॥

తా॥ శుష్క—చిత్తనిరోధము వలన సమాధినిర్బంధము గలిగించు కొను మూఢునకుఁ జిత్తనిరోధమే కలుగదు. ఏమన సమాధినుండి చలింపఁ గనే యెప్పటి యట్లతనికిఁ జిత్తప్రసారము (ప్రపంచజ్ఞానము) కలుగుచు

న్నది. ప్రయత్నపూర్వక మగు చిత్తనిరోధము, సమాధియు నజ్ఞానకృత్యములే యగును. ఆత్మారాముఁడగు నిశ్చలచిత్తునకు సర్వదా యప్రయత్నముగనె చిత్తనిరోధము కలుగును. సర్వదా స్వాత్మానుభవశాలియగు మహాశయునకుఁ జిత్తచలనమే లేకుండుటచేత సమాధియుఁ జిత్తనిరోధమును స్వాభావికము లగును. ||౪౧||

---

శ్లో|| భావస్య భావకః కశ్చి న్నకించిద్భావకోఽపరః,
ఉభయాభావకః కశ్చి దేవ మేవ నిరాకులః ||౪౨||

తా|| కొందఱు తార్కికాదులు భావరూపప్రపంచము మిథ్యయైనను గారణపరమాణువులు సత్యమగుటవలనఁ బ్రపంచము మిథ్యకాదని చెప్పుదురు. శూన్యవాదులగు బౌద్ధులు "సర్వం క్షణికం క్షణికం" అనఁగా నంతయు రెండవక్షణమందుండదు గనుక సర్వమును శూన్యమని చెప్పుదురు. కాని సహస్రజనులలో ఆత్మానుభవశాలియగు నొక జ్ఞానిమాత్రము యీభావవాదమును శూన్యవాదమును నిరాకరించి స్వస్థచిత్తుఁడు, సర్వసాక్షియు, స్వయంప్రకాశమానుండునై యుండును. (వేదాంతవిజ్ఞానసునిశ్చితాత్ముఁడగు జ్ఞాని సర్వమతముల నిరాకరించి కేవల సచ్చిదానంద పరబ్రహ్మమయి విరాజిల్లునని భావము). ||౪౨||

---

అవ||— "ఆత్మసంస్థం మనఃకృత్వా, నకించిదపి చింతయేత్" (మనస్సును ఆత్మయందుఁ జొప్పించి యితరము దేనిని జింతింపఁదగదు) అను భగవద్వచనసిద్ధాంతమును ధృవపరచుచున్నాఁడు.—

శ్లో|| శుద్ధ మద్వయ మాత్మానం భావయంతి కుబుద్ధయః,
నతు జానంతి సంమోహా ద్యావజ్జీవమనిర్వృతాః ||౪౩||

తా ॥ ఆత్మానుభవములేని మూఢులు, ఆత్మ నిర్మలము అద్వితీయము
సర్వవ్యాపకము నైనదని మాత్రము చింతింతురే కాని, ఆత్మసాక్షాత్కార
ము నొందఁజాలరు. ఇందుకు సమ్మోహమే కారణము. నిర్మలత్వమనఁ
గా కల్పితములగు ఆణవిక కార్మిక మాయికమలములు లేకుం
డుట. అద్వయత్వమనఁగా కల్పితగగనమారుతాదిభూతభౌతికరాహిత్య
ము. సర్వవ్యాపకమును స్వయంజ్యోతియు నగు నాత్మతత్త్వమిదియని చూ
పుటకును నిట్టి నామరూపములు కలదియని చెప్పుటకును నలవి కానిదియు,
నితరాపేక్ష లేనిదియును. కల్పితములగు నామరూపములు ఆత్మ కావని బో
ధింపఁబడుటచేత, అనాత్మయే కల్పితమని యితరాపేక్ష కలుగును. సా
పేక్షరూపచింతనమువలన మోహము పెరుగునే కాని తొలఁగనందున, నట్టి
చింతాపరులకు ఆత్మానుభవము లేదని చెప్పఁబడెను. కావున నట్టివారలు,
అనఁగా ఆత్మయొక్క నిర్మలత్వాదులను మాత్రము చింతించువారలు యా
వజ్జీవమును నిర్వృతిలేమి సంతోషరహితులగుదురు. సద్గురూపదిష్టమార్గము
న. అనుభవయుక్తమగు జ్ఞానమువలననే. పరమానందావాప్తి యగునని
భావము.

వి— ఈశ్లోకమందు రాజయోగలక్షణము ప్రతిపాదింపఁబడెను.
చూ. గీతా. అ ౬. శ్లో 24, 25. సంకల్పప్రభవా న్కామాం స్త్య
క్త్వా సర్వా నశేషతః । మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమన్తతః ॥
శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా । ఆత్మసంస్థం మనః కృ
త్వా నకించిదపి చింతయేత్ ॥ తా ॥ సంకల్పమువలనఁ గలుగు కోరికల
ను వాసనలతోఁ గూడఁ ద్రోసివేసి (యోగాభ్యాసివలె ప్రాణాయా
మాద్యాయాసము చేతఁ గాక) వివేకసహితమగు మనస్సుచేతనే యింద్రి
యములను విషయములందుఁ బ్రవర్తింపనీయక స్వాధీనము చేసికొని పట్టు
దలతోఁ గూడిన నిశ్చయాత్మకబుద్ధిచేత సంకల్పవికల్పాత్మకమగు మనస్సు

ను స్వస్వరూపానుసంధానమందు స్థిరముగ నిల్పి యాత్మకంటె వేఱుగ నుండునట్లు తోఁచునదియంతయు మిథ్యయను తలంపుతో మెల్ల మెల్లగ బాహ్యప్రపంచమునుండి మఱలింపవలెను. ॥ ౪౩ ॥

---

అవ॥— పైవిషయమునే విశదీకరించుచున్నాఁడు.—

శ్లో॥ ముముక్షోర్బుద్ధిరాలంబ మంతరేణ న విద్యతే,
నిరాలంబైవ నిష్కామా బుద్ధిర్ముక్తస్య సర్వదా ॥౪౪॥

తా॥ ఆత్మసాక్షాత్కారములేనివాని బుద్ధి శివకేశవా[illegible]విశేషముల నవలంబించుచుండును. జీవన్ముక్తుఁడగు వాని బుద్ధి నిరా[illegible]మయి యుండును. అనఁగా, ఆత్మసాక్షాత్కారము గలుగని మందుఁడు సంశయగ్రస్తుఁడై శివకేశవాదిరూపధ్యానపరుఁడై, తద్ద్వారా ముక్తినొందఁజూచును. కాని ఆత్మానుభవముగల జ్ఞాని యాత్మేతర మెద్దియుఁదలంపక సర్వదా ఆత్మారాముఁడై యుండునని భావము. ॥ ౪౪ ॥

---

అవ॥— విషయస్ఫూర్తి వలన భీతిఁజెందినవారలు (విషయాసక్తినిఁ దొలఁగించుకొనఁజాలనివారలు) చిత్తనిరోధమునకై యత్నింతురు. కాని అతన్నిరసనపూర్వకముగ ఆత్మానుభవము గలవార లట్టిప్రయత్న మొనరింపరని చెప్పుచున్నాఁడు.—

[illegible]తన్నిరసనము=అతత్ + నిరసనము. తత్తు అనఁగా సర్వాధారమగు సర్వ[illegible]మందు (ఆత్మయందు) కల్పితమగు నామరూపాత్మకజగత్తు. ఆ[illegible]తజగత్తు మిథ్యయని నిరసించుటయె అతన్నిరసనము). ॥౪౪॥

శ్లో ॥ విషయద్వీపినో వీక్ష్య చకితాః శరణార్థినః,
విశంతి ఝటితి క్రోఢం నిరోధైకాగ్రసిద్ధయే ॥౪౪॥

తా ॥ వ్యాఘ్రముల వలె క్రూరములై విషప్రాయము లగు విషయములను జూచి భయమొందువారలు (విషయవాసనలు తొలఁగని వారలు) మూఢులై స్వాత్మరక్షణమును గోరుచు, ఏకాత్మ్యవృత్తి (చిత్తైకాగ్రత) సిద్ధించుకొఱకు పర్వతగుహాలందు నివసింతురు. జ్ఞానుల కట్టి నిర్బంధము లేదు. విషయవాసనలు తొలఁగనివారలు గృహమందునుండిన నావిషయవాసనలు హెచ్చుచుండునను భీతిచేత (అవధూతలు, సాధులు, యోగులు మొదలగు నాశ్రమముల స్వీకరించి) నిర్జనారణ్యములఁ జేరి, యచటఁ గ్రూరమృగముల వలనఁ బ్రాణభయము కలుగకుండఁ గిరిగుహాలందు నివసించుచు చిత్తైకాగ్రత కొఱకు ప్రాణాయామలంబికాదియోగముల నభ్యసింతురు. అట్టివారలకు గృహమందుండిన విషయసంసర్గభీతి, వనమునందుండిన క్రూరమృగభీతి, గుహాలయందుండిన సర్పవృశ్చికాదిభీతియు గలుగును. అట్టి భీతి లేకపోయినను చిత్తనిరోధప్రయత్నము ఇటుల నొకదాని వెంబడి నింకొక సంశయము సిద్ధించుచుండుటచేత నట్టివారలకు మనశ్శాంతియే లేకపోవుట వలన స్వస్వరూపానుసంధానము సిద్ధించుటెట్లు? 'సంశయాత్మా వినశ్యతి' యను భగవద్వచనముంబట్టి వారల కెప్పటికిని శాంతియు, తద్ద్వారా బ్రహ్మానందానుభవమును సిద్ధింపవు. సద్గురుకటాక్షమున స్వస్వరూపానుసంధానసంసిద్ధిగల జ్ఞానులు, 'గ్రామో నాస్తి కుతః సీమా? కుతః ప్రాచ్యాదిభేదధీః? । దేహో నాస్తి కుతో వర్ణాశ్రమాచారాదికః శ్రమః? ॥'[3] అనునట్లు శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వభావములు, దేహవాసన, అహంకారమమత్వములు మొదలగు బాహ్యాంతరవృత్తులు లేనివార లగుటచేతను, సర్వదా స్వస్వరూపానుసంధానపరులగుటచేతను, అ

త్రేతర మెద్దియు గోచరింపనివారలు గనుకను, వారలు స్వభావముచే సం
సారులై యున్నను, వనమందు యథేచ్ఛాసంచారులైనను సర్వదా పరబ్ర
హ్మస్వరూపులై యుందురని తాత్పర్యము. ॥౮౫॥

---

అవ॥— వాసనాత్యాగము వలననే విషయభయము నివృత్తియగు న
ని చెప్పుచున్నాఁడు—

శ్లో॥ నిర్వాసనం హరిం దృష్ట్వా తూష్ణీం విషయదంతినః,
పలాయంతే న శక్తాస్తే సేవంతే కృతచాటవః ॥౮౬॥

తా॥ సింహమును జూచి గజములు పారిపోవునట్లు, విషయవాసనా శూన్యుఁడగు జ్ఞానినిఁ జూచి విషయములు పారిపోవును. ప్రియుని భయభక్తులతో భజించు పతివ్రతలవలె, అదృష్టప్రేరితము లగు నావిషయములు నిర్వాసనుఁడగువానిని సమయానుకూలముగఁ జేరి వినయభయభక్తులతో భజించును. (ప్రారబ్ధవశమగు క్షుత్పిపాసాదిదేహధర్మములు, ఆత్మారాముఁడగు జ్ఞానియొక్క చిత్తమును జలింపఁజేయలేకఁ దనుంతటఁ జరుగుచుండునని భావము.) ॥౮౬॥

---

శ్లో॥ న ముక్తికారికాం ధత్తే నిశ్శంకో యుక్తమానసః,
పశ్యఞ్ఛృణ్వన్స్పృశఞ్జిఘ్రన్నశ్నన్నాస్తే యథాసుఖం॥

తా॥ నిశ్చలమానసుఁడగు జ్ఞాని సకలసంశయనిర్ముక్తుఁడై యమనియమాదిక్రియలతోఁ బ్రసక్తి లేకయే లోకదృష్టికిఁ జూచుట, వినుట, తాఁకుట, యాఘ్రాణించుట, భుజించుట మొదలగు దేహేంద్రియకృత్యము

ల నెరవేర్చుచున్నను, ఆయాపనులయందుఁ గర్తృత్వాధ్యాసము లేక నే సదా ఆత్మసుఖానుభవశాలియై యుండును.

వి— ఇచట శ్రీభగవద్గీత అ- ౫, శ్లో॥ ౮-౯-౧౦ లు ప్రమాణములు—

"నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్య న్శృణ్వ న్స్పృశ న్జిఘ్ర న్నశ్న న్గచ్ఛ న్స్వప న్శ్వసన్ ॥
ప్రలప న్విసృజ న్గృహ్ణ న్నున్మిష న్నిమిష న్నపి,
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్ ॥
బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా ॥"

అర్థము— తత్త్వవేత్త జ్ఞానకర్మేంద్రియప్రాణముల చేత సమస్త కార్యములు చేయఁబడుచుండఁ, దనయందుఁ గర్తృత్వాధ్యాసము నుంచుకొనక, యింద్రియములు తమ తమ పనులను జేయుచున్నవని నిశ్చయించి, సర్వకర్మములను పరమాత్మయందు సమర్పించి, ఆయా ఫలముల గోరక మోక్షాపేక్షయుతము లేనివాఁడై నీటిచే నంటఁబడని తామరాకు వలె పుణ్యపాపములచే నంటఁబడక (ఆత్మారాముఁడై) విలసిల్లును.

మఱియు కర్మసాధ్యము లగు లోకము లసత్యములు. స్వతస్సిద్ధమై నాశరహితమగు బ్రహ్మమునకు (ఆత్మకు) తనయందుఁ గల్పితమయినయంతఃకరణమునందుఁ బ్రవేశము గలిగినందున జీవభావము కలిగినది. నిష్క్రియబ్రహ్మమున కంతఃకరణమందుఁ బ్రవేశ మెట్లని శంకింపఁదగదు. ఆట్టి బ్రహ్మము యీ చరాచరప్రపంచమును దేవ యాశక్తియొక్క అవినాభావసంబంధము వలనఁ గల్పించెనో, జడమగు నీప్రపంచము వ్యవహారక్షమమగుటకై యామాయాశక్తి సహాయమునసే (సమ్మేళనము చేతనే), ప్రత్యగాత్మ (జీవ) రూపమును బొంది "ఈశ్వర స్సర్వభూతానాం హృ

దేశేఽర్జున తిష్ఠతి । భ్రామయ న్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥" ఇతి గీతావాక్యరీత్యా, ప్రపంచనాటకము నాడించుచున్నాఁడు. కాని, అసంగుఁడగుటచే నీకల్పితాంతఃకరణముతో నాయనకు సంబంధము లేదు. అట్లు సంబంధము లేనిదే పరమాత్మస్వరూపము. కాఁబట్టి శాస్త్రమందును, గురువాక్యమందును విశ్వాసము గలిగి సర్వసంశయవిముక్తుఁడై సంతతాత్మారాముఁడగు జ్ఞాని కర్తృత్వాధ్యాసము లేనివాఁడై, లోకదృష్టికిఁ గర్మపరుఁడయ్యును నిష్కర్ముఁడై, సర్వదా ఆత్మానందము ననుభవించుచుండును. ॥౪౭॥

---

శ్లో॥ వస్తుశ్రవణమాత్రేణ శుద్ధబుద్ధి ర్నిరాకులః,
నైవాచార మనాచార మౌదాస్యం వా ప్రపశ్యతి॥౪౮॥

తా॥ "ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః । అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిం ॥" (గీతా. అ. ౬, శ్లో. ౪౫). జ్ఞాననిష్ఠుఁడు పట్టుదలతో యత్నము చేయుచు పాపముల నుండి పరిశుద్ధుఁడై, అనేకజన్మముల యందుఁ జేయఁబడిన యభ్యాసవిశేషము చేతఁ బొందఁబడిన యోగ (జ్ఞాన) సిద్ధికలవాఁడై దానివలన బ్రహ్మజ్ఞానముఁ బొంది యాబ్రహ్మాత్మైక్యజ్ఞానమువలన నుత్తమమయిన మోక్షమును బొందును. అనెడి గీతావచనము ననుసరించి అనేకజన్మార్జితజ్ఞానాంకురము కలిగిన పురుషశ్రేష్ఠుఁడు, సద్గురువు వలన "తత్త్వమసీ" త్యాది మహావాక్యోపదేశమును వినినంతమాత్రమున, అఖండాత్మసాక్షాత్కారము కలిగి స్వస్వరూపస్థితుఁడగును. అట్టి మహనీయుఁడు కేవలపరబ్రహ్మమే తానగుట చేత, క్రియానుష్ఠానపరుఁడై యాచారవంతుఁడును గాఁడు, అనాచారియును గాఁడు. ఈయుభయకర్మలయందుఁ దటస్థభావముతో నిష్కర్ముఁడును గాఁ

ను, అనఁగా జ్ఞానికి శుభాశుభకర్మలతోఁ గాని, నైష్కర్మ్యముతోఁ గాని ప్రసక్తి లేదని భావము. నైష్కర్మ్య మనఁగా కర్మసాధ్యము గాక సిద్ధమయిన పరబ్రహ్మము. ||౪౮||

---

అవ|| — జ్ఞానియొక్క వ్యాపారము బాలకుని క్రీడవలె నుండునని చెప్పుచున్నాఁడు. —

**శ్లో || యదా యత్కర్తు మాయాతి తదాతత్కురుతేఋజుః,**
**శుభంవాప్యశుభంవాపితస్య చేష్టా హి బాలవత్ ||౪౯||**

తా || పసిబిడ్డ లనకు హాయకరమని యెఱుఁగక దీపము మొదలగు వస్తువులఁ బట్టుకొనును. బాడి మొదలగు హేయపదార్థముల నంటుచుం డును. ఒకప్పు డాడును. ఒకపుడు కేడును. పాపమని తెలియక చీమ లు మొదలగు నల్పజంతువులఁ బట్టి చంపును. ఇట్టి పసిపాపల చేష్టలను సంకల్పవికల్పములు (భావాభావములు) లేకుండుటయే కారణము. అటుల నే (పైశ్లోకములో చెప్పఁబడిన) ఆత్మారాముఁడగు జ్ఞాని పసిపాపనివలెనే లోకదృష్టికి ప్రారబ్ధవశమున శుభాశుభకర్మములఁ జేయుచుండును. అటు లఁ జేయునప్పుడాతని కెట్టి యభినివేశము (కర్తృత్వాభిమానము) లేక వాని చేష్టలు బాలుని వ్యాపారమువలె నుండును. ||౪౯||

---

**శ్లో || స్వాతంత్ర్యాత్సుఖమాప్నోతిస్వాతంత్ర్యాల్లభతేపరమ్,**
**స్వాతంత్ర్యాన్నిర్వృతింగచ్ఛేత్స్వాతంత్ర్యాత్పరమంపదమ్||**

తా || "స్వం" అనఁగా తాను (ఆత్మ), "పరం" అనఁగా ఆ

శ్యము (దేహాదివిషయజాతము అనాత్మ) ఈ యనాత్మ జడము, అనృతము, దుఃఖరూపము. దానికి లోబడుట పారతంత్ర్యము. అట్టి పారతంత్ర్యమునకువ్యతిరేకము స్వాతంత్ర్యము. (ఆత్మసాక్షాత్కారము) ఈస్వాతంత్ర్యము (ఆత్మసాక్షాత్కారము) వలన సకలవృత్తిసాక్షియగు సుజ్ఞానము కలుగఁగ రాగద్వేషములు నశించును. ఈ రాగద్వేషములే చిత్తమలము లేకపోవుటయే మనఃప్రసాదము. కాఁబట్టి స్వాతంత్ర్యము (ఆత్మసాక్షాత్కారము) వలన మనఃప్రసాదమును. పిమ్మట జ్ఞానమును కలుగును. అట్లు స్వాతంత్ర్యము వలననే నిత్యసు[illegible] (ఆత్మానందసుఖము) కలుగును. దానివలననే స్వస్వరూపవిశ్రాంతియు [illegible]ప్రాప్తించును. (రాగద్వేషము లనెడి మలములును, అహంమమత లనెడి [illegible] మాత్రములును పూర్తిగ నశించిన గాని మనఃప్రసాదము (నిర్మలచిత్తము) కలుగదు. మనఃప్రసాదమునఁ గాని జ్ఞానోదయము కాదు. జ్ఞానమువలనఁ గాని నిర్వృతి (నిత్యసుఖము) కలుగదు. నిర్వృతి గలిగినం గాని స్వస్వరూపవిశ్రాంతి కలుగదు, అని భావము.॥౫౦॥

---

అవ॥— అధ్యాసము తొలఁగఁగ చిత్తవృత్తులు నశించునని చెప్పుచున్నాఁడు---

**శ్లో॥ అకర్తృత్వ మభోక్తృత్వం స్వాత్మనో మన్యతే యదా,**
**తదా క్షీణా భవంత్యేవ సమస్తాశ్చిత్తవృత్తయః ॥౫౧॥**

తా॥ జీవుఁడు తనకుఁ గర్తృత్వము, భోక్తృత్వము లేదని భావించునప్పుడే రాగేచ్ఛాదిచిత్తవృత్తు లన్నియుఁ నశించును. ఈధర్మములు బుద్ధిసహితమగు జాగ్రత్స్వప్నావస్థలయందుండును గాని బుద్ధిరహిత మగు సుషుప్త్యవస్థయందుండవు. కనుక నా రాగేచ్ఛాదులు బుద్ధిధర్మములు కాని ఆ

త్రశాస్త్రములు కావు. ఈయర్థమునే "రాగేచ్ఛాసుఖదుఃఖాదిబుద్ధౌ సత్యాం ప్రవర్తతే ; సుషుప్తౌ నాస్తి తన్నాశే తస్మాద్బుద్ధేస్తు నాత్మనః ॥" అని శ్రీశంకరాచార్యులు ఆత్మబోధయందు వచించిరి. కావున ప్రత్యగభిన్న జీవునియందు అంతఃకరణధర్మము లగు కర్తృత్వభోక్తృత్వాదులు కలవని యెంచెడి అవిద్యావృత్తులతోఁ గూడిన సమస్తచింతలు నశించును. పిమ్మట చిన్మాత్రుఁ డగు ప్రత్యగాత్మకు పరమాత్మునకు ఐక్యము సులభమని భావము. ॥౫౦॥

---

అవ॥— జ్ఞాని యజ్ఞానులకుఁ గల వ్యాపారభేదమును జూపుచున్నాఁడు---

శ్లో॥ ఉచ్ఛృంఖలాప్యకృతికా స్థితి ర్ధీరస్య రాజతే,
న తు సస్పృహచిత్తస్య శాంతి ర్మూఢస్య కృత్రిమా ॥

తా॥ తాఁజేయు పనులందు నిస్పృహుఁడై నిష్కపటవృత్తితో విహరించుచు లోకదృష్టికి శాంతిలేనివానివలె వర్తించినను ధీరుఁడు (జ్ఞాని) పరబ్రహ్మస్వరూపుఁడై శోభిల్లును. కపటవృత్తితో శాంతుఁడై యున్నటులు నటించు మూఢుఁడు (జ్ఞాని) వలె శోభిల్లఁడు. ॥౫౧॥

---

అవ॥--- సంకల్పశూన్యుఁడగు జ్ఞాని భోగముల ననుభవించుచున్నను, భోగి కాకున్నను నాతని కభినివేశము (కర్తృత్వాధ్యాసము) యుండదని చెప్పుచున్నాఁడు.---

శ్లో॥ విలసంతి మహాభోగై ర్విశంతి గిరిగహ్వరాన్,
నిరస్తకల్పనా ధీరా అబద్ధా ముక్తబుద్ధయః ॥౫౨॥

తా॥ సంకల్పవికల్పశూన్యుఁడగు జ్ఞాని యొకప్పుడు ప్రారబ్ధలబ్ధ సుఖభోగముల ననుభవించును. ఒకానొకప్పుడు ప్రారబ్ధవశమున పర్వతారణ్యములయందు విహరించును. ఆమహాశయుఁ డెట్లున్నను గర్తృత్వాధ్యాసమే లేకుండ, ఆసక్తిరహితుఁడై వృత్తిశూన్యుఁడై యుండును. ॥ ౫౩ ॥

---

అవ॥— జ్ఞాని లౌకికవ్యాపారము సేయుచున్నను సర్వదా నిర్వికారచిత్తుఁడై యుండునని చెప్పుచున్నాఁడు.—

**శ్లో॥ శ్రోత్రియం దేవతాం తీర్థమంగనాం భూపతిం ప్రియం,**
**దృష్ట్వా సంపూజ్య ధీరస్య నకాపి హృది వాసనా॥౫౪॥**

తా॥ జ్ఞాని తాను సకలజగత్ప్రకాశచిద్రూపుఁడగుటవలన సర్వమును చిద్రూపాత్మయగు తానేయను నిశ్చయముతో సర్వత్ర సమచిత్తుఁడై ధర్మార్థకామవాసనలు లేకయే శ్రోత్రియుల మన్నించును, దేవతలఁ బూజించును, తీర్థముల సేవించును, భూప[illegible]వించును, భార్యాపుత్రాదుల నాదరించును. లౌకికవ్యాపారమం[illegible] నమ్మహానీయునకాదరణబుద్ధియు లేదు, తూష్ణీంభావమును లేదు. (ఇ[illegible]జ్ఞానియగు జనకునివంటి గృహస్థుని లక్షణములు.) ॥౫౪॥

---

**శ్లో॥ భృత్యైః పుత్రైః కళత్రైశ్చ దౌహిత్రైశ్చాపి గోత్రజైః,**
**విహస్య ధిక్కృతో యోగీ నయాతి వికృతిం మనాక్॥**

తా॥ జ్ఞానికి రాగద్వేషములు లేనందున భృత్య పుత్ర కళత్ర దౌహిత్రాదులు తనను ధిక్కరించి యపహాస్యము జేసినప్పటికిఁ జిత్తక్షోభము నొందఁడు. ॥ ౫౫ ॥

(శ్లో. ౫౪, ౫౫, వలన జ్ఞాని సంన్యాసాభ్యాసములస్వీకరింపక యే. సంసారియయ్యును కేవల మాత్మవిశ్రాంతివలన ముక్తినొందవచ్చునని స్పష్టమగుచున్నది.)

---

అవ॥— జ్ఞానుల జాడలు జ్ఞానులకే తెలియునని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ సంతుష్టోఽపి వసంతుష్టః ఖిన్నోఽపి నచ ఖిద్యతే,
తస్యాశ్చర్యదశాం తాం తాంతాదృశా ఏవ జానతే॥

తా ॥ విపరీతభావనానివర్తకమగు దృఢతత్త్వజ్ఞానముగల యోగి, లోకసామాన్యమునకు బాహ్యవిషయప్రాప్తివలన సంతోషియైనట్లు కనుపించినను సంతోషి కాఁడు. బాహ్యవిషయవియోగమువలన దుఃఖితుఁడైనట్లున్నను దుఃఖితుఁడు కాఁడు. సర్వదా పూర్ణానందాత్ముఁడయియే యుండును. అట్టి విజ్ఞానియొక్క జాడలు [illegible]లగు జ్ఞానులకే యెఱుక. (పాముల పాదములు పాములకే యెఱుక [illegible]). ॥ ౫౬ ॥

---

అవ॥— సంసారకారణమగు కర్తృవ్యతాభిమానము జ్ఞాని కెప్పుడును గలుగదని శ్లోకత్రయముచే నిరూపించుచున్నాఁడు.—

శ్లో॥ కర్తవ్యతైవ సంసారో న తాం పశ్యంతి సూరయః,
శూన్యాకారా నిరాకారా నిర్వికారా నిరామయాః॥

తా ॥ "ఇది నేను చేయవలెను" అను కార్యసంకల్పమే సంసారహేతువగును. జ్ఞానుల కట్టి సంకల్పమే లేనందున కర్తవ్యతాబుద్ధియు లేదు. ఏలయనఁగా, తత్త్వజ్ఞులు ప్రపంచప్రతీయమందు సాక్షులై మిగిలిన చైతన్యమే జాగ్రదవస్థయందును జడములగు దేహేంద్రియాదులను వ్య

వహారక్షమముగఁ జేయుచుండునని యెంచి, నిరాకారము నిర్వికారము నగు చైతన్యమే తానుగ భావించుటచేత సంకల్పరహితికారకహితుండయి యానం దింతురు. ॥ ౫౩ ॥

---

శ్లో॥ అకుర్వన్నపి సంక్షోభా ద్వ్యగ్రః సర్వత్ర మూఢధీః,
కుర్వన్నపితు కృత్యాని కుశలోహి నిరాకులః ॥ ౫౪ ॥

తా॥ మూఢుఁడు బాహ్యమున నేమియుఁ జేయక యూరకుండినను, దృశ్యవస్తు వసత్యమా? అదృశ్యవస్తువు సత్యమా? యని చిత్తమున సంశయింపుచు దుఃఖించును. జ్ఞానియన్ననో, ఆభాసమాత్రములగు కార్యములను లోకదృష్టికిఁ గామరులతలె చేయుచున్నను దృశ్యము లసత్యములని దృఢముగ నమ్మి నిత్యదృగాత్మయందే రమించుచుండును. ॥౫౪॥

---

శ్లో॥ సుఖమాస్తే సుఖం శేతే సుఖ మాయాతి యాతిచ,
సుఖం వక్తి సుఖం భుంక్తే వ్యవహారేపి శాంతధీః॥౫౫॥

తా॥ ఆత్మనిష్ఠబుద్ధిగల పండితుఁడు (జ్ఞాని) ప్రారబ్ధవశమగు వ్యవహారము జరుపుచుండియు, ఆత్మసుఖమునే పొందుచుండును. సర్వేంద్రియములు తమంతట వాని వానిపనులు (మాట్లాడుట, భుజించుట, మొదలగు క్రియలు) నెరవేర్చుచుండఁగా వానియందెట్టి కర్తృత్వభావమును లేక జ్ఞాని సర్వదా ఆత్మవిశ్రాంతుఁడై యుండును. ఎట్లన—

శా॥ గానంబు న్నటనంబుఁ దాళగతులం గావించుచుం జారు వి
ద్యావైపుణ్యముఁ జూపుచున్ శిరముమీఁదంగల్గు పెంధాంతరన్ ।
బూనంగైకొను నాట్యశీలుని గతిన్ బుంఖానుపుంఖోజ్జ్వల

ర్యచింతతో వ్యవహరించుచున్నను, దృశ్యదర్శనశూన్యుడై యుండును. ఆ
విధగా యెదుట నున్న వస్తువును జూచుచున్నను ఆత్మదృష్టిచే దానిని జూడ
కుండును. ఏమన నమ్మహాశీయుండు సర్వదా స్వస్వరూపమందే యారూ
ఢుండై యుండుటచేత నతని కాత్మేతర మెద్దియు గోచరింపదు. (సంక
ల్పవికల్పహేతువు లగు మనోబుద్ధిచిత్తాహంకారము లాత్మయందు లయమై,
ఆత్మలక్ష్యము సయితము లేకుండుటయే జ్ఞానము లేక మోక్షమని భా
వము) ॥౯౩॥

---

అవ॥— దృశ్యవస్తువులు భావనామాత్రములే యని భావింపవ
చ్చును గాని, యెదుటనున్న వస్తువులు జ్ఞానికి దృష్టిగోచరములు కాకుం
డుట యెట్లు? అను శంక రాగా, నిష్కాముఁ డగు వానికట్లు కావచ్చు
నని చెప్పుచున్నాఁడు—

శ్లో॥ సర్వారంభేషు నిష్కామో యశ్చరే ద్బాలవన్మునిః
న లేప స్తస్య శుద్ధస్య క్రియమాణేఽపి కర్మణి ॥౯౪॥

దా॥ (మూ. శా. శ్లో. ౯౪) జ్ఞాని పసిపాఁపవలె నిష్కాముఁడై
యెట్టి సంకల్పములును లేకుండఁ బ్రారబ్ధవశమగు సర్వకార్యములు చేయు
చుండును. అట్టి పరిశుద్ధుఁ డగు (అహంకారమలవర్జితుఁడగు) జ్ఞాని యెద్ది
చేయుచున్నను కర్తృత్వము లేకయే చేయుచుండును గానవానికా కర్మ
సంబంధలేపము లేదు. ॥౯౪॥

---

అవ॥— అట్టి నిర్మలజ్ఞాని మిగులఁ ధన్యుఁడని చెప్పుచున్నాఁడు—

శ్లో॥ స ఏవ ధన్య ఆత్మజ్ఞ స్సర్వభావేషు యస్సమః,
పశ్య న్ఛృణ్వన్ స్పృశ న్జిఘ్ర న్నశ్న న్నిస్తర్షమానసః॥

తా ॥ పై (౬౮) శ్లోకమందు చెప్పఁబడినరీతిగ, (అహంభావశూన్యుఁడై పరిపక్వునివలె వర్తించు) జ్ఞానియే ధన్యుఁడు గాని తదితరులు కారు. అట్టి మహనీయుఁడు సకలపదార్థము లందును సర్వప్రాణులందును ఆత్మైకభావనచే సమబుద్ధిఁ గలిగి వానిని ఆత్మస్వరూపముగనే చూచును. మఱియుఁ జూచుట, వినుట, తాఁకుట, తినుట, భుజించుట మొదలగు సమస్తక్రియలందును తృష్ణారహితుఁడై, అహంభావశూన్యుఁడై యుండును ॥౬౯॥

---

అవ॥--- అట్టి వాఁడే ధన్యుఁడనుటకు నింకొక యుక్తినిఁ జెప్పుచున్నాఁడు.---

శ్లో ॥ క్వ సంసారః క్వచాభాసః క్వ సాధ్యం క్వచ సాధనమ్,
ఆకాశస్యేవ ధీరస్య నిర్వికల్పస్య సర్వదా ॥౭౦॥

తా ॥ ఆకాశమువలె నుపాధిమలశూన్యమై సర్వపరిపూర్ణమైయుండు జ్ఞానికి సంకల్పవికల్పములు లేనందున సంసారము (ప్రపంచము)ను లేదు, సంసారాదిప్రతిభాసమును లేదు. సంసారి వలె వర్తించినను (భావనాభావనాశూన్యుఁడు కనుక) సంసారి కాఁడు, సర్వోత్కృష్టమగు జీవన్ముక్తావస్థతో నుండుట చేత వానికి స్వర్గాదులతోడను తత్కారణము అగు యజ్ఞాదులతోడను పనిలేదు. ॥౭౦॥

---

అవ॥--- అఖండాత్మానుభవము గల జ్ఞాని నిస్సంశయముగ ముక్తుఁడే యని చెప్పుచున్నాఁడు---

శ్లో ॥ స జయతి సంన్యాసీ పూర్ణస్వరసవిగ్రహః,
అకృత్రిమోఽనవచ్ఛిన్నే సమాధి ర్యస్యవర్తతే ॥౭౧॥

తా॥ జ్ఞాని స్వస్థస్వరూపుఁడై ప్రయోజనము లేనివాఁడు కను క 'అక్షరపరిపూర్ణుఁడు' మరియు, పూర్ణస్వభావము స్వరూపముగఁ గలవాఁడు కనుక 'పూర్ణస్వరూపి' యని చెప్పఁబడును. స్వాభావికానవచ్ఛి న్న పరిపూర్ణస్వరూపమే వహించిన మహాశయుఁడు సర్వో త్కృష్టముగ (సామ్రాజ్యము) జయము గాంచును. (జ్ఞాని ప్రపంచ ము లేక అనవచ్ఛిన్ననిత్యపరిపూర్ణస్వరూపుఁడై జీవన్ముక్తుఁడగునని భావము.) ॥ ౮౨ ॥

---

అవ॥ సర్వత్ర నిరాకాంక్షుఁడై యుండుటే తత్త్వజ్ఞాని ముఖ్యలక్షణ మని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ బహునాఽత్ర కిముక్తేన జ్ఞాతతత్త్వో మహాశయః,
భోగమోక్షనిరాకాంక్షీ సదా సర్వత్ర నీరసః ॥౮౩॥

తా॥ జ్ఞానివిషయమై పెక్కుమాటలు చెప్పనేల? తత్త్వజ్ఞుఁడగు మహాశయుఁడు భోగమోక్షఫలములం దాకాంక్ష (కోరిక) లేనివాఁడు ఆభోగమోక్షములందు నీరసుఁడు (అనురాగము లేనివాఁడు). ॥౮౩॥

---

అవ॥— మఱియు.—

శ్లో॥ మహదాది జగద్ద్వైతం నామమాత్రవిజృంభితమ్,
విహాయ శుద్ధబోధస్య కిం కృత్యమవశిష్యతే ॥౮౪॥

తా॥ "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" ఇతి శ్రుతివచనరీత్యా, కడవలు, మూకుళ్ళు, ముంతలు మొదలగు నన్ని నామరూపవికారములతో నెంచఁబడినను, అవి యన్నియు నొక

ర్షవిషాదములు, అహంకారమమతలు మున్నగు దేహవాసనలు కలుగవని నాలుగు శ్లోకములచే నిరూపించుచున్నాఁడు.—

శ్లో॥ శుద్ధస్ఫురణరూపస్య దృశ్యభావ మపశ్యతః,
క్వ విధిః క్వచ వైరాగ్యం క్వత్యాగః క్వ శమోపివా ॥

తా॥ స్వప్రకాశచిద్రూపుఁడై (కేవల స్ఫురణమాత్రస్వరూపుఁడై), దృశ్యపదార్థ మెద్దియుం గోచరింపకుండునట్టి జ్ఞానికి కర్మానుష్ఠానవిధియు లేదు, విరక్తి నొందఁదగిన విషయమును లేదు. విడువఁదగినట్టిదిగాని పరిగ్రహింపఁదగినట్టిదిగాని పదార్థమెద్దియును లేదు. ॥౭౧॥

శ్లో॥ స్ఫురతోఽనంతరూపేణ ప్రకృతిం చ నపశ్యతః,
క్వబంధః క్వచవా మోక్షః క్వహర్షః క్వవిషాదితా॥

తా॥ అనంతపరిపూర్ణచిద్రూపుఁడై ప్రకృతికల్పితప్రపంచమెఱుఁగక— స్ఫురణమే లేని నిర్మలజ్ఞానికి బంధమోక్షములు, హర్షవిషాదములు నుండవు. ॥ ౭౨ ॥

అవ॥— మఱియు.—

శ్లో॥ బుద్ధిపర్యంతసంసారే మాయామాత్రం వివర్తతే,
నిర్మమో నిరహంకారో నిష్కామ శ్శోభతే బుధః ॥

తా॥ ఆత్మజ్ఞానము చేత నంతరించు సంసారమున, రజ్జువందు సర్పభ్రాంతివలెనే, మాయావిశిష్టచైతన్యము వివర్తరూపముతో మాయామా

త్రిజగదాకారము నొందుచున్నది. అట్టి యీ జగత్తు త్రిగుణాత్మకస్వరూపమయినదే కాని సత్యము కాదు. కావున శాస్త్రజ్ఞులు (జ్ఞానులు) ఆత్మాన్యాత్మకమగుశరీరమందు అహంకారమును (నా శరీరము, నేను, నాదే యనెడి యభిమానమును) తత్సంబంధి దారాపుత్రాదులందు మమకారమును లేకుండ నిష్ఠాపులయి సచ్చిదానందఘనులయి శోభింతురు.

ఈవివర్తాది వాదములు మూడు విధములు:—

(1) వివర్తము— అసలు వస్తువునకు మార్పు లేకయే మఱియొక వస్తువుగాఁ దోఁచుట.

ఉదా— రజ్జువే సర్పముగాఁ దోఁచుట.

(2) పరిణామము— అసలు వస్తువు మఱియొకటిగ మాఱుట.

ఉదా— పాలు పెరుగగుట.

(3) అల్పాల్పవస్తువులు కలిసి సజాతీయమగు పెద్దవస్తువగుట.

ఉదా— నూలుపోగులు బట్టలగుట. ॥ 23 ॥

---

శ్లో॥ అక్షయం గతసంతాప మాత్మానం పశ్యతో మునేః,
క్వవిద్యాచ క్వవావిశ్వం క్వదేహోఽహంమమేతివా॥

తా॥ నాశ మెన్నటికిని లేనిదియు, సర్వసంతాపరహితమయినదియు నగు సర్వాధిష్ఠానాత్మ యొక్క సాక్షాత్కారము గల జ్ఞానికి, ఆత్మాతిరిక్తము లగు శాస్త్రవిమర్శనము, ప్రపంచము, దేహము, అహంకారము, మమకారము మొదలగు వానితోఁ బ్రసక్తియే లేదు. ॥24॥

---

అవ॥— ఆత్మజ్ఞానకు ద్వైతానర్థనివృత్తి యగు నని చెప్పఁబడెను. ఇఁక నజ్ఞాని చేయు చిత్తనిరోధాదికర్మములు కుంజరశౌచము వలె నిష్ఫ్ర

యోజనము లని చెప్పుచున్నాడు—

శ్లో॥ నిరోధాదీని కర్మాణి జహాతి జడధీర్యది,
మనోరథాన్ప్రలాపాంశ్చ కర్తుమాప్నోత్యతత్క్షణాత్॥

తా॥ జడుఁడు చిత్తనిరోధాదులఁ జేయుంగాక. అచిత్తనిరోధాది క్రియఁ జాలించు నంతనే, గాలిగుంటనుండి లేచిన కుక్కవలె తన మనోరథకార్యముల నెరవేర్చుకొనుటకై సర్వవ్యాపారములను జేయుచునే యుండును. కావున మూఢుని చిత్తనిరోధాదికర్మములు కుంజరస్నానము వలె నిష్ప్రయోజనములు. (అసన ప్రాణాయామ జపాద్యనుష్ఠానముల వలన చిత్తశుద్ధి మాత్రము కాని ఆత్మజ్ఞానము కలుగ దని భావము.) ॥౭౫॥

అవ॥— ఆత్మబోధ రహితము మూఢున కనర్థకమే యని చెప్పుచున్నాడు—

శ్లో॥ మందః శ్రుత్వాపి తద్వస్తు న జహాతి విమూఢతాం,
నిర్వికల్పో బహిర్యత్నా దంతర్విషయలాలసః ॥౭౬॥

తా॥ ఆత్మతత్త్వస్వరూపమును వినియును మూర్ఖుఁడు తన మూఢత్వమును విడువలేడు. ఏమన మలినచిత్తునకు శ్రవణాదులవలన జ్ఞానోదయము కాదు. కాబట్టి మూఢుఁడు చిత్తనిరోధాదిప్రయత్నముల చేత లోకదృష్టికి నిర్వ్యాపారుఁడై యుండినను మనస్సులో విషయములను ధ్యానించుచునే యుండును. ॥౭౬॥

అవ॥— జ్ఞాని యన్ననో లోకదృష్టికి సకలవ్యాపారములు సేయు

చుండియు నట్టి వ్యాపారములయందు గర్తృత్వాధ్యాసము లేకుండును అని చెప్పుచున్నాఁడు—

శ్లో॥ జ్ఞానాద్గళితకర్మా యో లోకదృష్ట్యాపి కర్మకృత్,
నాప్నోత్యవసరం కర్తుం వక్తుమేవ న కించన ॥ ౬౪ ॥

తా॥ జ్ఞానోదయమువలన కర్తృత్వాధ్యాసము లేని మహాశయుండు లోకదృష్టికి వ్యాపారలోలుఁడయినను నేమిపనిఁ జేయుచున్నాను అను నహంకారమున కవకాశ మియ్యక (అహంభావము లేక) సర్వదా ఆత్మానుసంధానపరుఁడయి యుండును. ॥ ౬౪ ॥

---

అవ॥— విద్వాంసుఁడు (జ్ఞాని) తమఃప్రకాశాదికము (జ్ఞానాజ్ఞానాదులు) సయితము నెఱుఁగఁడని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ క్వ తమః క్వ ప్రకాశో వా హానం క్వచన కించన,
నిర్వికారస్య ధీరస్య నిరాతంకస్య సర్వదా ॥ ౬౫ ॥

తా॥ మోహాదిసర్వవికారములును తొలఁగిన జ్ఞానికి, అజ్ఞానమనునది యే లేనప్పుడు, అజ్ఞానమును తొలఁగించు జ్ఞానమేల? భూతభవిష్యద్వర్తమానకాలాదులవలని భయమే లేనివానికి (ఆత్మ సర్వదా నిత్యమగుటచేత, ఆత్మస్వరూపుఁడగు వానికి) విడువఁదగిన దెద్ది? అనురాగాదివృత్తులే లేనివానికిఁ గోరఁదగినదేది? అనఁగా జ్ఞానికి జ్ఞానాజ్ఞానభేదము, కాలనియమము, హేయోపాదేయములును లేవని భావము.

వి— నిత్యప్రకాశస్వరూపుఁడగు సూర్యునకు రాత్రింబగళ్లనెడి భేదము లేనివిధమున, శుద్ధచిద్రూపుఁడగు ఆత్మజ్ఞునకు జ్ఞానాజ్ఞానభేదముండదని భావము.

«నాహంకారేణ నాస్తి స్నేహో స్పృహా నచే త్పునఃకాలమహాదాఽప్యస్తి చానేకః క్వచిత్, జ్ఞానం తదాఽజ్ఞాన మిదం ద్వయం వదే ద్రామో కథం స్యాత్త్ వస్తుద్విష్ఠ మేవ» (అధ్యాత్మరామాయణము. ౧-౨౩).

---

అవ॥— ఇటక జ్ఞాని యొక్కటే యనియు, అనిర్వాచ్యస్వభావుడగు నని చెప్పుచున్నాడు.—

శ్లో॥ క్వ ధైర్యం క్వ వివేకిత్వం క్వ నిరాతంకతాపి వా,
అనిర్వాచ్య స్వభావస్య నిస్స్వభావస్య యోగినః॥ ౭౯॥

తా॥ ఎట్టి స్వభావమును లేక యిట్టిదని యెంచ నశక్యము గాని స్వభావముగల విజ్ఞానికి ధైర్యవివేకనిర్భయత్వాదిధర్మములు నయితము లేవు.

---

అవ॥— జ్ఞానికిఁ దత్త్వదృష్టిచే స్వర్గనరకబంధమోక్షాదికములు లేవని చెప్పుచున్నాఁడు.—

శ్లో॥ న స్వర్గో నైవ నరకో జీవన్ముక్తి ర్న చైవహి,
బహునాత్ర కిముక్తేన యోగదృష్ట్యా నకించన ॥ ౮౦ ॥

తా॥ తత్త్వజ్ఞునకు స్వర్గనరకాదులు లేవు. జీవన్ముక్తత్వము సయితము లేదు. ఇవి యన్నియు నాభాసములే కాని వాస్తవములు కావు. సర్వపరిపూర్ణాత్మమాత్రుఁడగు జ్ఞాని లోకదృష్టికి జీవన్ముక్తుఁడై యుండినను జీవము ముక్తియు నాభాసమాత్రములె కనుక జ్ఞాని వీని నాదరింపఁడు.

---

అవ॥— జ్ఞానియొక్క చిత్తము సర్వదా పరమానందపరిపూర్ణమై

యుండుటచేత లోహాధారణకయు సుతిమలఁ బ్రార్థింపఁడు, రోదియు దొర కని యెడల పరితపించఁడు అని చెప్పుచున్నాఁడు ---

శ్లో॥ నైవ ప్రార్థయతే లాభం నాలాభే నానుశోచతి,
ధీరస్య శీతలం చిత్త మమృతేనైవ పూరితమ్  ॥౮౧॥

తా॥ జ్ఞానియొక్క చిత్తము శీతలమై, అనఁగా, ఆధ్యాత్మికాది తాపత్రయరహితమై సర్వదా పరమానందపూరితమయి యుండుటచేత దే హాపేక్షకయి నేమియుఁ గోరఁడు. దొరకనియెడల విచారింపఁడు. ॥౮౧॥

---

అవ॥--- జ్ఞానదశయే సర్వోత్కృష్టమయినదని చెప్పి యర్థమునే వివిధప్రకారములఁ జెప్పుచున్నాఁడు.---

శ్లో॥ నశాంతం స్తౌతి నిష్కామో నదుష్టమపి నిందతి,
సమదుఃఖసుఖ స్తృప్తః కించి త్కృత్యం నపశ్యతి॥౮౨॥

తా॥ నిష్కాముఁడగు జ్ఞాని శాంత్యాది శుద్ధసత్త్వగుణాధికులఁజూచి వారల స్తుతింపఁడు. దుష్టులగువారలు తన నేమిహింసించినను వారలనింద సేయఁడు. నిత్యతృప్తుఁడై సుఖదుఃఖముల రెంటింటిని సమముగఁ జూచును॥౮౨॥

---

శ్లో॥ ధీరో న ద్వేష్టి సంసారమాత్మానం న దిదృక్షతి,
హర్షామర్షవినిర్ముక్తో న మృతో న చ జీవతి  ॥౮౩॥

తా॥ జ్ఞాని సంసారదృష్టి, లేక సంసారకార్యము గమనించనివాఁ డు కనుక సంసారమును ద్వేషింపఁడు. ఆత్మసాక్షాత్కారముఁ గలవాఁడ గుటచేత, ఆత్మను జూడఁగోరఁడు. కాఁబట్టి హర్షామర్షములు (మోదఖేద ములు) లేనివాఁడు. మఱియు జీవనమరణముల రెంటింటియందు సమబుద్ధిం

గలిగియుండుటచేత వానినాదరింపడు. అనఁగా జీవితేచ్ఛయు మరణభీతియు లేనివాఁడు అని భావము. ॥౮౩॥

---

శ్లో॥ నిస్స్నేహః పుత్రదారాదౌ నిష్కామో విషయేషు చ,
నిశ్చింతః స్వశరీరేఽపి నిరాశః శోభతే బుధః ॥ ౮౪ ॥

తా॥ జ్ఞాని పుత్రకళత్రాదులయందుఁ బ్రేమలేకయు, విషయములందుఁ గోర్కెలేకయు, దేహాభిమానము లేమిం జేసి భోజనాదిచింతయును లేక ఆశాశూన్యుఁడై శోభించును. ॥౮౪॥

---

శ్లో॥ తుష్టిస్సర్వత్ర ధీరస్య యథాపతితవర్తినః,
స్వచ్ఛందం చరతో దేశాన్యత్రాస్తమితశాయినః ॥౮౫॥

తా॥ "యథాపతిత వర్తనుఁడు" అనఁగా, ఇదిమంచిది యిది చెడ్డది యని విమర్శింపక ప్రాప్తమగుదాని ననుభవించు ధీరుఁడు (జ్ఞాని) సంతుష్టుఁడై, యెట్టికోరికయు లేక, స్వచ్ఛందవృత్తినిఁ బ్రారబ్ధము గొనిపోవు ప్రదేశములందుఁ జరియించుచు, వనమందైనను నగరమందైనను నెచట సూర్యుఁడస్తమించునో యచటనె శయనించుచు, ఆత్మారాముఁడై విహరించును.

---

శ్లో॥ పతతూదేతు వా దేహో నాస్య చింతా మహాత్మనః,
స్వభావభూమివిశ్రాంతివిస్మృతాశేషసంసృతేః ॥౮౬॥

తా॥ నిజాత్మస్వరూపమే యధిష్ఠానముగ నందు విశ్రాంతిఁ జెందిన,

అనఁగా, ఆత్మవిశ్రాంతుఁడై యున్న జ్ఞానికిఁ దేహముండినను నశించినను చింతలేదు. ("స్వభావభూమి" యన అధిష్ఠానాత్మ). ॥౮౬॥

శ్లో॥ అకించనః కామచారో నిర్ద్వంద్వశ్ఛిన్నసంశయః,
అసక్తస్సర్వభావేషు కేవలో రమతే బుధః ॥ ౮౭ ॥

తా॥ జ్ఞాని పరిగ్రహించునదెద్దియు లేనివాఁడగుటచే 'అకించనుఁ' డనఁబరఁగి, విధినిషేధాదులులేని స్వచ్ఛందచారియగుటచేత "కామచారి" యనఁబడి, సుఖదుఃఖాది ద్వంద్వములులేనివాఁడై, ద్వైతశూన్యుఁడై ఆత్మకంటె నన్యవస్తువు లేకపోవుటచే నిస్సంశయుఁడై సర్వవిషయములందును కోరికలేకపోవుటచేత (సంగరహితుఁడై), నిర్వికారుఁడై రంజిల్లును. ॥౮౭॥

శ్లో॥ నిర్మమశ్శోభతే ధీర స్సమలోష్టాశ్మకాంచనః,
సుభిన్నహృదయగ్రంథిర్వినిర్ధూతరజస్తమః ॥ ౮౮ ॥

తా॥ మఱియు, జ్ఞాని సద్గురుప్రసాదలబ్ధమగు జ్ఞానబలముచేత హృదయగ్రంథి విభేదింపఁబడినవాఁడై (అహంకారమమకారశూన్యుఁడై), మంటిముద్దను, రాతిని, బంగారమును సమబుద్ధితోఁ జూచువాఁడై (ఆశాశూన్యుఁడై), అజ్ఞానకారణములగు రజోగుణతమోగుణములు లేనివాఁడై శోభిల్లును. ॥ ౮౮ ॥

శ్లో॥ సర్వత్రానవధానస్య న కించిద్వాసనా హృది,
ముక్తాత్మనో వితృప్తస్య తులనా కేన జాయతే ॥౮౯॥

తా॥ సర్వవిషయములందు ననవధానచిత్తుఁడై (మనసుతగులనివాఁ

స్సును తప్పక శోభించును. జనకాదులకు సంకల్పవికల్పములు లేకపోవు టచేతవారికి రాజ్యపరిపాలనము బంధకారణము కాలేకపోలు లోకవిదితము.

వి.— "యోగరతోవా భోగరతోవా సంగరతోవా సంగవిహీనః, యస్య బ్రహ్మణి రమతే చిత్తం నందతి నందతి నందత్యేవ॥" అని యార్యవచనము.

---

అవ॥— బ్రహ్మభావనచే నంతట సమభావము గల జ్ఞానికి కర్తృత్వాధ్యాసము లేనందున నియమముతో బనిలేదని చెప్పుచున్నాడు.—

శ్లో॥ క్వస్వాచ్ఛంద్యం క్వసంకోచః క్వవా తత్త్వవినిశ్చయః,
నిర్వ్యాజార్జవభూతస్య చరితార్థస్య యోగినః ॥౧౨॥

తా॥ ఆత్మనిష్ఠవలన నంతట సహజమగు సమత్వము గలిగి పరిపూర్ణుఁడగు జ్ఞానికి స్వేచ్ఛాచారము గాని, నియమము గాని, కర్తృత్వాధ్యాసము గాని యుండవు. సమత్వ మనఁగా సర్వభూతములందు ఆత్మమాత్రావలోకనము. ॥౧౨॥

---

అవ॥— ఆత్మవిశ్రాంతి గలిగి సర్వాత్మభావనగల జ్ఞానియొక్క వ్యాపార మిట్టిదని చెప్పశక్యము కాదని యీప్రకరణాంతము వఱకు వివరించుచున్నాడు.—

శ్లో॥ ఆత్మవిశ్రాంతితృప్తేన నిరాశేన గతార్తినా,
అంతర్యదనుభూయేత తత్కథం కస్య కథ్యతే ॥౧౩॥

తా॥ ఆత్మవిశ్రాంతిచేఁ దృప్తుఁడై, ఆశారహితుఁడై, ఆర్తిలేదని జ్ఞాని తన యంతఃకరణమం దనుభవించు ఆనంద మిట్టిదియని వర్ణింప

సోహము వరము? ఆప్తమహాత్మునికంటె పూర్వాధికారులకే తెలియవలెను. ॥౯౩॥

---

శ్లో॥ సుప్తోఽపి న సుషుప్తశ్చ స్వప్నేఽపి శయితో నచ,
జాగరేఽపి నజాగర్తి ధీర స్తృప్తః పదే పదే ॥ ౯౪ ॥

తా॥ ప్రతిక్షణమందు నెడతెగని నిత్యానందానుభవమువలన సంతృప్తుడగు యోగి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు గలిగియున్నటులఁ దోఁచినను ఆత డాయవస్థాత్రయముగల బుద్ధికి సాక్షిమాత్రుఁడే కాని వాని కీయవస్థలు లేవు. ॥౯౪॥

---

శ్లో॥ జ్ఞస్సచింతోఽపి నిశ్చింతః సేంద్రియోపి నిరింద్రియః,
సుబుద్ధిరపి నిర్బుద్ధి స్సాహంకారోఽనహంకృతిః ॥ ౯౫ ॥

తా॥ జ్ఞాని చింతాద్యవస్థలతో నింద్రియవ్యాపారము సలుపుచు బుద్ధిప్రేరితుఁడైనట్లు లోకదృష్టికిఁ గనుపించినను, అహంకారశూన్యుఁడు కనుక నట్టి చింతాదులతోఁ గూడిన వ్యాపారస్ఫురణము లేనివాఁడు.

---

శ్లో॥ న సుఖీ నచవా దుఃఖీ న విరక్తో న సంగవాన్,
న ముముక్షుర్న వా ముక్తో న కించిన్న చ కించన॥౯౬॥

తా॥ జ్ఞాని కంతఃకరణాధ్యాసమే లేదు కనుక లోకగతాత్మ సుఖదుఃఖాదులు గలిగియున్నటులఁ గనుపించినను, యాసుఖదుఃఖాదు లమ్మహానీయునకు లేనే లేవు. విషయములందు ద్వేషభావము లేనివాఁడు కనుక విరక్తుఁడును కాఁడు. పూర్వమే బంధవిముక్తుఁడై యుండుటచేత నిపుడు

ముక్తుఁడును కాఁడు. సదైకరూపుఁడు (సత్ + అసత్ = ఆత్మ × అనాత్మ = విశ్వములలో అసత్ పోఁగా మిగిలినదియు నిత్యమగునదియు నొక సత్ = ఆత్మ కనుక, ఆత్మైకస్వరూపుఁడు). ఆత్మ నానారూపకల్పితనామరూప్యమగునదియు నిత్యమగునదియుఁ గావున సనిర్వాచ్యమైనది. జ్ఞానియట్టి యనిర్వాచ్యపదవియం దుండువాఁడు కనుక నకించనుఁడు = పేదయును గాని వాఁడు. ॥ ౯౬ ॥

---

శ్లో॥ విక్షేపేఽపి న విక్షిప్త స్సమాధౌ న సమాధిమాన్,
జాడ్యేఽపి న జడో ధన్యః పాండిత్యేఽపి న పండితః ॥

తా॥ స్వప్రకాశాత్మానుభవము వలన ధన్యుఁడగు జ్ఞాని లోకదృష్టికి బాహ్యవ్యాపారయుతుఁడై విక్షేపము (ఆత్మచలనము) గలిగినట్లుండి నను విక్షిప్తుఁడు కాఁడు. లోకదృష్టికి సమాధిస్థితుఁడై యుండినట్లగుపడిన ను, కర్తృత్వాభ్యాసము లేనివాఁడు కనుక సమాధిపరుఁడును కాఁడు, జడునివలె లోకదృష్టికిఁ దోఁచినను స్వానుభవశాలి (ఆత్మనిష్ఠుఁడు) య గుటచే జడుఁడును కాఁడు. పరిపూర్ణపాండిత్యము గలిగినవాఁడయ్యును "నేను పండితుఁడను" అనెడి యభిమానము లేనివాఁడు కనుక పండితుఁ డును కాఁడు. ॥ ౯౭ ॥

---

శ్లో॥ ముక్తో యథా స్థితి స్స్వస్థః కృతకర్తవ్యనిర్వృతః,
సమ స్సర్వత్ర వైతృష్ణ్యా న్న స్మరత్యకృతం కృతమ్॥ ౯౮॥

తా॥ ముక్తుఁడు (జ్ఞాని, ప్రారబ్ధవశమున సంభవించు సుఖదుఃఖా దులనుభవించుచుండియు స్వస్థచిత్తుఁడై యుండును. అభినివేశోద్వేగము

(ఇష్టానిష్టములను, అదిచేయను, ఆకాడి పట్టువలగాని సంకల్పముగాని) లేని వాఁడు కనుక, తాఁ జేసినపనులందును, జేయఁబోవుపనులందును సర్వతృప్తుఁడై యుండును. మఱియు, తృష్ణారహితుఁడగుటచేత నిదిచేసితి నదిచేయలేదు అని స్మరింపకుండును. ॥ ౯౮ ॥

---

శ్లో॥ న ప్రీయతే వంద్యమానో నింద్యమానో న కుప్యతి,
నైవోద్విజతి మరణే జీవనే నాభినందతి ॥ ౯౯ ॥

తా॥ ఆత్మవిచారపరుఁడగు జ్ఞాని యితరులచేత బూజింపఁబడు సంతోషింపఁడు, నిందించిరేని కోపింపఁడు. ఆత్మనిత్యమని తెలిసినవాఁడు కావున మరణమాసన్నమైనను శరీరమనిత్యమని తెలిసినవాఁడుగనుక భీతిఁ జెందఁడు, జీవించియున్నందు కానంద మొందఁడు. ॥ ౯౯ ॥

---

శ్లో॥ న ధావతి జనాకీర్ణం నారణ్యముపశాంతధీః,
యథాతథా యత్రతత్ర సమ ఏవావతిష్ఠతే ॥ ౧౦౦ ॥

తా॥ ఉపశాంతినొందినజ్ఞాని యెటనున్నను ఎట్లున్నను సర్వదా ఆత్మసాక్షాత్కారము గలిగినవాఁడగుటచేత జనాకీర్ణమైన ప్రదేశమునందైనఁ దొలఁగఁడు, సర్వత్రశాంతుఁడగుటచే (శాంతికొఱకు) నిర్జనారణ్యప్రదేశమును గోరఁడు. జనసంమర్దమగు పట్టణమందుండినను, జనశూన్యమగు నరణ్యమునందుండినను ఎచటనుండినను ఆత్మారాముఁడగుటచే సర్వదా స్వస్థమానసుఁడై యుండును.

విశేషవిషయము:— ఈ (18) ప్రకరణమందుఁ బ్రతిపాదింపఁబ

డేనది "అనునస్య—రాజయోగము." సాధనచతుష్టయసంపన్నులైన యుక్తాధికారులకు సులభసాధ్యము. ఈ యోగమునకు సీతారామాంజనేయ సంవాదములో పంచదశయోగాంగములు వివరింపఁబడినవి. వాని యొక్క సంక్షేపార్థమేమనఁగా.—

1. నియమము.— జ్ఞానదృష్టిలో సమస్తదృశ్యమును దృక్కును బ్రహ్మముగానే యెంచి, అపరబ్రహ్మమే నేను అను నిశ్చయముతో సదా యుండుట.

2. నియమము.— కర్మేంద్రియములు తమతమ కార్యములు సేయుచున్నను, నేనీయింద్రియములకంటెను. ఇంద్రియార్థములకంటెను భిన్నుఁడను, కూటస్థుఁడను, ఆయాయింద్రియము లాయాకార్యములను జేయుచుండును, నాకేకార్యమును లేదు, నాకు సత్త్వాదిగుణములు లేవు. నిర్గుణుండను, కులగోత్రములును నామరూపములును నాకు లేవు. కేవలసచ్చిదానందస్వరూపుఁడను, అని తన యథార్థస్వరూపమును తెలిసికొని సదా యాబ్రహ్మజ్ఞానమును విడువకుండుట.

3. త్యాగము.— కూటస్థుఁడనైన నేను శరీరేంద్రియాదిసముదాయము కాను. వానికిని నాకును నెట్టి సంబంధము లేదు. వానికంటె భిన్నుఁడనై నిత్యుఁడనై వానిచే వికారములఁ గనునట్టి సాక్షీమాత్రుఁడను. నేను అనెడి నిశ్చయజ్ఞానముతో దృశ్యరూపమునం దభిమానమును విడిచి యుండుట.

4. మౌనము.— అవాఙ్మానసగోచరమగు పరబ్రహ్మము తానై మనస్సును సర్వదా బ్రహ్మమునందే నిలిపి యుండుట.

5. ఏకాంతదేశము.— ఆచార్యోపదిష్టమై, పరమపవిత్రమై, జ్ఞానభూమిక లేడింటిలోనుత్తమోత్తమమైనదై, మానవేంద్రియప్రాణములకుఁ జేరనశక్యమయినదై, వృత్తిరహితమై, ఆనందస్వరూపమయిన దద్వయో

అది బ్రహ్మము (పరమాత్మ). అదియే యేకాంతదేశము. (దీనిని గురుముఖమునఁ దెలిసికొనవలెనే కాని ఊహాపోహలవలనఁ దెలియశక్యము కాదు. ఇది వేదాంతమునకెల్ల కీలకము)

6. సుఖాసనము.— స్థూలసూక్ష్మకారణశరీరధర్మము లగు కాయక్లేశములు గాని, అలసత గాని, జడత్వము గాని, నిద్రగాని, అయాసము గాని లేని శుద్ధచైతన్యస్వరూపము బ్రహ్మవిద్వాంసుని యొక్క బ్రహ్మాకారమయిన యాసనము. ఇదియే బ్రహ్మాసన మనఁబడును.

7. సిద్ధాసనము.— సర్వకాలముల యందు నిశ్చలచిత్తముతో బ్రహ్మమే తానై యుండుట.

8. మూలబంధము.— విశ్వమన్నిటికి మూలమయినది మూలప్రకృతి. ఆమూలప్రకృతిని తొలఁగించునది పరబ్రహ్మానుభవము. పరబ్రహ్మమే సమస్తతత్త్వములకు మూలకారణము. అట్టి బ్రహ్మమే మూలబంధము.

9. దేహసామ్యము.— నదు లన్నియు సముద్రమునఁ జేరి నామరూపశూన్యములై సముద్రమే యగునట్లు ఇంద్రియములును, వృత్తులును బ్రహ్మానందమందు లయ మొంది సమభావము నొంది యుండుటయే దేహసామ్యమనఁబడును.

10. అమనస్కరాజయోగము.— దృశ్యము అని చెప్పఁబడు పృథివ్యాదిపంచభూతములు, దేశకాలములు, దేహేంద్రియప్రాణమనోబుద్ధిచిత్తాహంకారములున్ను యేదృక్కుచేతఁ దెలియఁబడుచున్నవో అదియె బ్రహ్మము. ఆబ్రహ్మము అద్వితీయము, పరిపూర్ణము, సర్వవ్యాపకము. కావున నిర్వికల్పసమాధినిష్ఠాగరిష్ఠులైన బ్రహ్మవిద్వరిష్ఠు లాబ్రహ్మమునందే సర్వదా లక్ష్యము నుంచుదురు.

11. ప్రాణాయామము.— అభరణము లన్నిటికిని బంగారము

పాదానకారణమయినట్లు ప్రాణమనోబుద్ధిచిత్తాహంకారాదు లన్నిటికిని ఉపాదానకారణమును, నిమిత్తకారణమును చైతన్యబ్రహ్మమే యని తెలిసికొని, యాబ్రహ్మమే తానై యుండుట. అనఁగా సర్వమును బ్రహ్మాకారముగఁ గనుట.

12. ప్రత్యాహారము.— సత్యానృతవిషయముల నెల్ల ప్రత్యగ్బోధస్వరూపపరమాత్మునిగా సదా చూచుచుండుట

13. ధ్యానము.— అనిత్యము లగు శరీరేంద్రియప్రాణాదిదృశ్యములను తెలిసికొనుచుండు దృక్స్వరూపుఁ డగు పరమాత్మను నేనని సదా చింతించుచుండుట.

14. ధారణ.— మనస్సుచేత నేది తలంపఁబడునో, యేది చూడఁబడునో అది యెల్లను బ్రహ్మమే యని, ఆబ్రహ్మమునే మనస్సునందు స్థిరముగా నిలుపుట.

15. సమాధి— జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలందుఁ గనఁబడు సమస్తమును బ్రహ్మమునుగా నిరంతరము నిరంతరాయముగ నెంచుచుండుటయే నిర్వికల్పసమాధి. ఇదియే యోగనిష్ఠ యనఁబడును. ||౧౦౦||

---

శాంతిశతకము

౧౫వ ప్రకరణము

సమాప్తము.

అది బ్రహ్మము. (పరమాత్మ). అదియే యేకాంతదేశము. (దీనిని గురుముఖమునఁ దెలియవలెనే కాని ఊహాపోహలవలనఁ దెలియశక్యము కాదు. ఇది వేదాంతమున కెల్ల కీలకము).

6. సుఖాసనము.— స్థూలసూక్ష్మకారణశరీరధర్మము లగు కాయక్లేశములు గాని, అలసత గాని, జడత్వము గాని, నిద్రగాని, ఆయాసము గాని లేని శుద్ధచైతన్యస్వరూపము. బ్రహ్మవిద్వరిష్ఠుని యొక్క బ్రహ్మాకారమయిన యునికి. ఇదియే బ్రహ్మాసన మనఁబడును.

7. సిద్ధాసనము.— సర్వకాలముల యందు నిశ్చలచిత్తముతో బ్రహ్మమే తానై యుండుట.

8. మూలబంధము.— దేనికి అన్నిటికి మూలమయినది మూలప్రకృతి. ఆమూలప్రకృతినిఁ దొలఁగించునది పరబ్రహ్మానుభవము. పరబ్రహ్మమే సమస్తతత్త్వములకు మూలకారణము. అట్టి బ్రహ్మమే మూలబంధము.

9. దేహసామ్యము.— నదు లన్నియు సముద్రమునఁ జేరి నామరూపశూన్యములై సముద్రమే యగునట్లు ఇంద్రియములును, వృత్తులును బ్రహ్మానందమందు లయ మొంది సమభావము నొంది యుండుటయే దేహసామ్యమనఁబడును.

10. అమనస్క రాజయోగము.— దృశ్యము లని చెప్పఁబడు పృథివ్యాదిపంచభూతములు, దేశకాలములు, దేహేంద్రియప్రాణమనోబుద్ధిచిత్తాహంకారములున్ను యేదృక్కు చేతఁ దెలియఁబడుచున్నవో అదియె బ్రహ్మము. ఆబ్రహ్మము అద్వితీయము, పరిపూర్ణము, సర్వవ్యాపకము. కాబట్టి నిర్వికల్పసమాధినిష్ఠాగరిష్ఠులైన బ్రహ్మవిద్వరిష్ఠు లాబ్రహ్మమునందే సర్వదా లక్ష్యము నుంచుదురు.

11. ప్రాణాయామము.— ఆభరణము లన్నిటికిని బంగారము

పాదానకారణమయినట్లు ప్రాణమనోబుద్ధిచిత్తాహంకారాదు లన్నిటికిని ఉపాదానకారణమును, నిమిత్తకారణమును చైతన్యబ్రహ్మమే యని తెలిసికొని, యాబ్రహ్మమే తానై యుండుట. అనఁగా సర్వమును బ్రహ్మాకారముగాఁ గనుట.

12. ప్రత్యాహారము.— సత్యానృతవిషయముల నెల్ల ప్రత్యగ్బోధస్వరూపపరమాత్మునిగా సదా చూచుచుండుట

13. ధ్యానము.— అనిత్యము లగు శరీరేంద్రియప్రాణాదిదృశ్యములను తెలిసికొనుచుండు దృక్స్వరూపుఁ డగు పరమాత్మను నేనని సదా చింతించుచుండుట.

14. ధారణ.— మనస్సుచేత నేది తలంపఁబడునో, కనుల చూడఁబడునో అది యెల్లను బ్రహ్మమే యని, ఆబ్రహ్మమునే మనస్సునందు స్థిరముగా నిలుపుట.

15. సమాధి— జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలందుఁ గనఁబడు సమస్తమును బ్రహ్మమునుగా నిరంతరము నిరంతరాయముగ నెంచుచుండుటయే నిర్వికల్పసమాధి. ఇదియే యోగనిష్ఠ యనఁబడును. ॥౧౦౦॥

---

శాంతిశతకము

౧౯-వ ప్రకరణము

సమాప్తము.

౧౯-వ ప్రకరణము

# ఆత్మవిశ్రాంత్యష్టకము.

శిష్యప్రోక్తము



అవ॥ ఈవిధముగా (శాంతిశతకమున) తత్త్వజ్ఞానియొక్క స్వభావమగు శాంతిలక్షణమును గురుముఖమున వినినవాఁడై శిష్యుఁడగు జనకరాజు కృతార్థుఁడై, తనగురువుగారికి పరితోషసమర్పణగా నిటుల "ఆత్మవిశ్రాంత్యష్టకము" నివేదించుచున్నాఁడు.—

**శ్లో॥ తత్త్వవిజ్ఞానసందంశ మాదాయ హృదయోదరాత్,**
**నానావిధపరామర్శశల్యోద్ధారః కృతో మయా ॥౧॥**

తా॥ ఓగురువర్యా! నాయందు పరిపూర్ణవాత్సల్యముతో తమరుపదేశించిన తత్త్వవిజ్ఞానరూపమగు పటుకారుతో నాహృదయగుహయందుండిన నానావిధసంకల్పము లనెడి శల్యములఁ బెఱికివైచి (సకలసంశయవిముక్తుఁడ నైతిని. అని భావము.) ॥౧॥

---

అవ॥--- ఆ సంగతినే స్పష్టపరచుచున్నాఁడు—

**శ్లో॥ క్వ ధర్మః క్వచవా కామః క్వచార్థః క్వ వివేకితా,**
**క్వ ద్వైతం క్వచవాఽద్వైతం స్వమహిమ్ని స్థితస్య మే॥**

తా॥ సర్వరము లగు ధర్మార్థకామములు సయితము శాస్త్రాదులు మునుండి తొలంగినవి. అందు వలన నిస్తరంగచిత్సాగరస్థితుండ నగు నాకిం జ్ఞానము, ద్వైతము, అద్వైతము, వనువానితో బ్రసక్తి లేదు. "ఉత్తీర్ణే తు సరిత్పారే నౌకయా కిం ప్రయోజనం" (ఏరు దాటిన పిమ్మట నౌకతో బ్రయోజనమేమి?) అను న్యాయమునుబట్టి, చిన్మాత్రవిశ్రాంతుండ నగు నాకిం జ్ఞానముతో బ్రయోజనము లేదు. ద్వైతము జ్ఞానబాధితము. అద్వైతము ద్వైతసాపేక్షితము. కనుక ద్వైతాద్వైతములు రెండును స్వాభావికములు కావు. అందువలన సచ్చిదానందస్వరూపుండనగు నాకిప్పుడు ద్వైతాద్వైత, జ్ఞానాజ్ఞానవిమర్శనమే లేదు. ॥౨॥

---

అవ॥— ద్వైత మిట్టిదని చెప్పిన విషయమునే విశేషించి శ్లోకపంచకముచేఁ జెప్పుచున్నాఁడు—

శ్లో॥ క్వ భూతం క్వ భవిష్యద్వా వర్తమానమపి క్వ వా,
క్వ దేశః క్వ చ వా నిత్యం స్వమహిమ్ని స్థితస్య మే ॥౩॥

తా॥ నిత్యపరిపూర్ణాత్మస్థితుండ నగు నాకు కాల మెట్టిదో స్ఫురింపనప్పుడు, భూతభవిష్యద్వర్తమానకాలభేద మెట్లు, దేశ మెట్టిది? పరిపూర్ణాత్మస్థితియందు కల్పితదేశకాలభేదస్ఫురణమే యుండదని భావము.౩.

---

శ్లో॥ క్వ చాత్మా క్వ చ వానాత్మా క్వ శుభం క్వాశుభం తథా,
క్వ చింతా క్వ చ వాచింతా స్వమహిమ్ని స్థితస్య మే॥౪

తా॥ "అతతి వ్యాప్నోతీతి ఆత్మా" అనఁగా సర్వత్ర వ్యాపించి నది ఆత్మ. "ఆత్మ" యను నామము జగదంశము. జగత్తు మిథ్యయగుటచే

ఆత్మ యను నామమును మిథ్యయే. నామరూపక్రియాశూన్యమై సర్వపరిపూర్ణమయినదియే ఆత్మ. అట్టి పరిపూర్ణానందాత్మస్థితుడ నగు (కేవలాత్మ లేక పరబ్రహ్మము నగు) నాకు ఆత్మానాత్మభేదము, శుభాశుభములు, చింతాచింతలు మొదలగు భేదములు లేవు. ||౪||

---

శ్లో॥ క్వ స్వప్నః క్వ సుషుప్తిర్వా క్వచ జాగరణం తథా,
క్వ తురీయం భయం వాపి స్వమహిమ్ని స్థితస్య మే॥౫॥

తా॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు, భయాదులును బుద్ధిధర్మములు గాని ఆత్మధర్మములు కావు. వీని నుపేక్షించియే వాగతీతమగు ఆత్మ తురీయమనఁబడును. కనుక చిదాత్మకు సాపేక్షిత మగుటచేత తురీయావస్థయు వాస్తవముగ లేదు. తుర్యాతీతమని చెప్పుట కూడ సాహసమే. వేదము సయితము ఇది మిథ్యమని చెప్పజాలక "నేతి నేతి" (ఇది కాదిది కాదు.) అని నిషేధించినదే కాని ఆత్మస్వరూప మిట్టి దని నిర్ణయించలేదు. కనుకనే పండితులు ఇట్టిది ఇట్టిది గా నిది ఆత్మయని (అనిర్వచనీయమయిన దని), బోధించిరి. అట్టి సర్వపరిపూర్ణాత్మనగు నాకు జాగ్రదాద్యవస్థలును, భయాదులును లేవు. ||౫||

---

శ్లో॥ క్వ దూరం క్వ సమీపం వా బాహ్యం క్వాభ్యంతరం క్వ వా,
క్వ స్థూలం క్వచ వా సూక్ష్మం స్వమహిమ్ని స్థితస్య మే॥

తా॥ సర్వపరిపూర్ణుఁడనగు నాకు మనోధర్మము లగుచుఁ గల్పితము లగు దూరసమీపబాహ్యాభ్యంతరాదినియమములు, స్థూలసూక్ష్మదృష్టులు వీమొదలగునవి లేనే లేవు. ||౬||

---

శ్లో॥ క్వ మృత్యుర్జీవితం వా క్వలోకాః క్వాస్య క్వ లౌకికం,
క్వ లయః క్వ సమాధిర్వా స్వమహిమ్ని స్థితస్య మే ॥

తా॥ కాలత్రయమందును సద్రూపుఁడనై స్వమహిమయందు నిశ్చలుఁడనగు నాకు జీవితమరణములు లేవు. పూర్ణ (బోధ) మాత్రదర్శినగు నాకు భూర్భువాది (కల్పిత) లోకములును లేవు. లోకసంబంధమగు కార్యమెద్దియు లేదు. పూర్ణుఁడనగు నాకు లక్ష్యమందు లయము సమాధి యనునవి లేవు. లక్ష్యమును లేదు. ॥౭॥

---

శ్లో॥ అలం త్రివర్గకథయా యోగస్య కథయాప్యలం,
అలం విజ్ఞానకథయా విశ్రాంతస్య మమాత్మని ॥౮॥

తా॥ తొలుత ధర్మార్థకామవిచారణచేత, పిమ్మట యోగాభ్యాసము చేత, తరువాత విజ్ఞానవిచారణచేత మిగుల నలసటఁ జెంది చెంది తుదకు ఆత్మవిశ్రాంతుఁడనై యున్న నాకిపు డా సాధనములతోఁ బ్రయోజనము లేదు. పరిపూర్ణాత్మవిశ్రాంతి కలుగువఱకు నీ ధర్మార్థకామములు యోగాభ్యాసాదులు జ్ఞానసిద్ధికి సాధనము లగును. "సిద్ధేఽర్థే సాధన క్రియ వ్యర్థాత్" (కావలసిన కోరిక నెరవేరిన పిమ్మట సాధనములతోఁ బ్రయోజనము లేదు) అనునట్టి పరిపూర్ణాత్మ నగు నాకిపు డట్టి సాధనములతోడను బ్రయోజనము లేదు. ॥౮॥

---

ఆత్మవిశ్రాంత్యష్టకము
౧౯-వ ప్రకరణము
సమాప్తము.

౨౦-వ ప్రకరణము

# జీవన్ముక్తిచతుర్దశకము.

శిష్యప్రోక్తము.

---

అవ॥— ఇదివరకుఁ జెప్పిన ఆత్మవిశ్రాంతికి (ప్ర॰ ౧౯) ఫలితమై జ్ఞానికి స్వాభావభూతమగు జీవన్ముక్తిదశను శిష్యుఁడు పదునాల్గు శ్లోకములచే నిరూపించుచున్నాఁడు:—

శ్లో॥ క్వ భూతాని క్వ దేహో వా క్వేంద్రియాణి క్వ వా మనః,
క్వ శూన్యం క్వ చ నైరాశ్యం మత్స్వరూపే నిరంజనే॥

తా॥ నాస్వరూపము నిరంజనము (సర్వోపాధిశూన్యమైనది.) అట్టి నాయందు పృథివ్యాదిపంచభూతములు, దేహేంద్రియమనోవ్యాపారములు నుండుటెట్లు? ఇవి యన్నియుఁ గల్పితమాత్రములే కాని నిజముగా లేనేలేవు. అయితే శూన్యమా యనెదవేని కాదు. ఏమన (సర్వపరిపూర్ణ) సద్రూపుండను శూన్యత్వమును సంభవింపదు. వాంఛ, వాంఛాభావము ననెడి కల్పితభావములును సంభవింపవు. ॥౧॥

---

శ్లో॥ క్వ శాస్త్రం క్వాత్మవిజ్ఞానం క్వ వా నిర్విషయం మనః,
క్వ తృప్తిః క్వ వితృష్ణత్వం గతద్వంద్వస్య మే సదా॥౨॥

తా॥ ఆత్మవిశ్రాంతివలన సర్వమును గళితప్రాయమగుటచే సుఖదుఃఖాదిద్వంద్వములు లేని నాకు శాస్త్రముతో గాని, శాస్త్రజన్యవిజ్ఞాన

ముతో గాని పరిసక్తి లేదు. మనస్సు గళితప్రాయమయినందున (ఆత్మ యందు మనస్సు లయించుటవలన) మనస్సు నిర్విషయమగుటుండుటయును లేదు. అటులనే చిత్తమును గళితప్రాయ మగుటవలన వ్యాప్తియు, వ్యాప్తిసాధన మగు నైరాశ్యమును (వాంఛాభావమును) లేవు. ॥౨॥

---

శ్లో॥ క్వ విద్యా క్వచ వాఽవిద్యా క్వాహం క్వేదం మమ క్వవా,
క్వ బంధః క్వచ వా మోక్షః స్వరూపస్య క్వరూపితా॥

తా॥ అద్వితీయచిన్మాత్రుండ నగు నాకు ద్వితీయసంబంధము (ఆత్మేతరస్ఫురణము) లేదు కనుక మనోధర్మము లగు విద్యావిద్యలు, అహంకారమమకారములు, బంధమోక్షములును లేవు. కారణ మేమన, నిర్విశేషస్వరూపుండ నగు (నాకంటె ఇతర మెద్దియు స్ఫురింపని) నా యందు ఆరోపితము లగు విద్యావిద్యాదిధర్మములు వాస్తవముగ లేవని ఫలితార్థము. ॥3॥

---

శ్లో॥ క్వ ప్రారబ్ధాని కర్మాణి జీవన్ముక్తిరపి క్వవా,
క్వ తద్విదేహకైవల్యం నిర్విశేషస్య సర్వదా ॥౪॥

తా॥ నిర్విశేష (ఇతర మెద్దియును లేని) సిద్ధస్వరూపుండ నగు నాకు ప్రారబ్ధము, కర్మము, జీవన్ముక్తి, విదేహకైవల్యము మొదలగు (కల్పిత) ధర్మములు లేవు. ॥౪॥

---

శ్లో॥ క్వ కర్తా క్వచ వా భోక్తా నిష్క్రియం స్ఫురణం క్వవా
క్వాపరోక్షం ఫలం వా క్వ నిస్స్వభావస్య మే సదా ॥

తా ॥ యేస్వభావమును లేని నిర్మలచిన్మాత్రాత్మనగు నాకు కర్తృత్వభోక్తృత్వనిష్క్రియత్వస్ఫురణము లేదు. అపరోక్ష (ప్రత్యక్షరూపమగు) జ్ఞానమును లేదు. విషయావచ్ఛిన్నఫలమగు చైతన్యజ్ఞానమును లేదు. ॥౫॥

శ్లో ॥ క్వ లోకః క్వ ముముక్షుర్వా క్వ యోగీ జ్ఞానవాన్క్వ వా,
క్వ బద్ధః క్వ చ వా ముక్తః స్వస్వరూపేఽహమద్వయే ॥౬॥

తా ॥ నేను, ఇది, అది, యీ మొదలగు రూపభేదము లేని అకల్పితశుద్ధాత్మాద్వైతస్వస్వరూపుఁడ నగు నాకు మిథ్యాకల్పితము లగు లోకము, ముముక్షువు, యోగి, జ్ఞాని, బద్ధుఁడు, ముక్తుఁడు, మొదలగు సంకేతములు లేవు. ॥౬॥

శ్లో ॥ క్వ సృష్టిః క్వ చ సంహారః క్వ సాధ్యం క్వ చ సాధనం,
క్వ సాధకః క్వ సిద్ధిర్వా స్వస్వరూపేఽహమద్వయే ॥౭

తా ॥ ఆత్మాద్వైతస్వస్వరూపుఁడ నగు నాయందు (అద్వయపరమాత్మరయే నేనై యుండు నాయందు) కల్పితము లగు సృష్టి, సంహారము, సాధ్యము, సాధకము, సిద్ధి, యీ మొదలగు భేదములు వర్తింపవు. ॥౭॥

శ్లో ॥ క్వ ప్రమాతా ప్రమాణం వా క్వ ప్రమేయం క్వ చ ప్రమా,
క్వ కించిత్క్వ న కించిద్వా సర్వదా విమలస్య మే ॥౮॥

తా ॥ సర్వదా (కాలత్రయమందును) ఉపాధిసంబంధములకున్యనిర్మలాత్మనగు నాకు ప్రమాతృప్రమాణప్రమేయప్రమాసంబంధము లే

డు. సర్వసంబంధశూన్యుఁడనగు నాకంటె నన్యము లేదు, శూన్యమును లే
దు. (ప్రమాత= తెలియువాఁడు; ప్రమాణము=ప్రత్యక్షాదిజ్ఞానకారణ
ము. ప్రమేయము=యథార్థముగా ఎఱుఁగదగినది. ప్రమ=యథార్థజ్ఞా
నము.) ॥౮॥

---

శ్లో ॥ క్వ విక్షేపః క్వ చైకాగ్ర్యం క్వ నిరోధః క్వ మూఢతా,
క్వ హర్షః క్వ విషాదో వా సర్వదా నిష్క్రియస్య మే ॥౯॥

తా ॥ కాలత్రయమందును నిష్క్రియచిన్మాత్రుఁడనగు నాకు వి
క్షేపము, ఏకాగ్రత, ఇంద్రియనిగ్రహము, మూఢత్వము, హర్షము నను
మానసికవ్యాపారములును లేవు. ॥౯॥

---

శ్లో ॥ క్వ చైష వ్యవహారో వా క్వ చ సా పరమార్థతా,
క్వ సుఖం క్వ చ వా దుఃఖం నిర్విమర్శస్య మే సదా ॥

తా ॥ వృత్తిజ్ఞానమే లేకుండఁ బ్రజ్ఞానమాత్రుఁడ నగు నాకు వ్యా
వహారిక పదార్థజ్ఞానము, పరమార్థతాజ్ఞానము, సుఖదుఃఖాదులును లేవు. ఇవి
యన్నియు ధీవృత్తులే యగుట చేత ధీసాక్షినగు నాకు వీనిసంబంధము లేద
ని భావము. ॥౧౦॥

---

శ్లో ॥ క్వ మాయా క్వ చ సంసారః క్వ ప్రీతి ర్విరతిః క్వ వా,
క్వ జీవః క్వ చ తద్బ్రహ్మ సర్వదా విమలస్య మే ॥౧౧॥

తా ॥ నిరుపాధిమలశూన్యుఁడ నగు నాకు (చిదాత్మకు) సంసార

ము, దానియందు ప్రీతి విరక్తియు లేవు. జీవభావమును బ్రహ్మభావమును లేదు. (కార్యోపాధి లేనందున జీవత్వము లేదు. కారణోపాధియు, వ్యాప్యవస్తువును లేనందున బ్రహ్మభావము లేదు అని భావము) ॥౧౧॥

---

శ్లో॥ క్వ ప్రవృత్తిర్నివృత్తిర్వా క్వ ముక్తిః క్వ చ బంధనం,
కూటస్థనిర్విభాగస్య స్వస్థస్య మమ సర్వదా ॥౧౨॥

తా॥ కూటస్థుండను, నిష్క్రియుండను, భేదరహితుండను, సర్వదా స్వస్థుండను (స్థిరస్థాయిని) నగు నాకు ప్రవృత్తినివృత్తులు, బంధమోక్షములు లేవు. ॥౧౨॥

---

శ్లో॥ క్వోపదేశః క్వ వా శాస్త్రం క్వ శిష్యః క్వ చ వా గురుః,
క్వ చాస్తి పురుషార్థో వా నిరుపాధేః శివస్య మే ॥౧౩॥

తా॥ ఉపాధిశూన్యుండను. నిత్యానందశివస్వరూపుండను నగు నాకు మాయామయోపాధులు, శిష్యునకుపదేశమును చేయుటయును, ఉపదేశముతో గాని ఉపదేశశాస్త్రముతో గాని ప్రయోజనము లేదు. గురుశిష్య భావమును లేదు. మఱియు, నిరుపాధిస్వరూపుండను నగు నాకు మాయాకల్పితము లగు ధర్మార్థకామమోక్షములను పురుషార్థములు లేవు. ॥౧౩॥

వి— మాయాకల్పితము లగు కార్యకారణభావము, శిష్యాచార్య భావము, పితృపుత్రాదిభావము మను నీ మొదలగు భావములు జాగ్రత్స్వప్నములందే యున్నవి కాని చిదాత్మయందు కించిన్మాత్రమును లేవని శ్రీశంకరాచార్యులవారు దక్షిణామూర్తి స్తోత్రములో సెలవిచ్చిరి.

శ్లో॥ విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామిసంబంధతః

శిష్యాచార్యతయా తథైవ పితృపుత్రాద్యాత్మనా భేదతః।
స్వప్నే జాగ్రతివా య ఏష పురుషో మాయాపరిభ్రామిత
స్తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥

---

అవ॥— జీవన్ముక్తదశ నుపసంహరించుచున్నాఁడు—

శ్లో ॥ క్వచాస్తి క్వచవా నాస్తి క్వాస్తి చైకంక్వచద్వయమ్,
బహునాత్ర కిముక్తేన కించి న్నోత్తిష్ఠతే మమ ॥౧౪॥

తా ॥ చిద్ఘనపరిపూర్ణుఁడ నగు నాకు కలదు లేదు, ఒకటి రెండు, నీమొదలగు కల్పితభేదములు స్ఫురింపవు. ఇవి భావవికారములు; అనఁగా సంసారమందలి పదార్థములకుఁ గల, "1 జాయతే, 2 అస్తి, 3 వర్ధతే, 4 పరిణమతే, 5 అపక్షీయతే, 6 వినశ్యతి," అనెడి షడ్భావవికారములు ను శివస్వరూపలక్ష్యాత్మనగు నాకు లేవు. భేద ముపాధికల్పితము, ఆత్మ అనంతము, అనిర్వచనీయము, అద్వితీయము. పెక్కుమాట లేల చిదేకరూపుఁడనగు నాకంటె నన్య మెద్దియును లేదు. మాయాకల్పితము అగు నామరూపములకుఁ గల సత్తాస్ఫూర్తులు ఆత్మసత్తాస్ఫూర్తులే కాని వానికంటె వేఱు కావు. అని వేదాంతరహస్యము. ॥౧౪॥

—•ఈప్రకరణమందు వివరింపఁబడిన జీవన్ముక్తలక్షణములు•—

౧. ఆత్మ నిరంజనము, (సర్వోపాధిమలశూన్యము).
౨ ,, ద్వంద్వరహితము, (తనకంటె నన్యమెద్దియును లేనిది).
౩ ,, అహంమమతారహితము, (అహంకారమమకారములు లేనిది యనక జ్ఞానాజ్ఞానములు, బంధమోక్షములు లేనిది).
౪ ,, నిర్విశేషము, (తనకంటె విశేష మెద్దియును లేనిది. ప్రార

ద్ధము, కర్మ, జీవన్ముక్తి, విదేహకైవల్యము, మొదలగు ధర్మములు లేనిది.)

౫. " నిఃస్వభావము, (ఏస్వభావము, గుణము, రూపము లేనిది.)

౬. " అద్వయస్వస్వరూపము, (అది, ఇది, అట్టిది, అని చెప్పశక్యము గాని సర్వపరిపూర్ణానంద స్వరూపము).

౭. " అద్వయము.

౮. " విమలము, (ఉపాధిమల సంబంధశూన్యమైనది).

౯. " నిష్క్రియము, (క్రియాశూన్యమైనది).

౧౦. " నిర్విమర్శము, (వృత్తిజ్ఞానశూన్యము).

౧౧. " ఉపాధిమలశూన్యము.

౧౨. " స్వస్థము, (నిర్విభాగకూటస్థము).

౧౩. " నిత్యానందశివస్వరూపము, (షడూర్మిరహితము, శివస్వరూపము).

౧౪. " అకించనము, (ఏమియుఁ గానిది).

ఈపద్నాల్గు శ్లోకములలో జెప్పబడిన విశేషములు స్థూలారుంధతీన్యాయమున పరమాత్మతత్త్వముం దెలుపుటకై కల్పితములు. ఆత్మవ్యతిరిక్తములు. తెలిసి, తెలిసినొంది, తెలియక, తెలియబడకుండుటయే జ్ఞానియొక్క లక్షణములు. (అరుంధతీనక్షత్రము అతిసూక్ష్మము అదృశ్యము. దీనినిఁ జూపుటకై దీనిపైని ఉన్న వసిష్ఠనక్షత్రమును జూపి దానిక్రింద మిణుకుమిణుకుమనియెడి తార అరుంధతియని బోధింతురు. ఇదియే స్థూలారుంధతీన్యాయము).

జీవన్ముక్తి చతుర్దశకము.

సమాప్తము.

---

అనిర్వాచ్యాపరిమితానంద కోటినిఁ బ్రదర్శించిన సద్గురువున కనేక నమస్కారములు.

ఈ అష్టావక్రగీత నుపదేశించిన గురుమూర్తికిని, దీనికాంధ్రవ్యాఖ్య రచించిన బ్రహ్మణ్యమూర్తికిని శతకోటికోటి వందనములు.

అష్టావక్రమునేర్వాచి వాక్యాన్యేతాన్యపి మాలికా,
పుష్పమాలానుషంగేణసూత్రంమూర్ధ్నివధార్యతామ్॥

మహామహుఁ డగు అష్టావక్రముని చంద్రనివలనఁబ్రణీతంబై యుత్తమోత్తమయిన యీగీతయందు రచియింపఁబడిన యాంధ్రటీక పుష్పమాలిక యందు గుచ్ఛఁబడిన దారమువలె సజ్జనులచే ధరింపఁ బడుఁగాక.

ఓం తత్సత్.

---

